# NETI MANAVUNI KRUSHI

*A Telugu rendering by C. Dikshitulu*

OF

## THE STRUGGLE OF MODERN MAN

BY

F. G. PEARCE

First published 1947 ప్రథమ ముద్రణము 1947

మస్యల ని
-చితిని. సమ
ఆలోచించు
. చదివిన
మ. సర
చేయు

India at the B. N. K. Press, Madras 1,
100/B) and published by Geoffrey Cumberlege,
Madras (Paper Issue Card No. MS. 1)



# పీఠిక

సరళము సులభము అగు భాషలో వ్రాయబడిన ప్రపంచ చరిత్ర సంగ్రహమునకు అవసరమున్నది. చరిత్ర, భూగోళము, పౌరనీతి, అర్థశాస్త్రము, రాజనీతివంటి 'సంఘ శాస్త్రములు', హైస్కూలు విద్యార్థులును, ఇంకను పై తరగతులవారును అవగాహన చేసికొనుటకది పనికివచ్చును. అంతటితో చదువు చాలించుకొను మిడిల్ స్కూలు విద్యార్థులకును కూడ అది అవసరమే. ప్రపంచ చరిత్రతో పరిచయము చేసికొనకుండ హిందూదేశ చరిత్ర పఠించు వారికి సమగ్రజ్ఞాన మలవడదు. హైస్కూళ్లలో ఇంగ్లీషువారి చరిత్రగాని, బ్రిటిషు సామ్రాజ్య చరిత్రగాని పఠించువారి విషయమును అంతే. ప్రపంచమున నెట్టి సంఘటనలు సంభవించు సమయమున తమ జాతీయచరిత్ర యను నాటక మాడబడినదో విద్యార్థులు గ్రహించిన గాని ఆ చరిత్రయొక్క ప్రాముఖ్యము పూ...... వెల్లడికాదు.

ంవు సాగించదలచిన వారికి ప్రపంచ చరిత్ర యావత్తును ఒకమారు
5. తూర్చ మిక్కిలి ఉపయోగకరము. అట్టివారికే గ్రంథకర్త 'Foot-
8 1 the Sands of Time' అను గ్రంథమును రచించెను. ఇందు
9లగు స్త్రీ పురుషుల జీవితములను పురస్కరించుకొని మానవ చరిత్ర
6. ...మగా పర్యాలోకింపబడినది. ...ందరు ఉపాధ్యాయులు నేటి కాలపు
ప్రాధాన్యము : విదా...నకాలపు చరిత్రను వదలిపెట్ట నిచ్ఛగింతురు.
వ్రాయబడ్డది. క్రీ. శ. 1450 నుండి నేటివరకును
11 పాఠము : ...విషయము లిందుగలవు. ఇందలి భాష, రచనావిధా
7. జాతీయత ప్రారంభ ముందున్న తరగతి విద్యార్థుల కుచితముగా నుండును.
12 పాఠము : ఒక సంవత్సరములో సులభముగా ముగించవచ్చును.
13 పాఠము చేర్చిన విషయములేమి ...కలిపెట్టిన విషయము లేమి ?
14 పాఠము ...కమాట చెప్పవలసియు...న్నది. ఇంత చిన్నగ్రంథములో
సంగ్రహించునప్పుడు ఎట్టి విషయములు పరిహరింపవలెనను

నది ప్రధాన సమస్య. దీనిని పరిష్కరించుటకై నేను, ఈ గ్రంథము భారతదేశమందలి బాలురకును బాలికలకును ఉద్దేశింపబడినదను మాట మనస్సునఁ బెట్టుకొంటిని. భారతదేశ చరిత్రకు సంబంధించినట్టియు, భారతదేశ విద్యార్థికనురక్తి గలిగించునట్టియు విషయములకే ప్రాధాన్యమిచ్చితిని. హిందూదేశ చరిత్రనుండి విషయములు గ్రహించు సందర్భమున, హిందూదేశ చరిత్ర ప్రధానమైనప్పటికిని ప్రపంచమునకు సంబంధించని విషయములను వదలిపెట్టితిని. ప్రపంచమునందలి ఇతర భాగములందు జరిగిన సంభవములతో సన్నిహిత సంబంధమున్న పురుషులను, సంఘటనలను ప్రాచ్యదేశ చరిత్రనుండి గ్రహించి ఇందు చేర్చితిని. ఉదాహరణము : చీనావారితో సంసర్గ కారణముగా యూరోపులో నావికా దిక్సూచి ప్రవేశపెట్టబడెను. దానినిబట్టి నూతన సముద్రమార్గములు, నూతన భూఖండములు కనిపెట్టబడినవి. ఔరంగజేబు, శివాజీల మరణానంతరము ఇండియాలో ఐకమత్యము చెడుటవల్ల యూరోపుదేశస్థులు ఇండియా నాక్రమింప వీలు కలిగెను.

'నేటి మానవుని కృషి'లో అతడు పరిష్కరింప వలసిన స[illegible] చిన్నగ్రంథమున సాధ్యమైనంతవరకు సూచించుటకు ప్రయత్నిం[illegible] యము వచ్చినప్పు డీ సమస్యల నెట్లు పరిష్కరించవలసి యుండునో [illegible]టకు ఇందలి మూల ప్రశ్నలును అభ్యాసములును. ఉపయోగపడున[illegible] విషయములు నెమరుకు తెచ్చుకొనుటకును మూలప్రశ్నలు పనికివచ్చు[illegible] బాగా ఈ గ్రంథము చదువుకొనువారికిని, [illegible] అభ్యాసము[illegible] వారికిని కూడ ఇవి ఉపకరించును.

[illegible]

విక్టోరియా కాలేజి
గ్వాలియరు
మే 1945

# విషయసూచిక

# చిత్రముల పట్టి

# 1. నాగరీకుడగుటకు నేటి మానవుడు చేయు కృషి

## 1 పాఠము : నాగరికత యననేమి?

[మూలప్రశ్న 1 : మనము నాగరీకులమగుటకు తోడ్పడు నాలుగుఅంశము లేవి?]

§1. నేటి మానవుడు నాగరీకుడగుటకు కృషి చేయుచున్నాడన్న నాశ్చర్యకరముగా నుండును. మనము నాగరీకులము కామా?

నాగరీకమన్న నేమో తెలిసికొన్నగాని పై శంక తీరదు. రైళ్లు మొదలైన వుండుట నాగరికత కాదా? ప్రాచీన హిందూస్థానమున నవి లేకున్నను అప్పటిప్రజలు నాగరీకులే.

మేడలలో నివసించుట, చక్కని దుస్తులు వేసికొనుట మున్నగునవి నాగరీక లక్షణములు కావా? అట్లు చేయని గాంధీ మహాత్ముడు నాగరీకుడే.

అయిన నాగరికత యన నేమి? జోడ్ అను తత్వశాస్త్రజ్ఞుడు (philosopher) రచించిన ''నాగరికతాచరిత్ర'' యను గ్రంథమున మనము నాగరీకుల మగుటకు తోడ్పడు అంశములు కలవు. అవి, 1 చక్కని వస్తువుల తయారుచేయుట 2 స్వేచ్ఛగా యోచించుట 3 క్రొత్త వస్తువులగూర్చి యోచించుట 4 కలిసి మెలిసి యుండుటకు కావలసిన నిబంధనల పాటించుట.

ఈ పనులన్నియు మనము చేయుచున్నామా? హిందూదేశస్థులు చాలా చక్కని వస్తువులు చేయుచున్నారు. నగిషీపాత్రలు మున్నగునవి. కాని మనగ్రామములు అపరిశుభ్రమై, పట్టణములు జనసంకీర్ణమై అందవికారముగా నున్నవి.

మనము స్వేచ్ఛగా యోచించుచున్నామా? యోచించిన ప్రకా

రము చెప్పి వ్రాయుచున్నామా? మనకు పూర్తిగా స్వేచ్ఛలేదు. కాని ప్రకటించుటకు వీలుకాని విషయములు మాత్రము కొద్దిగానే ఉన్నవి.

మనము క్రొత్తవస్తువులనుగూర్చి యోచించుచున్నామా? అనగా, జ్ఞానాభివృద్ధి చేసికొనుట, భూమిని, జంతువులను, వృక్షములు మున్నగువానిని గురించి క్రొత్తసంగతులు తెలిసికొనుట ఈ విషయమున మానవుడు నాగరీకుడే. అతడెన్నో విషయముల నేడు కనిపెట్టెను. కనిపెట్టిన వారిలో ఇండియనులున్నారు కాని ప్రాతవిషయములసత్యములైనను వానిని మనము వదలలేదు. హరిజనులనణచిపెట్టితిమి. అమెరికాలో కొందరు నీగ్రోల నీసడింతురు. ధనవంతులు బీదలను బానిసలుగా చూతురు. ఇది నాగరీక ప్రవర్తనము కాదు.

కలిసిమెలిసి యుండుటకు కావలసిన నిబంధనలను మనము పాటించుచున్నామా? ఆ నిబంధనలు దేశచట్టములు. నేడు తగవుల పరిష్కరించుటకు కోర్టులున్నవి. తగవుల తీర్చుకొనుటకిది శాంత మార్గము. శత్రువులు తమలో తాము కొట్లాడుటవల్ల ఎవరు బలవంతులో తేలునుగాని ఎవరిది న్యాయపక్షమో తేలదు.

[మూలప్రశ్న 2 : ఒక దేశప్రజల దుష్ప్రవర్తన నేడు మన కెట్టి చిక్కులు తెచ్చిపెట్టుచున్నది?]

§2. మానవుల యంతఃకలహములను నాగరీక పద్ధతిని పరిష్కరించుట మనము నేర్చికొంటిమి కాని జాతులలో సంభవించు కలహముల నారీతినే పరిష్కరించుట మన మింకను నేర్చుకొనలేదు. న్యాయమూర్తి సహాయముతో జాతులు తమ కలహములను పరిష్కరించుకొనుచున్నవా? నానాజాతిసమితి (League of Nations) యుద్దేశమదియే. కాని న్యాయమూర్తి తీర్మానమును వారొక్కొక్కప్పుడు అంగీ

కరించరు. అట్టి సమయములో యుద్ధమే శరణ్యము. అది నాగరీక పద్ధతియా ? ఇట్టి కలహములు తీర్చుకొనుటకు మంచి మార్గములు కనిపెట్టుటకై పెద్దలు పూనుకొన్నారు. ప్రపంచయుద్ధానంతరము ఏప్రియల్ 1945 లో శాంఫ్రాంసిస్కోలో జరిగిన పెద్ద సమావేశము యొక్కయుద్దేశ మిదియే.

చిన్నవిషయములు పెక్కింటిలో, నిబంధనలు పాటించు విషయమున మనము పూర్తిగా నాగరీకులము కాలేదు. ఇండియాలో క్యూ (queue) పద్ధతిని నిలుచుండుట ఇప్పుడిప్పుడే నేర్చుకొనుచున్నాము. అట్టి నిబంధనలను ఆచరణలో పెట్టుట నాగరీకలక్షణ మనిపించుకొనును.

పై విషయములబట్టి ఏజాతియు పూర్తిగా నాగరికత చెందలేదు. ప్రతిజాతియందును నాగరీకముగా ప్రవర్తించువారున్నారు. దుర్మార్గులును ఉన్నారు. ప్రపంచమం దింకను నాగరికత చెందినవారి కంటె చెందనివారి సంఖ్యయే అధికము.

ఈ గ్రంథమునకు 'నేటి మానవునికృషి' అని పేరిడుటకు కారణము గ్రహించియుందువు. మనమందరమును నాగరీకుల మగుటకు ప్రయత్నించుచున్నాము. చక్కని వస్తువులు చేయుటకు మనము తోడ్పడవలెను. క్రొత్తవిషయములను కనిపెట్టవలెను. సత్కార్యముల మన మాచరించవలెను.

నేడు శాస్త్రపరిశోధనలు కారణముగా లోకమంతయు నొక్కటైనది. అమెరికాలోని ఎడిసన్ చేసిన యోచనలు మన జీవితములందు మార్పులు తెచ్చిపెట్టినవి. జర్మనీ జపానుల యోచనలు ప్రపంచమునంతయు యుద్ధజ్వాలల ముంచినవి. వంగదేశక్షామమునకు ఆస్ట్రేలియా గోధుమలు పంపినది. ఒక ప్రసిద్ధుడగు అమెరికన్

చెప్పినట్లు మనము నివసించుచున్నది ఒక్క ప్రపంచమే. వెనుకటి కాలమువారు చేసిన తప్పులను తెలిసికొని అట్టి తప్పులు మనము చేయకుండనుండవచ్చును. వారుచేసిన నాగరీక కార్యముల తెలిసికొని మనము నాగరీకమును వృద్ధిచేసికొనవచ్చును. చరిత్రవలన కలుగు ప్రయోజనములలో నిదియొక్కటి.

అ భ్యా స ము లు

1. ఇండియాలో తయారుచేసిన అందమగు వస్తువులు అందవికారమగు వస్తువులు జాబితాలుగా తయారుచేయుము.

2. హిందూదేశమందలి కొందరి శాస్త్రజ్ఞుల పేర్లను వ్రాయుము. తెలిసిన యెడల వారు కనిపెట్టిన విషయములనుగూర్చి కూడ వ్రాయుము.

3. అసత్యములని నిరూపింపబడిన 'ప్రాతవిషయముల'ను కొన్నింటిని వ్రాయుము.

4. కలిసిమెలిసి యుండుటకు అవసరమగు నిబంధనలను మరికొన్నింటిని చేర్కొనుము.

# 2. క్రొత్తజ్ఞానమునకు క్రొత్తమార్గములు

## 2 పాఠము: రోజర్ బేకన్; మార్కోపోలో; ముద్రణ.

[మూలప్రశ్న 3: మార్కోపోలో; 'అంధకారయుగములు' (dark ages) అనుకాలమున బుద్ధిమంతులగు పురుషులు స్త్రీలు మఠములను (monasteries) కాన్వెంటులను (convents) ఏల ప్రవేశించిరి? అచ్చట వారేమిచేసిరి?]

§3. ఆసియా యూరోపుఖండములలో హూణదండయాత్రలు క్రీ. వె. 500 సం॥ వరకు అనేకవందల సంవత్సరములపాటు నడచినవి. ఈకాలమునకు 'అంధకారయుగము'లని (Dark Ages) పేరు. ఈకాలమున శాంతినికోరునట్టియు విద్యాసక్తిగలట్టియు పురుషులును స్త్రీలును మఠములలోగాని కాన్వెంటులలోగాని గుహాలలో

గాని తలదాచుకొనుచుండిరి. అజంతా, ఎలిఫాంటా, ఎల్లోరాగుహ లిట్టివే. అందు వారు విద్యావ్యాసంగములు, ధ్యానము సాగించు కొనగలిగిరి. ఇట్టి మఠస్థులు (monks) సన్యాసినులు (nuns) మతము నందు మాత్రమే ప్రీతికలవారని తలంచరాదు. అజంతా ఎల్లో రాలనుబట్టి వారిలో కొందరు చిత్రకారులనియు, శిల్పులనియు తేలు



రోజర్ బేకన్ [ప్రాత వ్రాతప్రతినుండి]

చున్నది. మరికొందరు శాస్త్రాభిమానులు. యూరోపులో నిట్టి వారిలో ప్రథముడు రోజర్ బేకన్. అతడు ఆక్స్ఫర్డులో మఠస్థుడుగా నుండి జీవితమంతయు శాస్త్రప్రయోగములు చేయుచు గడపెను. సుమారు క్రీ. వె. 1250 సంవత్సరమున అతడు తుపాకిమందు చేయుట కనిపెట్టెను.

ఆ కాలమున యూరోపుకన్న ఆసియా అభివృద్ధిలోనుండెను. చీనా దేశస్థులు తమ దేశముచుట్టును గొప్ప గోడనొకటి నిర్మించి

హూణదండయాత్రలు తమ దేశముపై రాకుండ జేసికొనిరి. వందల సంవత్సరములపాటు చీనా, ప్రపంచమందెల్ల మిక్కిలి నాగరికతగల దేశముగా వన్నెగాంచెను. గుప్తరాజుల పాలనమందున్న హిందూ దేశము కూడ చీనా తరువాత చెప్పుకోదగ్గ దేశము. చీనా దేశస్థులు కాగితమును చేయుట కనిపెట్టిరి. కర్రదిమ్మలతో కాగితములపై ముద్రించుచుండిరి. అందమైన కుండలనుచేసిరి, తుపాకిమందును కూడ కనిపెట్టిరి. తేయాకును పానీయముగా చేసికొనుటను వారు కనిపెట్టిరి.

మార్కోపోలో వెనీస్ కాపురస్థుడు. బాలుడుగా నున్నప్పుడు, గొప్ప ఖాన్ అను బిరుదుగల కుబ్లైఖాన్ దేశమునుచూడ యాత్ర వెడలెను. బయలుదేరిన 30 సంవత్సరములకు తిరిగివచ్చి వెనీస్ చేరుకొనెను. అతడు చీనాలోని యద్భుతవిషయములను అక్కడి వారి కెరిగించెను. పిమ్మట మార్కోయాత్రాచరిత్ర గ్రంథరూపము నందెను. చీనాకు వెళ్లవలెనని కొలంబసుకోరుట కీగ్రంథ మొక కారణము. ఆసియాగుండా మార్కో చేసిన యాత్రలు ప్రోత్సహించగా కొలంబసు అట్లాంటిక్ సముద్రముగుండా అమెరికాకు యాత్రచేసెను.

[మూలప్రశ్న 4 : క్రీ. శ. 1450 సం॥ నుండియు యూరోపులో జ్ఞానము వ్యాపించుటకు తోడ్పడిన కార్యములును, నూతనముగా కనిపెట్టబడిన విషయములును ఏవి ?]

§4. క్రీ. శ. 800 సం॥ ప్రాంతమున అంధకారయుగములు అంతమయ్యెను. తరువాత మధ్యయుగములు వచ్చెను. వీనికి ఫ్యూడల్ యుగ (Fuedal age) మనిపేరు. ఆకాలమున నాగరీకులని లోక ప్రసిద్ధిగన్నవారు అరబ్బులు. హారూన్ అల్ రషీడ్ అను కాలీఫు అందు ప్రసిద్ధుడు. అతనికొరకే యువనయామినీ వినోదములను 1001

కథలు రచింపబడినవి. అతనికాలమున అరబ్బుల సామ్రాజ్యము సింధుదేశము మొదలు స్పెయినుదేశమువరకు వ్యాపించియుండెను. పెక్కు విశ్వవిద్యాలయములు (universities) బాగ్దాదులోను, కెయిరోలోను, స్పెయినులోనున్న కార్డోబాలోను వెలసినవి. ఇందలి పండితులు బహుశాస్త్రప్రవీణులు. మధ్యయుగములలో నీ విజ్ఞానము యూరోపుదేశములకు రా దొడగెను. కాని ఆ కాలమున రోజర్ బేకన్ వంటి మస్తిష్కులుతప్ప పుస్తకములు చదువగలవారు మిక్కిలి కొద్దిగానుండిరి. అప్పుడు అక్షరముద్రణ (printing) లేదు. అన్నిగ్రంథములను చేతితో వ్రాసికొనవలసియుండెను. కాన బీద వారు చదువనేర్చికొనుటకు సావకాశమున్నను గ్రంథములు మిక్కిలి ఖరీదగుటచే నవి వారి యందుబాటులో లేకుండెను. భాగ్యవంతులు వేట మున్నగు ఆటలలో మునిగియుండిరి. లేదా పోరాటములలో పాల్గొనుచుండిరి.

క్రీ. శ. 1100, 1300 సంవత్సరముల మధ్యకాలములో వీరులగు కులీనులు క్రూసేడులు* (crusades) అను యుద్ధములలో చేరిరి. పాలస్తీనాను అరబ్బులు వశపరుచుకొనుట క్రూసేడులకు కారణము. పాలస్తీనాలో క్రీస్తుపుట్టి, పెరిగి, చనిపోయెను కాన అది క్రైస్తవులకు పవిత్ర క్షేత్రము. దానిని తిరిగి వశపరుచుకొనుటకు క్రైస్తవులు మరల మరల ప్రయత్నించిరి. యూరోపులోని ప్రధాన దేశాధిపతులు తమ సేనలతో వచ్చిరి. అందరును కలిసిపోరాడ నిశ్చయించిరి.

క్రీ. శ. 1096 మొదలు 1270 వరకుగల 200 ఏండ్లలో క్రూసేడు

---

* క్రూసేడు అనగా క్రాస్ (సిలువ) కొరకు చేసిన పోరాటము. క్రైస్తవ మత చిహ్నము క్రాసు. కర్రసిలువపై ఏసుక్రీస్తును మేకులు కొట్టి చంపుటవల్ల అది మత చిహ్నమైనది.

యుద్ధము లేదు జరిగెను. పడమటి యూరోపులోని వీరులు పలువురు తూర్పు దేశములను దర్శించుట, ఇతర జాతుల నాగరికతను చూచుట ప్రథమ పర్యాయ మీ క్రూసేడుల సందర్భమున తటస్థించినది. అనేక విషయముల వారు అప్పుడు తెలిసికొనగలిగిరి. ఆనాటినుండియు విదేశీయ జాతులతో వర్తకము చేయవలె ననుకోర్కె వారికి అతిశయించెను. వారు విదేశయాత్రలు చేయగోరిరి.

నాగరికతనందిన తూర్పు దేశములకు సమీపమందున్న మధ్యధరాసముద్రతీర దేశములలో యాత్రలు చేయవలెననియు, వర్తకము చేయవలెననియు, కోర్కె తొలుత తీవ్రముగా కలిగెను. షేక్స్పియరు వ్రాసిన 'మర్చంట్ ఆఫ్ వెనిస్' నాటకములో షైలాకు, అంటోనియోకు నావలు కలవని చెప్పెను. అందొకనావ ట్రిపోలీకి, ఒకటి ఇండీసుకు, ఒకటి మెక్సికోకు, ఒకటి ఇంగ్లాండుకు పోనున్నవట. 11, 15 శతాబ్దులలో వెనీసు ప్రధానవర్తక నగరములలో నొక్కటి. ఇతరనగరములు, జినోవా, ఫ్లారెంసు, మిలాన్.

వర్తకముద్వారా ధనము వచ్చును. ధనమువల్ల తీరిక కలుగును. ధనము, తీరిక అధికమగుటవల్ల ఆ ఇటాలియన్ నగరములలో యాత్రలు చేయుటకును, చదువుకొనుటకును ఎక్కువ సావకాశము చిక్కెను. కాని వారు చదువుట కేమున్నది? పుస్తకములు బహు కొద్దిగానుండెను. అన్ని పుస్తకములు చేతితో వ్రాసికొనవలసి యుండెను.

రోమను సామ్రాజ్యమునకు ప్రాచీననగరమగు రోము రాజధానిగా నుండెను. హూణులు మున్నగు అనాగరికులు దానిని ధ్వంసము చేసిరి. రోమను భవన శిథిలములు నేడును మనము చూడవచ్చును. ఇటలీలో అనేక ప్రదేశములందు ప్రాచీన లాటిన్ గ్రంథము

లుండెను. లాటిన్ ప్రాచీన రోమన్ భాష. రోమన్ సామ్రాజ్య నగరము వేరొకటి కాంస్టాంటినోపులు. అందలి భాష గ్రీకు. ఆ నగరమున ప్రాచీన గ్రీకుగ్రంథములుగల భాండాగారము (libraries) లుండెను. కాన ఇటలీజనులు ప్రాచీన గ్రీకు, లాటిన్ గ్రంథముల సంపాదించ ప్రారంభించిరి. వా రనేక గ్రంథముల సంపాదించి చదివిరి. వారికి జ్ఞానతృష్ణ అతిశయించెను.

గ్రంథములను త్వరలో తయారుచేయు మార్గముల వారు కనుగొన ప్రయత్నించిరి. వారు మొదట కాగితముచేయుట నేర్చుకొనిరి. పిమ్మట అక్షరముద్రణను వారు సృష్టముచేసిరి (invented).

[మూలప్రశ్న 5 : యూరోపులోని ప్రజ లెట్లు గ్రంథముల నెక్కువగా పొందగలిగిరి ?]

§5. అరబ్బులనుండి యూరోపియనులు నేర్చుకొన్న విషయము లలో కాగితములు చేయుట యొక్కటి. అరబ్బులు చీనానుండి ఈ విద్యను గ్రహించిరి. హిందూమహాసముద్రతీర దేశములతో వర్తకము సాగించు సందర్భమున వారు చీనావారిని కలిసికొనుట తటస్థించెను. 1450 ప్రాంతమున ముద్రణ (printing) కనిపెట్టబడెను. తొలుత హాలెండు జర్మనీలలో ముద్రాశాలలు స్థాపించబడెను. జర్మనీనుండి ఇంగ్లాండుకు విలియం కాక్స్టన్ ముద్రణ తెచ్చెను. కాగితములును ముద్రాశాలలును విద్యావ్యాప్తికి తోడ్పడినవి.

1453 సంవత్సరమున ఆటోమన్ తురుష్కులు ఆసియా మైనరుపై దండయాత్ర వెడలి కాంస్టాంటినోపులును వశపరుచుకొనిరి.

వందలకొలది సంవత్సరములపాటు ఇది తూర్పురోమను సామ్రాజ్యమునకు రాజధానిగా నుండెను. అందు పెక్కు భాండా

గారము లుండెను. గ్రీకు, రోమను భాషలలో రచింపబడిన చక్కని గ్రంథము లనేకమం దుండెను. పాఠశాలలు, కళాశాలలుకూడ పెక్కులుండెను. తురుష్కులు మహమ్మదీయమతస్థులు. కాంస్టాంటినోపిల్‌లో నున్నవిద్వాంసులన్నో క్రైస్తవులు. తురుష్కులు తమ్ము చంపుదురని భయపడి క్రైస్తవవిద్వాంసులు తమ యమూల్య



మొదటి రోజులలో ముద్రాశాల

గ్రంథములు తీసికొని పలువురు ఇటలీకి వెళ్లిరి. కొందరు ఫ్రాంసుకు, కొందరు జర్మనీకి, కొందరు ఇంగ్లాండుకును వెళ్లిరి. వెళ్లినచోట్ల వారు, తమజీవనోపాధికై పాఠశాలలు స్థాపించిరి. ఇటలీలో చాలా పట్టణములందును, పారిస్‌లోను, ఆక్స్‌ఫర్డులోను, కేంబ్రిడ్జిలోను, ప్రాహాగ్ (prague) లోను, హైడెల్‌బెర్గులోను ఈకాలమందే స్థాపింపబడిన విశ్వవిద్యాలయములయందు కొందరు ఆచార్యులైరి.

ఈ విద్వాంసులమూలముగా జరిగిన విద్యావ్యాప్తివల్లను, వారు తమతోకూడ తెచ్చిన గ్రంథములను, వారు స్వతంత్రముగా వ్రాసిన గ్రంథములను, ముద్రించుటవల్లను పడమటియూరోపులోని జనులు పూర్వముకన్న నెక్కుడుగా నాగరీకులగుట సంభవించినది. విద్య వ్యాపించినకొలదియు జ్ఞానేచ్ఛ ప్రజలలో ప్రబలెను.

## 3 పాఠము: లే అనార్డోడావిన్సి (Leonardo da Vinci)

[మూలప్రశ్న 6: ఫ్లారెన్సులోను, మిలానులోను "లే అనార్డో" చేసిన ఘనకార్యమేమి ?]

§6. ఇటలీలో ఫ్లారెన్సువద్ద విన్సి అను చిన్నపట్టణమున 1452 సం॥ననే అనార్డో జన్మించెను. గురుశుశ్రూషచేసి అతడు ఉత్తమ చిత్రకారుడుగా 20 వ యేట ప్రసిద్ధిపొందెను. మరియు నతడు పెక్కు యంత్రములు నిర్మించుటకై ఆలోచించుచుండెను. వంతెనలు కట్టుట, కాలువలు త్రవ్వించుట, తుపాకులు మున్నగు ఆయుధముల నభివృద్ధిపరచుట, పట్టణ పునర్నిర్మాణము, విమానముల (aeroplanes) సైతము కట్టుట—వీని విషయమున ఉపాయములు పన్నుచుండెను. ఈకార్యములకు ధనము కావలెను. మిలాన్ డ్యూకు (duke) ఇతనిని ఆహ్వానించెను.

ఆ కాలమునందు ఇటలీ ఒక్కని పరిపాలనలో లేదు. ఎంత కాలమునకో అది ఏకమై ఒక్కజాతిగా (nation) ఏర్పడినది. లే అనార్డోకాలమున ఇటలీలో పెక్కు సంస్థానము (states) లుండెను. ప్రతియొక్కదానికి పాలకుడో డ్యూకో అధిపతి. డ్యూకుపినతండ్రి అశ్వారూఢుడై యున్నట్లు అతడొక అత్యుత్తమ ప్రతిమను 1493 సం॥న పూర్తిచేసెను. అది 26 అడుగులఎత్తు. అది లోహనిర్మితము కాదు. కొంతకాలమైనపిదప శత్రువులు మిలాను స్వాధీనము చేసి

కొని ప్రతిమను భగ్నమొనర్చిరి.

మిలాన్‌లో ప్లేగు (plague) ప్రవేశించగా నతడు పట్టణము నంతయు నవీనపద్ధతుల ప్రకారము తిరిగి కట్టించెను. 1494 సం॥న అతడు "కడపటి విందు" (last supper) అను కుడ్యచిత్రమును



లేఅనార్డొ 'కడపటి విందు' అను చిత్రమును చిత్రించుట

(wall painting) సన్యాసుల భోజనశాల గోడపై చిత్రింప నియమింపబడెను. రోమనులచే బంధితుడు కాకపూర్వము క్రీస్తు, తన శిష్యులు పన్నెండుగురితోను కడపటివిందు నారగించెను. 4 సంవత్సరములలో దీని నతడు పూర్తి చేసెను. అత్యుత్తమ చిత్రములలో నిది యొక్కటిగా పరిగణింపబడుచున్నది.

[మూలప్రశ్న 7 : లే అనార్డొ అసాధారణ ప్రజ్ఞ ఏయేవిధములుగా వెల్లడిఅయ్యెను ?]

§7. లే అనార్డొ, పిమ్మట వెనీసు పట్టణమునకు వెళ్ళి సముద్ర తరంగములతో యంత్రముల త్రిప్పుట సాధ్యమగునేమో చూచెను.

పిమ్నట లేడీ లీజా రూపమును చిత్రించెను. దీనిని ఫ్రాంసురాజు ఫ్రాంసిస్ I కొనెను. అతనిపై రాజునకనుగ్రహము కలిగెను. రాజాతనిని తన జీవితమును తనతో గడపమని ఆహ్వానించెను. అతడు తన తుది 3 సంవత్సరములు రాజుకడ శాంతముగా గడపెను. అంత్యకాలమున రాజున కొక నగరు నిర్మించవలెననియు, ఫ్రాంసులో రెండు నదులను కలుపుచు నొక పెద్దకాలువను త్రవ్వవలెననియు అతడు ఆలోచనలు చేయుచుండెను. 1519సం॥న అతడు మరణించెను.

లే అనార్డో బలశాలి; భూతదయ కలవాడు; సంగీత ప్రియుడు; నిగర్వి. చివరరోజులలో అతడు చేసినకార్యము—రాజు పెద్దకొడుకు వివాహసందర్భమున వైభవముగా ఉత్సవములు, వినోదములు నడిపించుట.

లే అనార్డో మరణానంతరము అతడు వ్రాసిపెట్టుకొన్న పుస్తకములు, చిత్తరువులు దొరికినవి. నేటి ఇంజనీర్లు వానిని పరీక్షించి యిట్లభిప్రాయపడిరి. పెట్రోలువంటి శక్తిని లే అనార్డో వినియోగించగలిగియున్న యెడల 350 సంవత్సరములకు పూర్వమే విమానమును నిర్మించియుండెడివాడు.

## అభ్యాసములు

1. మీ బడిపుస్తక భాండాగారమందలి గ్రంథముల సహాయముతో మార్కో పోలోనుగురించి తెలిసికొని అతని సాహసకార్యములగూర్చి వ్యాసము వ్రాయుము.

2. 1400 సంవత్సరములో యూరోపుకన్న ఆసియా ఏయే విధములుగా పురోభివృద్ధి గాంచియున్నది. యూరోపు ఎట్లు ఆసియాతో కలుసుకొన్నది?

3. ఎగురదగిన విమానమును లే అనార్డో నిర్మించలేకపోవుటకు కారణమేమి?

4. 1250 సంవత్సరములో రోజర్ బేకన్‌కు లేని సదుపాయములు 1500 సంవత్సరమున లే అనార్డో కేమియుండెను?

# 3. క్రొత్తలోకములకు క్రొత్తమార్గములు

## 4 పాఠము : నావిక దిక్సూచి (Mariner's Compass)

[మూలప్రశ్న 8 : నావిక దిక్సూచి యన నేమి? దానిని కనిపెట్టినవా రెవరు?]

§8. పటమును చూడుము. తూర్పుగోళార్ధ (eastern hemisphere) మందు చూపబడినది—అనగా రెండు అమెరికాలు మినహాయించగా మిగిలిన మన భూలోకము. ఇది సామాన్యపు పటములలో చూపబడినట్లు చూపబడలేదు. గోళార్ధము కొన్ని భాగములుగా విభజింపబడినది. మంగోలుసామ్రాజ్య మిం దొక్క పెద్దభాగము. చీనా, సైబీరియాభాగము, దక్షిణరష్యా, ఇరాన్, ఆసియామైనరు ఇందలి దేశములు. తరువాత హిందూదేశము. మూడవభాగము మధ్యప్రాచ్యమందలి మస్లిమ్‌సామ్రాజ్యము (అరేబియా, ఈజిప్టు, టర్కీ, ఉత్తరఆఫ్రికా). నాల్గవభాగము పశ్చిమ యూరోపును, యూరోపులోని రష్యాయును. అయిదవ భాగము మిగిలిపోయిన ఆఫ్రికా. దీనినిగూర్చి అప్పటికి ఏమియు తెలియదు. కావున స్ఫుటముగా పటములో చూపలేదు.

సుమారు 1250 ప్రాంతమున, అనగా 700 సంవత్సరములకు పూర్వము, యూరోపు ఆసియాఖండములందలి విద్యావంతులు ఎరిగియున్న భూభాగముల నన్నిటిని ఈ పటము చూపుచున్నది. ప్రపంచభూభాగములన్నియు ఒకదానికొకటి కొన్నిచోట్ల తాకుచున్నవి. ప్రపంచమందలి వివిధప్రాంతములందలి జనులు ఒకరితో నొకరు కలిసికొను సావకాశములు లేవు. ఆకాలమున ఇతరభూభాగములను గురించినజ్ఞానము ప్రజలకు బహుస్వల్పముగ నుండెను. ప్రతిభాగమందలి ప్రజలును తామే నాగరీకులమని యూహించుకొనుచుండెడివారు.

కాని కష్టములను లెక్కబెట్టక ధైర్యవంతులు అప్పుడప్పుడు ఒక భాగమునుండి వేరొకభాగమునకు పోవుచుండెడివారు. ఒక భాగములోని బుద్ధిమంతులు చేసిన మిక్కిలి ముఖ్యమగు సృష్టములు




క్రీ. శ. 1250 లో ప్రపంచము.

(inventions) దూరభాగములకు వీరే కొంపోయెడివారు. అక్కడి వారు వీనిని ఉపయోగించెడివారు.

ఇట్లు సృష్టించబడిన మొదటి క్రొత్తఉపకరణము నావికులు వాడుకొను దిక్సూచి. ఇది చిన్న ఇనుపముక్క లేదా ఉక్కుముక్క. స్వేచ్ఛగా తిరుగుట కవకాశ మున్నచో నిది ఉత్తరదక్షిణ దిక్కులను చూపును. తొలుదొల్త చీనాదేశస్థులు దీని నేవిధముగా ఉపయోగించి యుండ వచ్చును.



దిక్సూచి

[మూలప్రశ్న 9: యూరోపునకు నావిక దిక్సూచి ఎట్లు వచ్చెను? అప్పుడది యేల మిక్కిలి ప్రయోజకారి యయ్యెను?]

§9. నావిక దిక్సూచిని కనిపెట్టినది చీనావారే కావచ్చు. ఇండియాకు (2వ భాగము) వారు నావలలో ప్రయాణముచేసినమాట వాస్తవము. టింగ్-నాన్-చింగ్ (దక్షిణదిక్కు చూపుసూది) సహాయముతో వారు వెళ్ళిరి. వారివద్దనుండి 'దక్షిణ దిక్కును చూపు సూదిని' గురించి నేర్చుకొన్నవారు అరబ్బులు (3వ భాగము) అరబ్బులద్వారా ఈజ్ఞానము పశ్చిమదేశముల ప్రవేశించెను. ఇటలీ (4వ భాగము) దేశస్థులు వారినుండి దిక్సూచిని గురించి నేర్చుకొనిరి. వారినుండి ఈ జ్ఞానము పశ్చిమయూరోపునకు ప్రాకిపోయెను. 700 సం॥ పూర్వము 'క్రొత్త వస్తువులగూర్చి యోచించుట' అను విషయము ఒక భూభాగమునుండి వేరొక భూభాగమున కిట్లు వ్యాపించినవి.

గత 500 సంవత్సరములలోను వేర్వేరు భూభాగముల ప్రజలు, నావికదిక్సూచివల్ల ఒకరితో నొకరు కలిసికొనుచుండిరి.

15వ శతాబ్దిలోని యాత్రికులు దీని నెట్లుపయోగించినారో తెలిసికొందము. 2-వ పాఠములో ఆటమన్ తురుష్కులు, ఆసియా మైనరు, తూర్పు మధ్యధరా సముద్ర దేశములపై దండెత్తినట్లు తెలిసికొని యున్నాము. వారు మహమ్మదీయులు. వారు, క్రిష్టియనులైన పశ్చిమదేశ వ్యాపారస్థులతో స్నేహముగానుండ నిష్టపడలేదు. ఆకారణమున, తూర్పుమధ్యధరాసముద్రముపై యూరోపువ్యాపారస్థులు నావలను నడిపి, హిందూదేశమునుండి వివిధపదార్థములను తెచ్చు అరబ్బులతో వర్తకముచేయకుండ వారు ఆటంకపరచిరి.

ఆకాలమున హిందూదేశమునందు చక్కని నూలువస్త్రములు, పట్టువస్త్రములు తయారగుచుండెను. యూరోపులో ఈ పాటి వస్త్రములనుతయారుచేయ లేకుండిరి. యూరోపులోవిధనాఢ్యులీ వస్త్రములనే గాక, సుగంధద్రవ్యములనుకూడ కొనుచుండిరి. మహమ్మదీయు లిట్లాటంకపెట్టుట యూరోపువర్తకులకు గొప్ప నష్టముగా నుండెను. కాబట్టి యూరోపునావికులు ఇండియాచేరుటకు వేరొకమార్గము కనిపెట్ట నూహించిరి.

ఈ తరుణమున నొక క్రొత్తవిషయము బయల్పడినది. 1600 సంవత్సరములకు పూర్వము (200 క్రీ. పూ.) నందున్న ఈరాటోస్థెనీస్ (Eratosthenes) అను గ్రీకు భూగోళశాస్త్రజ్ఞుడు భూమి గుండ్రముగానున్నదని నిరూపించెను. తూర్పు మార్గముగా ఇండియాకు పోవుటకు మహమ్మదీయు లాటంకపరుచుచున్నారు కావున పశ్చిమమార్గము ననుసరించి ఇండియాకుపోవుట సాధ్యముకాదా యని యోచింప మొదలిడిరి. ఇట్లుచేయ మొదలుపెట్టినవారు—జినోవా, వెనీసు, పోర్చుగల్, స్పెయిన్, హాలెండు, బ్రిటిషుదీవుల ప్రజలు.

కొలంబసు అను జినోవా నావికుడు పశ్చిమముగా సముద్ర ప్రయాణముచేసి ఇండియా చీనా జపాను దేశములు చేరవచ్చు నను కొనుట కిదియే కారణము.

## 5 పాఠము : కొలంబస్ ; వాస్కోడాగామా ; మగెల్లన్

[మూలప్రశ్న 10 : కొలంబస్ కనిపెట్టిన క్రొత్తభూము లేవి ?]

§10. పశ్చిమముగాపోయి చీనాదేశము చేరవచ్చునన్న కొలంబసు మాట లెవరును వినలేదు. సరిగదా అది తెలివితక్కువ పని యని కూడ వారు భావించిరి. చివరకు స్పెయినురాజుభార్యను వేడు కొనగా మూడు చిన్నఓడల నాతని కిచ్చుటకు వారు సమ్మ తించిరి. మూడింటిలో పెద్ద యోడపేరు 'శాంతమారియ'. అది నూరు టన్నుల నావ. 52 మంది మనుష్యుల నది తీసికొనిపోగలదు. 3-8-149 తేదీని సముద్రయానమునకు బయలుదేరి కొలంబసు అట్లాం టిక్ మహాసముద్రముమీదుగా పశ్చిమముగా రెండు నెలలు ప్రయాణము చేసెను. అతనికి భూమి కనిపించలేదు. అనుచరులు భయపడి తిరిగిపోవలెనని పట్టుపట్టిరి. అక్టోబరు 11-వ తేదీని పచ్చని కొమ్మలు తేలివచ్చుటయు, దూర ములో దీపమును వారు చూచిరి. మరునాడు నాగికి భూమి కని పించెను.



క్రిస్టాఫర్ కొలంబస్

అది ఇండియాకాదు, చీనాకాదు, జపానుకాదు. అది బహామనీ దీవులలో నొక ద్వీపము. పశ్చిమ ఇండీసులో వాట్లింగ్ ద్వీపమను పేర దీనిని అట్లాసులో చూడవచ్చును. కొలంబసు ఇండియాను చేరిన ట్లూహించెను. ఆ దేశవాసులు ఎరుపు గోధుమ వర్ణము కలిసిన దేహచ్ఛాయ కలవారగుటచే వారికి 'ఎర్ర ఇండియను'లను పేరు కొలంబసు పెట్టెను. ఇండీసుదీవులు ఇండియాలోని భాగముకావని తెలిసిన పిమ్మట వానికి పశ్చిమ ఇండీసను పేరువచ్చెను. వేరు చోటనున్న దీవులకు తూర్పు ఇండీసుదీవులని పేరుండెను. 1493 ఫిబ్రవరిలో కొలంబసు తిరిగి ఇంటికి ప్రయాణమైవెళ్ళెను. స్పెయిను రాజుకు బహుమానములుగా నాతడు బంగారమును, ప్రత్తిని, యూరోపులోలేని కొన్ని జంతువులను పక్షులను తీసికొని వెళ్లెను.



శాంతమారియ

ఆ సంవత్సరముననే అతడు 17 ఓడలతో 1500 మంది మనుష్యులతో తగు సామగ్రితో మరల ప్రయాణమును సాగించెను. ఆరువారముల లోపుగానే ప్రయాణము పూర్తిఅయ్యెను.

కొలంబసు తన అనుచరులను హిస్పానియోలా ద్వీపమున—దీనినే నేడు హాయిటీదీవి అందురు—దింపెను. తాను క్రొత్త ప్రదేశముల కనిపెట్టుటకు వెళ్లెను. గ్రేటర్ ఆంటిలీసు అని నేడు పిలువబడు దీవుల పెక్కింటి నాతడు పరిశోధించెను. సంవత్సరమైన

పిమ్మట తిరిగి హిస్పానియోలా దీవి చేరుకొనెను. అచ్చట తన అనుచరులు మూర్ఖముగా ఇండియనులతో కలహించి వారి తిరుగుబాటు నణచి వేసిరి. మరియు అయిదునావల నిండుగ ఇండియనుల నెక్కించి బానిసలుగా అమ్మబడుటకై స్పెయినుకు వారిని పంపిరి.

కొలంబసు స్పెయినుకు తిరిగివెళ్ళి 1408 సంవత్సరమున తన మూడవ సముద్రయానమును సాగించెను. ఈమారు అతడు నైరుతి దిక్కుగా ఇంకను దూరముగా పోయెను. అత డొక ద్వీపమును కనుగొని దానికి ట్రినిడాడ్ అని పేరిడెను. పిమ్మట దక్షిణ అమెరికా సముద్రతీరము ననుసరించి ఓరినోకో నదీముఖము వరకు, నాతడు ప్రయాణముచేసెను. ఆనదినుండి నీరు పుష్కలముగా సముద్రములో పడుచుండెను. దీనినిబట్టి అదియొక ద్వీపములో పుట్టి పారు చిన్న నది కాదనియు, దేశఖండమునుండి ప్రవహించు పెద్దనదియనియు నతడు గ్రహించెను. ఒక క్రొత్తఖండమును కనిపెట్టినట్లు కొలంబసు ఊహించదొడగెను.

1502 సంవత్సరమున నతడు తన తుది సముద్రయానమునకు బయలుదేరెను. పశ్చిమ ఇండీసుచేరి జమైకాకువెళ్ళి నేడు హాండురాస్ ఉన్నతావున మధ్య అమెరికా తీరమును తాకెను.

1504 సంవత్సరమున అతడు స్పెయిన్ చేరుకొనెను. మరి రెండుసంవత్సరముల కతడు కీర్తిశేషు డయ్యెను.

[మూలప్రశ్న 11 : వాస్కోడాగామా, మగెల్లన్ అనువారు కనిపెట్టిన దేమి?].

§11. కొలంబసు సముద్రయానమునకు బయలుదేరినకాలమందే పోర్చుగల్ దేశస్థుడైన వాస్కోడాగామా అనువాడుకూడా బయలుదేరెను. పోర్చుగల్‌కు ముఖ్యపట్టణమగు లిస్బన్ పట్టణము నుండి నాల్గుయోడలతో బయలుదేరి, ఆఫ్రికా పశ్చిమతీరముగుండ

పోయి గుడ్ హోపు అగ్రమును చేరెను. అక్కడినుండి తీరము తూర్పుగా వంగిన స్థానము తెలిసికొని, తూర్పుతీరము ననుసరించి ఉత్తరదిక్కుగా పోయిపోయి (నేడు కెన్యాలోని మొంబసా ఉన్న తావుకు ఉత్తరమున నున్న) మాలిందిచేరెను. ఇక్కడ హిందూదేశ వర్తకుల నాతడు కలిసికొనెను. వారితని కొక కర్ణధారి(pilot) నీయగా నతని సహాయముతో హిందూ మహాసముద్రమున కడ్డముగా అతడు ప్రయాణముచేసి మలబారులోని కల్లికోటలో దిగెను. కల్లికోటకు రాజైన జామొరిన్‌ను కలిసికొనెను. 1499 సంవత్సరమున అతడు



కల్లికోటలో వాస్కోడాగామా

తిరిగి లిస్బన్ చేరుకొనెను. ఇది మిక్కిలి ముఖ్యమైన నావికా యాత్ర. దీనితరువాత పోర్చుగీసువారు ఇండియాను పలుమారులు దర్శించిరి. పది పెద్దయోడలతో రెండవమా రాతడు ఇండియాను దర్శించెను. మూడవతూరి 1524 సంవత్సరమున అతడు ఇండియాను దర్శించి ఆ సంవత్సరముననే కొచ్చిన్‌లో మరణించెను.

వేరొక పోర్చుగీసు దేశస్థుడు, ఫెర్డినాండ్ మగెల్లన్ అను

నతడు భూమిని చుట్టివచ్చిన యాత్ర చెప్పకోదగ్గది. 1519 సంవత్సర మున 5 ఓడలతో అతడు ప్రయాణమయ్యెను. అమెరికాకు దక్షిణముగా యాత్ర సాగించి భూమిని చుట్టి ఇండియా చేరవలెనని యతడు సంకల్పించెను. పోర్చుగల్ నుండి అట్లాంటిక్ మహాసముద్రము గుండా ప్రయాణముచేసి యతడు బ్రెజిల్ తీరమును చేరెను. తీరము ననుసరించిపోయి లాప్లాటానదీముఖము నాతడు చేరెను. అమెరికా నుండి హిందూమహాసముద్రమును చేరుటకు అది దారి యనుకొని నదీముఖమును ప్రవేశించి భగ్నమనోరథు డయ్యెను. పిమ్మట దక్షిణముగా పోయి పతగోనియనుల నొక దేశమును చూచెను. వారు చాలా పొడుగు. వారిపాదములు చాలా పెద్దవి. పతగోనియనులు (పెద్దపాదములు గలవారు) అనుపేరు వారికి అతడు పెట్టెను. పిమ్మట నాత డొక జలసంధిని చేరెను. దానినే నేడు మగెల్లన్ జలసంధి యందురు. చివర కాతడు పశ్చిమ మహాసముద్రమును ప్రవేశించెను. అప్పు డది శాంతముగా నుండుటచే దానికి పసిఫిక్ (శాంత) సముద్రమని పేరిడెను.

అన్ని సముద్రములకన్న విశాలమైన శాంత సముద్రమున కడ్డముగా మూడుమాసము లతడు ప్రయాణముచేసెను. త్రోవలో రెండు ద్వీపము లతనికి కనిపించెను. పిమ్మట లాడ్రోను (దొంగ) దీవులను చూచెను. పశ్చిమముగా పోయి ఫిలిపయిన్ దీవుల చేరుకొనెను.

అతడు సెబు అనుదీవి రాజుతో మైత్రిచేసికొనెను. ఈ స్నేహము వారికి ఆపత్కరమైనది. తన నూతనమిత్రులను సమీప ద్వీపము నొకదానినిజయించుటకు సాయముచేయుమని రాజుకోరెను. మగెల్లన్ సాయమునకు వెళ్లి మడిసెను. పిమ్మట మగెల్లన్ అను

చరులు, మూడుఓడలను తీసికొని బయలుదేరి వెళ్లెను. అందు రెండు యోడలు మునిగి పోయినవి. విక్టోరియా అను యోడమాత్రము మిగిలినది. బోర్ని యోకుపోయి, హిందూ మహాసముద్రము గుండా ప్రయాణము చేసి ఆఫ్రికా చేరుకొని, అగ్రమువరకు క్రిందికి వచ్చి అచ్చటినుండి



విక్టోరియా

ఉత్తరముగా పోయి అది పోర్చుగల్ చేరుకొన్నది. మగెల్లన్ పాపము మరణించెనుగాని అతనియోడ విక్టోరియా మాత్రము భూమిని చుట్టివచ్చెను.

## అభ్యాసములు

1. పూర్వకాలమున ప్రపంచమందలి దూరప్రదేశముల చూచివచ్చుటకు ఎట్టి ఇబ్బందు లుండెను?

2. ఇండియాను దర్శించిన ప్రసిద్ధ విదేశయాత్రికులయొక్క జాబితాను వ్రాసి వారివారి యుద్దేశములను తెలుపుము.

3. 1400 సంవత్సరము తరువాత యూరోపువర్తకులు క్రొత్తవర్తకమార్గముల కనుగొన ప్రయత్నించుటకు అప్పటివారి దేశపరిస్థితు లెట్లుండెను? అట్టి క్రొత్తవర్తకమార్గములను కనుగొనుటకు సహాయభూతమైనట్టియు, క్రొత్తగా సృష్టింపబడినట్టియు ఉపకరణము లేమి?

4. కొలంబసు సముద్రయాత్రవల్ల కలిగిన మేలుకీళ్లేమి?

5. మగెల్లన్ భూమిని చుట్టివచ్చుట ముఖ్యమైనదా, వాస్కోడాగామా ఇండియాను దర్శించుట ముఖ్యమైనదా? సకారణముగా దెల్పుము.

# 4. స్వేచ్ఛగా నాలోచించుటకు ప్రయత్నము

## 6 పాఠము : సహనము : కాథలిక్ చర్చి (Catholic Church)

[మూలప్రశ్న 12 : సహనమన నేమి ? నాగరికత కదియేల ముఖ్యము ?]

§12. ఇండియా, చీనా, ఈజిప్టులలో వెలసిన నాగరికతలు అందమగు వస్తువుల చేసినవి. నిబంధనల ననుసరించి ప్రవర్తించుట నేర్చుకొన్నవి. క్రొత్తవిషయములను కనిపెట్టినవి. ఇక 'స్వేచ్ఛగా ఆలోచించుట మాటయేమి ?' దానియర్థ మేమన-జనులు స్వేచ్ఛగా జ్ఞానార్జన చేయవలెను. ఒకరాజో, దొరతనమో, ప్రముఖుడో నమ్మిన విషయములను ఇతరులుకూడ నమ్మవలెనని బలవంతము చేయరాదు. ఇట్టి స్వేచ్ఛకే సహనమని పేరు. మానవుని మనో వికాసమున కిది అవసరము.

మతవిషయములందు మానవులకు సహనములేదు. తమ మతమే మంచిదనియు, ఇతరమతములు తప్పనియు భావింతురు. ఇతర మతస్థులను బలవంతముగా తమ మతములో కలుపుకొందురు. సహన గుణము ఇండియా, చీనాలలో ఎక్కువగా నున్నది.

ఇతరవిషయములందును మానవులు అసహనము చూపుదురు. మతవిషయమునమాత్రము అసహనము తీవ్రరూపము ధరించును. నీయంతట నీ వాలోచించుకొనుటకు నీకు అవసరమైన స్వేచ్ఛయే ఇతరులకును ఉండవలెను.

[మూలప్రశ్న 13 : పోపు (pope) అనువా డెవడు, కాథలిక్ చర్చి అన నేమి?]

§13. ప్రపంచమందలి పెద్దమతములు పెక్కింటికి పవిత్రగ్రంథ మొకటి యుండును. అందు భగవదాదేశములు, ఉపాసనా నియమములు, ఆచారకాండము మున్నగు విషయము లుండునని

ఆయా మతములవారి నమ్మకము. క్రైస్తవుల పవిత్రగ్రంథము బైబిలు.

క్రీస్తు యూదుడు (Jew) గా జన్మించెను. పాలస్తీనాలో నివసించెను. రోము రాజధానిగా గలిగిన రోమనులు పాలస్తీనాను పాలించుచుండిరి. క్రైస్తవమతము వ్యాప్తినందురోజులలో నది రోము పట్టణమును ప్రవేశించెను. కొంతకాలమునకు రోముపట్టణపు బిషప్పు (bishop) క్రైస్తవ మతాధికారి యయ్యెను. అతనిని పపా (తండ్రి) లేదా పోపు అనెడివారు. పోపు నాయకత్వమున క్రైస్తవమతమును స్వీకరించిన వారికి రోమన్ కాతలిక్కు లని పేరు. పోపును నియమించినది భగవంతుడే అనియు, అందువల్ల పోపుమాటల నందరు క్రైస్తవులును శిరసావహించవలెననియు వారి నమ్మకము.

క్రైస్తవుల బైబిలు కొంతభాగము యూదులభాషయగు హీబ్రూలోను, కొంతభాగము గ్రీకుభాషలోను వ్రాయబడినది. పోపు ఆజ్ఞానుసారము రోమనులభాషయగు లాటిన్‌లోనికి అది తర్జుమా చేయబడినది. 1400 సంవత్సరమున బైబిలు లాటిన్ పండితులకు మాత్రమే బోధపడుచుండెను. ప్రజలకు లాటిన్ భాష రాదు. వారికి విద్యాగంధము లేదు.

పురోహితులు (priests) బైబిలు చదివి ప్రజలకు చెప్పుచుండిరి. బైబిలు విషయములు భగవంతుని వాక్కులని ప్రజలు నమ్ముటచే పురోహితులపలుకుబడి హెచ్చెను.

పురోహితులు మంచివారుగా నున్నంతకాలము పరిస్థితులు చక్కగా నుండెను. 1400 సంవత్సరమున పోపును పురోహితులును కొందరు మంచివారు కారు. అందువల్ల పరిస్థితులు విషమించెను. ఒక పోపు కొన్ని ఉత్తరువుల చేసెను. కొందరు కాతలిక్కుల కవి తప్పని

తోచెను. స్వయముగా బైబిలు చదువుకొన్నగాని నిజానిజములు తేలవని వారికి తోచెను.

7 పాఠము : జాన్ వైక్లిఫ్; మార్టిన్ లూథర్; జస్యూటులు

[మూలప్రశ్న 14: ప్రొటెస్టెంటు మతమన నేమి? దానివల్ల యుద్ధమేల కలిగెను?]

§14. స్వయముగా చదువ నిశ్చయించినవారిలో జాన్ వైక్లిఫ్ ఒకడు. అతడు ఇంగ్లీషు పురోహితుడు. బైబిలును ఇంగ్లీషు లోనికనువదించెను. లాటిన్ రానివారు బైబిలు చదువ వీలయ్యెను. జాన్‌హస్ అను విద్యావంతుడు ప్రేగ్‌నివాసి. ఇతడు వైక్లిఫ్ మార్గమునే అనుసరించెను కాని దుర్మరణము పాలయ్యెను. అయినను పలువురు బైబిలును బహిరంగముగనో, రహస్యముగనో చదువ జొచ్చిరి. రోమను కాతలిక్కుమతములో తమకు దోషములని తోచిన విషయములనుగూర్చి వ్యతిరేకముగా మాటాడజొచ్చిరి. అట్టివారిని ప్రొటెస్టెంటులని పేర్కొనజొచ్చిరి. వారనుసరించు మతమునకు ప్రొటెస్టెంటు క్రైస్తవ మతమని పేరువచ్చెను.



మార్టిన్ లూథర్

ప్రొటెస్టెంటులలో ప్రఖ్యాతపురుషుడు, జర్మను సన్యాసియగు మార్టిన్ లూథర్. పోపుబోధల నతడు ఖండించెను. ప్రబలురగువారీతని రక్షింపకుండినచో హస్‌గతి ఇతనికి పట్టియుండును. ఈకాలమున యూరోపు దేశమందలి రాజులును, ప్రభువులును సైతము ఈక్రొత్త అభిప్రాయముపట్ల నుత్సాహము జూపుచుండిరి.

ఇందుకు నిజమైన కారణమేమనగా—అట్టిరాజులు అనేకులు(ఇంగ్లాండు రాజు హెన్రీ VIII ఇందొక్కడు) పోపు అధికారమును చూచి అసూయపడజొచ్చిరి.రోమన్ కేతలిక్కు క్రైస్తవమతమున్న దేశము లన్నింటిలో మతవిషయముల గూర్చి పోపు అధికారము వహించి కలుగజేసికొనుట వారికి కిట్టలేదు. అట్టిరాజులు పోపుకు ప్రతికక్షు లైన ప్రాటెస్టెంటులకు సహాయమిచ్చుచుండిరి. కొందరు పోపుపక్ష మవలంభించిరి. ఇంగ్లాండు, స్కాట్లండు, స్వీడన్, నార్వే, డెన్మార్కు—జర్మనీ ఉత్తరభాగము—ఈ దేశముల రాజులు పోపుకు వ్యతిరేకముగా ప్రాటెస్టెంటుల పక్ష మవలంభించుటచే ఈ దేశములు ప్రాటెస్టెంటు దేశము లయ్యెను. ఇక ఫ్రాంసు, స్పెయిను, ఇటలీ, ఆస్ట్రియా, జర్మనీ దక్షిణభాగము—ఈ దేశములు పోపుపక్ష మవలంభించెను. ఉత్తర యూరపు దేశమున సుమారు నూరు సంవత్సరములపాటు సాగిన దారుణ మత యుద్ధముల కీచీలికయే కారణము. ముఖ్యముగా నీ యుద్ధములందు కష్టనష్టములకు పాలైన దేశము జర్మనీ. ఉత్తర జర్మనీలోని రాజపుత్రులు,ప్రభువులు ప్రాటెస్టెంటు పక్షమువనుండిరి. దక్షిణ జర్మనీలోనివారు కాతలిక్కులు. మతముపేర నీ యుభయ పక్షములు తీవ్రముగా పోరాడినవి.

[మూలప్రశ్న 15: జీసస్ సంఘమును ఎవరు ఎందులకు స్థాపించిరి ?
జసూయిటు (Jesuits) లేమి జేసిరి ?]

§15. రోమన్ కాతలిక్కు చర్చికి మోసమురాకుండ అందు సంక్రమించిన చెడ్డను తొలగించుటకు పూనుకొన్న ఒకనిని గూర్చి నేడ్చుకొందము. అతడు స్పెయినులో గౌరవకుటుంబమునకు చెందిన వాడు. సేంటు (Saint) ఇగ్నేషస్ ఆఫ్ లయోలా అను పేరు తరువాత అతనికి వచ్చెను. వయస్సులో నున్నప్పుడు ఇగ్నేషస్

సైనికుడుగా యుద్ధములలో పనిచేసెను. ఫిరంగిదెబ్బ కాతని కాళ్లు విరిగిపోయెను. చికిత్సపొందు దినములలో ఒక క్రొత్త ఆలోచన అతనికి తట్టెను. రోమన్ కాతలిక్కు మతము సత్యమని అతని నమ్మకము. దానికి సహాయముచేయుట కేమైన చేయవలెనని నిశ్చయించెను. కాని, అతనికి చదువురాదు. కాన బాగుగా చదువుకొనవలెనని యాతడు సంకల్పించెను. స్వస్థత చేకూడుటతోడనే అతడు విశ్వవిద్యాలయములో ప్రవేశించెను. ఎన్నో సంవత్సరములు చదువుకొనెను. 47 వ యేట ఇగ్నేషస్ జీసస్ సంఘమును స్థాపించెను. ఈ సంఘసభ్యులనే నేడు జెస్యూట్లు అనుచున్నారు. రోమన్ కాతలిక్కు చర్చికొరకై యావజ్జీవము పాటుపడునట్లు వారు శపథము తీసికొనిరి. వారు పాటుపడిన ఒక మార్గము మంచిపాఠశాలలను నడపుట. నేటివరకును జస్యూట్ పాఠశాలలు కూలంకషముగా పనిచేయు పాఠశాలలని పేరు తెచ్చుకొన్నవి.

వేలకొలది జస్యూటులు దూరదేశములకుబోయి అచ్చటి జనులను కాతలిక్కు మతములోనికి చేర్చిరి. ఇగ్నేషస్ చనిపోయిన చాలకాలమునకు పోపు అతనిని సేంటు (Saint) గా నిర్ణయించెను. అందువల్లనే అతనికి సేంటు ఇగ్నేషస్ ఆఫ్ లయోలా అని పేరు వచ్చినది. సుమారు లూథరున్న కాలమందే అతడును ఉండెను.

## అ భ్యా స ము లు

1. సహనమన నేమి? నాగరికతాభివృద్ధి కది ముఖ్యమా? సకారణముగా తెలుపుము.

2. ప్రొటెస్టెంటు మతవ్యాప్తి యుద్ధమునకును క్రౌర్యమునకును ఏల కారణమయ్యెను?

3. మార్టిన్‌లూథరును గూర్చియు సేంటు ఇగ్నేషసును గూర్చియు విపులముగా చదివి వారి జీవితచరిత్రమును, వారుచేసిన పనులనుగురించి వ్రాయుము.

## 5. తూర్పుపడమరలకు వ్యాపించిన యూరోపు

### 8 పాఠము: పోర్చుగీసులు; కార్టెజ్; పిజ్జారో

[మూలప్రశ్న 16: పోర్చుగీసు లెక్కడ వర్తకస్థానముల స్థాపించిరి?]

§16. అజ్ఞాతభూభాగముల కనిపెట్టుటకు కొందరు సముద్రయాత్రలు చేసిరి. వర్తకముచేసి ధనము సంపాదించవలెనని కొందరు దూర దేశముల కేగిరి.

సుమారు 1500 సంవత్సరమున చీనా, హిందూదేశములు యూరోపుదేశములకంటె అనేకవిధములుగా నభివృద్ధిలో నుండెను. కూబ్లైఖాను తరువాత మంగోలులు, వారితరువాత మింగ్‌లు చీనాను పాలించిరి. వీరి కాలముననే చీనాదేశస్థులు చక్కని మట్టి పాత్రలచేసిరి. సున్నితమగు పట్టును చేసిరి. దారువు, దంతము, లోహము, శిల—వీని మీద చెక్కడపు పనిని చేసిరి. హిందూదేశస్థులునిరుపమాన మగు సన్నని నూలు వస్త్రములు నేయుచుండిరి. యూరోపుదేశస్థులీబట్టలను, సుగంధద్రవ్యములను కొనుచుండిరి.



నీలి తెలుపురంగుల మింగ్ జాడీ

ఇండియాలో వర్తకస్థానముల నేర్పరుచుకొన్న యూరోపియనులలో మొదటివారు పోర్చుగీసులే. ఇండియాకు పడమటితీర మందున్న కొచ్చిన్, గోవా, బేసిన్, డామన్, డయు అను పట్టణ

ములలో వారు అధినివేశముల (colonies) నేర్పాటుచేసికొనిరి. కొద్దికాలములోనే వారు సింహాళముపై దండెత్తిరి. 100 సంవత్సర కాలము ఆద్వీపతీరభూమిని పాలించిరి. సింహాళద్వీపవాసులు రోమన్ కాతలిక్కు (Roman Catholic) మతావలంబు లగునట్లు చేసిరి.

పిదప తూర్పుఇండీసుదీవులలో వారు వర్తకస్థానముల నేర్పాటు చేసికొనిరి. ఈ దీవులకు మొలకస్ దీవు లని పేరు. పిదప చీనాప్రవేశించి కాంటన్ నదీముఖమువద్ద మెకావోకడ అధినివేశము ఏర్పరుచుకొనిరి. వీరు జపానుకూడ చేరిరి. పైని పేర్కొన్న ప్రదేశములన్నియు పోర్చుగీసువారి స్వాధీనములోనే యున్నవి. సింహాళముమాత్రము డచ్చివారు తీసికొనిరి. వారి నోడించి బ్రిటిషువారు వశపరచుకొనిరి.

బ్రెజిల్ కూడ పోర్చుగీసువారి అధినివేశమైనది. ఇప్పుడుకూడ ఆ దేశభాష పోర్చుగీసుభాషయే.

[మూలప్రశ్న 17: మెక్సికో, పెరూదేశముల నెవరు జయించిరి? ఎట్లు? ఎందుకు అవి జయించబడినవి?]

§17. కొలంబసు, మెగెల్లన్ అను వీరిద్దరు స్పెయినురాజు కొలువులో నుండిరి. కాన కొలంబసు కనిపెట్టిన పడమటి ఇండీసుదీవులును, మెగెల్లన్ కనిపెట్టిన ఫిలిప్పైనుదీవులును స్పెయినుదేశమునకే దక్కెను. మధ్య, దక్షిణఅమెరికాలలో స్పెయినుదేశస్థులు పెక్కు ప్రదేశములు కనిపెట్టిరి. 1518 సంవత్సరమున హార్నాండో కార్టెజ్ అను స్పెయినుఉద్యోగి పశ్చిమ ఇండీసులోని క్యూబాపట్టణమునుండి మెక్సికోతీరమునకు వెళ్లెను. ఆ దేశప్రజలకు అజ్టెక్కులనిపేరు. వారు సూర్యోపాసకులు. ధగధగమెరయు కవచముల ధరించిన స్పెయినుదేశస్థులను సూర్యపుత్రులని వారు భావించిరి. వారికి

స్వాగతము చెప్పి సంభావించిరి. వారి వాడుకయందుండు లోహములు రాగి, వెండి, బంగారముమాత్రమే. ఇనుము ఉక్కు వారెరుగరు.

వీరి స్నేహము చిరస్థాయిగా నుండలేదు. ఉభయులకును కలహములు ప్రారంభమయ్యెను. ఉక్కుఆయుధములు, తుపాకులు గల స్పెయినువారే గెల్చిరి. ఈవిధముగా మెక్సికో స్పెయిను పరిపాలన క్రిందకు వచ్చెను.

మెక్సికోను జయించినపిమ్మట కార్టెజ్ కాలిఫోర్నియా దక్షిణ భాగమువరకును పోయి స్పెయినుకు తిరిగి వెళ్లెను.

దక్షిణఅమెరికాలోకూడ గొప్పవిజయమును సాధించిన మొదటి యూరోపియనులు స్పెయిను దేశస్థులే. పెరూదేశమున 'ఇంకా' లనువారు నివసించుచుండిరి. 'ఇంకా' లనాగరికత అభ్యుచ్ఛలో నుండెను. దీనిని కనుగొన్న స్పెయిను నాయకుడు ఫ్రాంసిస్కో పిటారో.

పిజ్జారో పెనామాకు వెళ్లినప్పుడు పెరూదేశమును గూర్చి వినెను. అందు బంగారము పుష్కలముగా దొరకుననియు హేమపాత్ర లా దేశస్థులు వాడుకొందురనియు తెలిసికొనెను. ఇట్టి యద్భుతదేశమును చూడవలెనని పిజ్జారో నిశ్చయించెను. 1532 సంవత్సరమున పెరూను కనుగొనెను. ఇంకాలరాజు పిజ్జారోకు స్వాగతము చెప్పెను. కాని పిజ్జారో విశ్వాసఘాతుకుడై మోసము చేసి ఇంకాలరాజును చెరబట్టి, కాంచన మాణిక్యముల ప్రాణదాన భృతిగా స్వీకరించి చివరకు రాజును హతముచేసెను. పెరూదేశము కూడ స్పెయిను పరిపాలనక్రిందకు వచ్చెను. చాలకాలమువరకు స్పెయిను దేశస్థులు పెరూనుండి తమకు దొరికిన విలువయైన

పదార్థముల నన్నింటిని తీసికొనిపోయిరి. ఈపనిచేయుటకు ఎందరు ఇంకాలను బలిపెట్టిరో!

## 9 పాఠము : స్పేను : తూర్పుఇండియాసంఘములు

[మూలప్రశ్న 18: స్పెయిను ఎట్లు భాగ్యవంతమైనది, ఫలితమేమి ?]

§18. బంగారము సంపాదించవలె నను కాంక్ష స్పెయిను దేశీయులచే నమెరికాలో నెన్నో క్రూరకృత్యముల చేయించినది. ఇంతేకాదు దుష్టమగు బానిసత్వమునుకూడ తెచ్చిపెట్టెను. కొలంబసు అనుచరులు పశ్చిమ ఇండీసుదీవులనుండి ఎర్రఇండియనులను బానిసలుగా విక్రయించుటకు పంపియుండిరి. ఇంకొకవిధముగా మెక్సికోలోను, దక్షిణఅమెరికాలోను బానిసత్వము పెరిగినది. స్పెయిను దేశస్థులు అజ్టెక్కులయొక్కయు ఇంకాలయొక్కయు దేవళములనుండియు ప్రాసాదములనుండియు కానవచ్చిన బంగారుపాత్రలను ఆభరణములను కొల్లగొట్టిన పిమ్మట—వారికా బంగారము, మెక్సికో పెరూ బంగారుగనులనుండి దొరకుచున్న దనుసంగతి కనిపెట్టిరి. వెంటనే మెక్సికో పెరూ ప్రజలను బానిసలుగాజేసి బంగారుగనులలో వారిచేత బలవంతముగా పనిచేయించిరి. కాని వారి కధికముగా లాభము రాలేదు. అందుచేత ఆఫ్రికానుండి ఈ పనికై నీగ్రోలను తీసికొనివచ్చిరి. అమెరికాలో నీగ్రో బానిసత్వమప్పుడు ప్రారంభమై, రానురాను వృద్ధిజెందినది. నేటి నీగ్రోలు బానిసలు కాకపోయినప్పటికిని ఈ బానిసత్వసమస్య నేటికిని పరిష్కారము కాలేదు.

కాంచన ప్రవాహము స్పెయినులో పడుట కారణముగా నా దేశము భాగ్యవంత మయ్యెను. ఇతర యూరోపియను జాతులు స్పెయిను భాగ్యవంతమగుట చూచి ఈర్ష్యజెందిరి. స్పెయిను

పోర్చుగీసు దేశస్థుల దూరభూముల యాధిపత్యమునకై యుద్ధములుచేసికొనకుండ 1494 సంవత్సరమున పోపు ప్రపంచపటముపై ఒక గీతగీచి ప్రపంచమును రెండు భాగములుగా విభజించెను.

స్పెయిను దేశస్థులనుండియు పోర్చుగీసువారినుండియు వారి వర్తకమును ధనమును తీసికొనుటకు ఇతరులు ప్రయత్నించిరి. ప్రపంచపటముమీద పోపు అంతటివాడు గీచినగీత వారి కడ్డురాలేదు. స్పెయినుకు ప్రతిస్పర్ధులై ఇట్టిప్రయత్నములు చేసినవారు ఇంగ్లీషు వారు.

ఇంగ్లీషువారి నాయకుడు ఫ్రాంసిస్ డ్రేకు. అమెరికానుండి స్పెయినుకు బంగారమును తీసికొనిపోవు స్పెయినుదేశీయులనావలను త్రోవలో నీతడు మాటిమాటికి కొల్లగొట్టుచుండెను. ఒకమారు పెరూనాకా ప్రశ్రయములపై దండెత్తి స్పెయినుదేశీయుల ధనమును కొల్లగొట్టి 'గోల్డెన్ హైండ్' అను తననావపై నెక్కించుకొని డ్రేకు ఉత్తరదిశగా సముద్రయానము సాగించెను. దక్షిణఅమెరికా చుట్టిన ఇంగ్లాండుపోవుటకు సులభమగుమార్గ మున్నదికదా. అట్లే అమెరికాకుఉత్తరముగా పోయిన సులభమార్గము దొరకవచ్చునని యాతడాసించెను. అమెరికాకు ఉత్తరతీరముననున్న వాంకోవర్ చేరినపిమ్మట ఇక ముందుకుపోయిన లాభము లేదనియు, ప్రపంచమును చుట్టి ఇల్లుచేరుకొనవలెననియు యాతడు నిశ్చయించెను. అతడు పశ్చిమాభిముఖముగా పసిఫిక్ మహాసముద్రమున కడ్డుపడి సముద్రయాత్ర చేసెను. మూడునెలలపాటు ప్రయాణము సాగించి అతడు చివరకు తూర్పుఇండీసులోని మొలకస్ దీవిని చేరెను. అక్కడి నుండి జావాకును, అక్కడినుండి హిందూమహాసముద్రమున కడ్డుపడి దక్షిణఆఫ్రికాకును, గుడ్ హోపు అగ్రమునుచుట్టి ఉత్తరముగా

ప్రయాణముచేసి యూరోపునకును చివరకు ఇంటికిని చేరెను. ఇల్లు విడిచి అప్పటికి సుమారు మూడుసంవత్సరము లైనది.

డ్రేకు ఇంగ్లాండుచేరిన పిమ్మట అచిరకాలముననే ఇంగ్లీషు వారికి తగినశాస్తి చేయవలెనని స్పెయినురాజు నిశ్చయించెను. గొప్ప యుద్ధనౌకాదళము (Armada) నొకటి సమకూర్చి, వేలకొద్ది సైనికులతో ఇంగ్లాండుపై దండెత్తి దానిని జయించవలెనని ప్రయత్నించెను. స్పెయినుతీర పట్టణమగు కాడిజ్‌ని ఆ దళము విడువక పూర్వమే డ్రేకు హఠాత్తుగా వారి నౌకాశ్రయములోనికి ప్రవేశించి స్పెయిను నావలమధ్యకు అగ్నినావలను పంపి దళము నందలి పెక్కునావల తగులబెట్టెను. మరుసటిసంవత్సరము స్పెయిను యుద్ధనౌకాదళము (Armada) ను సిద్ధముచేసి ఇంగ్లాండును ముట్టడించుటకు ప్రయాణమయ్యెను. ఇంగ్లీషు ఛానెల్‌లో వేచియున్న ఇంగ్లీషునావలు దాని నెదుర్కొనెను. ఇంగ్లీషునావల సంఖ్య తక్కువ. కాని వడిగాబోవు నావ లందుగలవు. నావికులును తుపాకులను వడిగా పేల్చగల సమర్థులు. స్పానిష్‌నావలు ఫ్రాంసుతీర మందలి ఒక రేవులో నౌకాశ్రయమున దాగియుండెను. రాత్రివేళ ఇంగ్లీషువారు స్పానిష్ నౌకలమధ్యకు అగ్నినావలను (తీవ్రముగా మందు పదార్థములతో నింపబడిన నావలు) పంపిరి. స్పానిష్ నావ లీ అగ్ని ప్రమాదమునుండి తప్పించుకొనుటకు బయటకు వచ్చెను. అప్పుడు ఇంగ్లీషువారు స్పానిష్ నావలమీద పడిరి. అనేక నావలను నాశముచేసిరి. ఇంతతో తుపానువచ్చెను. మిగత నావలు క్షేమముగా తప్పించుకొనిపోవుటకు సాధ్యముకాలేదు. ఉత్తర సముద్రము (North Sea) లోని కవి తరుమగొట్టబడెను. ఇంగ్లాంపై దండెత్తు ఆశవదలుకొని, వెంటవచ్చు ఇంగ్లీషునావలకు భయ

పడి వెనుకకు తిరుగలేక, వారు స్కాట్లెండుకు ఉత్తరముగా, ఐర్లాండుకు పడమరగా ఇంటికి తిరిగిపోవుటకు ప్రయత్నించిరి. ఇట్లు చేయుటవల్ల అనేక నావలు భగ్నమాయెను. దీని తరువాత స్పెయిను ప్రాబల్యము తగ్గెను. ఇంగ్లీషువారి ప్రాబల్యము హెచ్చెను.

[మూలప్రశ్న 19: ఏ యూరోపియను జాతులు వర్తకసంఘముల స్థాపించిరి? ఎక్కడ?]

§19. వర్తకస్పర్థలలో డచ్చివారుకూడ ఈ లోపల ప్రవేశించిరి. ఉత్తర అమెరికాతీరమున, ఇప్పుడు న్యూయార్కు ఉన్నచోట వారొక అధినివేశ మేర్పరుచుకొనిరి. గినీ, బ్రెజిలలో కూడ అధినివేశము లేర్పరుచుకొనిరి. దక్షిణఆఫ్రికాలో గుడ్ హోపు అగ్రము వద్దకూడ వారి అధినివేశము కలదు. సింహళమును పోర్చుగీసుల అధీనమునుండి తీసికొని అచ్చటకూడ డచ్చివారు అధినివేశము లేర్పరచుకొనిరి. అన్నింటికన్న ముఖ్యమైన అధినివేశములు డచ్చివారివి సుమిత్ర, జావా, మొలకస్ దీవులలో నుండెను. అంతకు ముం దక్కడ పోర్చుగీసు లుండిరి. వారిని డచ్చివారు తరుమగొట్టిరి.

1600 సంవత్సర ప్రాంతమున ఇంగ్లీషువారు ప్రాచ్యదేశములందును ఇండియాలోను వర్తకమును చేయ మొదలిడిరి. ఆ సంవత్సరమున ఎలిజబెత్తురాణి కొందరు లండను వర్తకులకు 'తూర్పు ఇండియావర్తక సంఘ మ'ను పేర నొక వర్తకసంఘమును స్థాపించుట కనుజ్ఞ యిచ్చెను. 1614 సంవత్సరమున ఈ వర్తకసంఘమునకు, మొగల్ చక్రవర్తి జహంగీరు, సూరతులో ఒక ఫ్యాక్టరీ (factory) కట్టుకొనుట కనుమతి నిచ్చెను. ఈ ఫ్యాక్టరీలనుండి వారు వర్తకమును సాగించుచుండెడివారు. ఇట్టి ఫ్యాక్టరీలు త్వరలో మద్రాసు, బొంబాయి, కలకత్తాలో కూడ స్థాపింపబడినవి.

మొగలుచక్రవర్తి అనుమతితో ఈ వర్తకసంఘము తమ మనుష్యులను ఆగ్రా, అలహాబాదు మున్నగు సముద్రతీరములకు దూరముననుండు ప్రదేశములలో పెట్టుకొనెను. వారు ఈ ప్రదేశములలో సరకును ప్రోగుచేసి తీరమందలి ఫ్యాక్టరీలకు పంపుచుండిరి. అచ్చటినుండి సరకును యూరోపుకు నావలద్వారా ఎగుమతి చేయుచుండిరి.



మొగలు చక్రవర్తి ఆస్థానములో

కొంతకాలమైన పిమ్మట ఫ్రెంచివారు ఒక తూర్పుఇండియా వర్తకసంఘమును స్థాపించిరి. దక్షిణమున పుదుచ్చేరి, కలకత్తా వద్దనున్న చంద్రనగరము త్వరలో ప్రసిద్ధమైన వర్తకకేంద్రము లయ్యెను. ఈకాలమందే ఫ్రెంచివారు ఉత్తరఅమెరికాను దేశాన్వేషణ (exploration) చేయుచుండిరి. అక్కడ వర్తకమును సాగించుచుండిరి. సెంటులారెన్సునదిపై ఓడలమీదపోయి అమెరికాలోని 'మహాసరస్సు'లు (great lakes)ను వారే మొదట కనిపెట్టిరి. విలువగల చర్మములకొరకును, మెత్తని ఉన్నిగల చర్మములకొరకును (furs) ఎర్ర

ఇండియనులతో వర్తకముచేసిరి. మహానదియగు మిసిసిపి నదిలోయ



బొంబాయిలో తూర్పు ఇండియా వర్తకసంఘమువారి కోట

(valley) లోను, దాని శాఖయగు ఓహియోలోయ లోను వారు పెక్కు వర్తకస్థలముల నేర్పరిచిరి.

## అభ్యాసములు

1. ఈకాలమున చీనా ఇండియాదేశస్థులు యూరోపియనులకన్న ఏ విషయములలో పురోభివృద్ధి గాంచియుండిరి?

2. ఈకాలమున ప్రపంచఖండములందలి యేయే ప్రదేశములు, ఈక్రింది యూరోపియను జాతులచే వర్తకస్థానములుగా నుపయోగింపబడినవో జాబితా వ్రాసి చూపుము; పోర్చుగీసులు, స్పెయినుదేశీయులు, డచ్చివారు, ఫ్రెంచివారు, బ్రిటీషువారు.

3. ఈక్రింది మూడురకములగు యూరోపియను అధినివేశ భూములలో నీవు కనిపెట్టగలిగిన భేదములేమి? (1) మెక్సికోలో స్పెయినుదేశీయుల అధినివేశములు (2) ఇండియాలో పోర్చుగీసుల అధినివేశములు (3) కెనడాలో ఫ్రెంచివారి అధినివేశములు.

4. సర్ ఫ్రాంసిస్ డ్రేకును గూర్చి ఇతర గ్రంథములు చదివి అతని జీవితమును సంగ్రహముగా వ్రాయుము.

# 6. షేక్స్పియరు: అతనికాలము

## 10 పాఠము: విద్యాపునరుద్ధరణ (Revival of learning)

### షేక్స్పియరు, అతని నాటకములు

[మూలప్రశ్న 20: విద్యాపునరుద్ధరణకాలమున ఎట్టి గొప్ప మార్పులు ప్రారంభమైనవి?]

§20. కొన్ని చరిత్రగ్రంథములలో రాజులకథలును వారి విజయములును వర్ణించబడినవి. ఇవి చరిత్రకు ముఖ్యముకాదు. ఎవ్వరు ప్రజలయూహలను భావములను మార్చిరో వారే నాగరీకమందుటకు మానవుడుచేయు ప్రయత్నమున కధికముగా తోడ్పాటుచేసిన వారగుదురు. కావుననే మతము, విజ్ఞానశాస్త్రము (science) కళ (art), ప్రభుత్వము (government) వీనిని గురించిన మహదాశయముల వ్యాపింపజేసినవారి చరిత్రలే ఈగ్రంథమున పేర్కొనబడినవి.

ఈ నాటివరకును గల ప్రపంచచరిత్ర మంతటిలోను 1300 సంవత్సరము మొదలు 1600 సంవత్సరము వరకుగల కాలమునకు అద్భుత యుగము (age of wonder) నియు, విద్యాపునరుద్ధరణకాలమనియు చెప్పుదురు. ఈకాలమున లోకములో క్రొత్తయూహలు పెక్కులుద్భవించినవి. గొప్పమార్పు లనేకములు కలిగినవి. 1450 సంవత్సర ప్రాంతమున అటమన్ తురుష్కులు కాంస్టాంటినోపిల్‌పై దాడివెడలిరి; గ్రీకు పండితులు తమ గ్రంథములతో పారిపోయిరి; యూరోపులో ముద్రణ ప్రారంభమాయెను; తూర్పు పడమరలకు నూతన సముద్రమార్గములు కనిపెట్టుటకు ప్రారంభించిరి. 1450 సంవత్సరమును జ్ఞప్తియందుంచుకొనుడు.

విద్యాపునరుద్ధరణము ఇటలీలో ప్రారంభమాయెను. డాంటే

ఆ దేశమందలి యుత్కృష్టమకవి. మార్కో_పోలో సమకాలికుడు డాంటే. గ్రీకుపండితులు ఇటలీకి పారిపోవు కాలమునందే 'లియనార్డో డా వించి' జన్మించెను. ఇంగ్లాండు దేశము ఎంతో దూరముననుండుటచే ఎంతకాలమునకోగాని ఈమార్పు లక్కడ కలుగలేదు. కొలంబసు తరువాత నూరు సంవత్సరములు గడచిన పిమ్మటగాని, నూతన భూములు కనిపెట్టుటకు సముద్రయానములు ఇంగ్లీషువారు మొదలు పెట్టలేదు.

విలియంషేక్స్పియరు 1564 సంవత్సరమున జన్మించెను. అతడు జీవించినకాలమంతయు ఉద్రేకపూరితమైనది. నూతన భూములు, సముద్రమార్గములు అప్పుడే కనిపెట్టబడుచున్నవి. ఫిలిప్సు అను స్పెయినురాజు అప్పుడే ఇంగ్లీషువారి నణచివేయుటకును, వారిని బలవంతముగా కేతలిక్కు మతస్థులను చేయుటకును నౌకాదళమును పంపెను.



విలియం షేక్స్పియర్

షేక్స్పియరు కాలమునకు ముందున్న కాలమున యూరోపులో జీవించు వారి బ్రతుకులు నిరుత్సాహకరముగానుండెను. విద్యాపునరుద్ధరణ కాలమునుండియు పరిస్థితులు మారజొచ్చెను. ఇట్టి మార్పులు మొట్టమొదట పట్టణములలో ప్రవేశించెను. తమ చుట్టుపట్లను దూరదేశములందును జరుగు విషయములను ప్రజలు తెలిసికొన గోరుచుండిరి. వార్తలు విన కుతూహలపడుచుండిరి.

ప్రజలను సంతుష్టిపరచుటకై మొదట నాటకశాలలు, తరువాత నవలలు వచ్చినవి. తరువాత వార్తాపత్రికలు బయల్వెడలినవి.

[మూలప్రశ్న 21: షేక్స్పియరు ఎట్టి విషయములలో ప్రతిభాశాలి? ఎల్లతావుల, నేటికికూడ అతని నాటకములు చదివి ఆనందింతురేల?]

§21. విలియంషేక్స్పియర్ జీవితమునుగూర్చి మనకు తెలిసినది బహుకొద్ది. స్ట్రాట్ఫర్డు-ఆన్-ఆవన్ అనుపట్టణము ఇంగ్లాండు మిడ్లాండ్సులో నున్నది. అతని తండ్రి అచ్చట వర్తకముచేయుచుండెను. బహుశా స్ట్రాట్ఫర్డు గ్రామరుబడిలో షేక్స్పియరు చదివియుండవచ్చును. తండ్రి అప్పులపాలగుటచే నతడు 14 ఏండ్లు నిండకముందే బడి వదలవలసివచ్చెను. తరువాత అత డేమిచేసెనో ఎవ్వరికిని తెలియదు. అతడు ఒకనాటక సమాజమును చేరెనని చెప్పుదురు. నాటకములు వ్రాయవలెనను కుతూహలము అతనికి కలుగుట కిది కారణము కావచ్చును. 18-వ ఏట అతడు పెండ్లిచేసికొనెను. ఈకాలముననే కొన్ని చిక్కులు తటస్థించగా స్ట్రాట్ఫర్డు వదలి లండను వెళ్లెను. అచ్చట నాటకములలో మరల వేషములు వేయదొడగెను. నాటకసమాజములవారాడుటకు మంచి నాటకములు వ్రాయవలెనను సంకల్ప మాతనికి కలిగెను.

నవలలనుండియు చరిత్రగ్రంథములనుండియు చక్కని కథలను తీసికొని క్రొత్తపాత్రలను సృష్టించియు, కథలకు మెరుగుపెట్టియు నాటకములు రచించెను. ఈ విధముగా నతడు తన ప్రతిభవల్ల తన కాలమందలి చదువురాని జనులకు సంతోషమును వినోదమును కలిగించెను. అంతేకాదు, అతని నాటకములలో కవితాసౌందర్యము, సత్యము ప్రకాశించుచుండును. కావుననే అతనికీర్తి శాశ్వతముగా నిలిచినది.

20 సంవత్సరములపాటు అతడు 36 నాటకములు, కొన్ని ఖండ కావ్యములు వ్రాసెను.




షేక్స్పియర్ కాలమున నాటకశాల

షేక్స్పియరు నాటకములలో నొక గొప్ప విశేషమున్నది. ఆ కాలమునాటి జనుల జీవితమును, ఊహాలను వెల్లడించుచున్నప్పటి

కిని, 300 సంవత్సరములు దాటినపిమ్మట అవి మన హృదయముల సైతమునాకర్షించుచున్నవి. అంతేగాదు ప్రపంచమందలి ప్రధానభాష లన్నింటిలోనికి నవి తర్జుమా చేయబడ్డవి. నాగరీక దేశములందెల్ల నేడా నాటకముల ప్రదర్శించుచున్నారు. చూచిన జను లానందించుచున్నారు. ఇందుకు కారణమేమి? షేక్స్పియరు నాటకములందలి కథలన్నియు మనోహరములు. సంభాషణములు చక్కనివి. హాస్య ప్రసంగములు కలవు. సర్వదేశములందును సర్వకాలములందును స్త్రీ పురుషులహృదయములలోనుండు ఆందోళనాదులను అతడు తన నాటకములందు చిత్రించియున్నాడు. నేడు నాటకశాలలలో నాటకములను చూచునప్పుడు రంగుతెరలు కనిపించును. తెరలమీది రంగుల దృశ్యములు యథార్థదృశ్యములా యనిపించు నట్లుండును. నాటకమందలి స్త్రీపురుషులు వారికాలమున నెట్టి దుస్తులను ధరించియుండిరో అట్టి దుస్తులనే పాత్రధారులు ధరించుచుండిరి. షేక్స్పియర్ కాలమున రంగులతెరలు లేవు. నాటకరంగ మొక ఉన్నత వేదిక మాత్రమే. దానిపై కప్పుండును. వేదికకు వెనుకభాగమున (పటములో పై రంగము అని చూపబడిన) ఒక అంతస్థు కలదు. వెనుకభాగమునందును ప్రక్కలయందును సాదా తెరలు. రంగమున ప్రవేశించుటకు పూర్వము పాత్రధారు లీతెరల వెనుక నిలబడువారు. షేక్స్పియరు కాలమున ప్రజలు ధరించు దుస్తులే నాటకపాత్రలును ధరించువారు. నాటకము జయప్రదముగా కొనసాగుటకు పాత్రల సంభాషణలును, అభినయకౌశలము మాత్రమే ఆధారముగా నుండెను. షేక్స్పియరు ప్రతిభాశాలియని చెప్పుటకు వేరొకనిదర్శన మేమనగా—అతని కావ్యసృష్టి ఒక కాలమునకు సంబంధించినదికాదు. అన్నికాలములకును సంబంధించినది. అతనిని అమరుడగు ప్రపంచకవి యని చెప్పవచ్చును.

# 7. జాతీయత (nationalism) ప్రారంభము

## 12 పాఠము : జాతియననేమి ?

[మూలప్రశ్న 24 : జాతి (nation) యననేమి ?]

§24. మనము జాతియను పదమును తరుచు వాడుచున్నాము. జాతి యన నేమి? జాతియన నేమికాదో ముందు తెలిసికొందము. ఇంగ్లాండు, అమెరికా భిన్నజాతులవారొకేభాషను మాటాడు దురు. ఇండియా ఒకజాతియైనను అందు భిన్నభాషలు మాటాడు దురు. మరియు ఒకజాతిలోని ప్రజ లొకేమతమువారై యుండ నక్కరలేదు. ఒకేవంశము (race) నకు చెందినవారైనను ఒక జాతి అనిపించుకొనరు. చీనా, జపాను, నార్వే, స్వీడన్ ప్రజలు ఒక్కొకే వంశమునకు చెందినవారు. కాని వారు భిన్నజాతులు.

అయితే జాతి నిజస్వరూపమేమి ? జాతియన ప్రజల మనస్సులలో నుండు ఒక భావన. ఒకేచోట నివసించుచు ఐకమత్యముతో మెలగు వారొకజాతివారగుచున్నారు-వారు భిన్నమతావలంబులు కానచ్చును. భిన్నభాషల మాటాడవచ్చును. భిన్నవంశములకు చెంది యుండవచ్చును.

జాతియన్నది ఒకభావన మాత్రమే అయినచో నది చిరకాలము నిలువదుకదా ? అది సులభముగా మారిపోవునుగదా ? నిజమే. జాతీయత అను భావము మొన్న మొన్నను పుట్టినదే. ఇండియా సంగతి చూడుము. ఏబది సంవత్సరములకు పూర్వము హిందూ దేశప్రజలు తాము అందఱు భారతజాతి సంతానమనియు, తామొక జాతియనియు అనుకొనలేదుకదా !

1500 సంవత్సరమున యూరోపులోకూడ సరిగా నిట్టిపరిస్థితులే.

యుండెను. 'లిఅనార్డొడావించీ' కాలమున ఇటలీ దేశస్థులు తా మొకేజాతివారమని యనుకొనలేదు.

[మూలప్రశ్న 25 : ప్రజ లొకజాతిగా కలియుటకు కారణమేమి ?]

§25. జాతులు అను క్రొత్తభావన ఏ విధముగా అంకురించినది. ప్రపంచమం దన్ని దేశములకు నది ప్రాకుటకు కారణమేమి ?

జాతీయత యను భావన యుదయించుటకు తోడ్పడిన సందర్భములు అనేకము లున్నవి. తమకు శత్రువైనవాని నెదిరించుటకు అవసరము కల్గుటయే ఒక గొప్ప సందర్భము. తాము కలిసిమెలసి యున్నగాని తమ్మొ శత్రువు జయించునని ప్రజలు తలచిననాడు వారు భిన్నమతస్థులమనిగాని, భిన్నవంశస్థులమనిగాని యనుకొనరు. ఇంగ్లీషుప్రజలు ఒకజాతిగా మారుట కిదియే కారణము. స్పెయిను రాజు సైకాదళమునుకూర్చుకొని బ్రిటనుపై దాడివెడల్లి జయించవలె నన్నప్పుడు బ్రిటిషు ప్రజలు తాము కెంటు జనులమనిగాని, కారంవాల్ జనులమనిగాని యార్కుషైరుజనులమనిగాని యనుకొనలేదు. అందరును ఏకీభవించి స్పెయినుబలము నెదిరింపపూనుకొనిరి. తాము భిన్నమతములకు చెందినవారనుమాటకూడ వారు మరచిరి. ఇందు మరియొక అసామాన్యవిషయమున్నది. స్పెయినురాజు ఇంగ్లీషువారిపై దండెత్తి దలచుటకు ఒక కారణము వారు పోపుమాట వినకుండుటయే. రోమన్ కాతలిక్కులగు ఇంగ్లీషువారుసైతము, ప్రాటస్టెంటులగు ఇంగ్లీషువారితో, స్పెయినుతో పోరాడుటకై చేతులు కలిపిరి. ఇంగ్లీషు ప్రజలు తాము ఇంగ్లీషు జాతియని భావింప మొదలిడిరి.

ఇంతకు 100 సంవత్సరములకు పూర్వము ఫ్రాంసులో ఇట్టి పరిస్థితులే సంభవించెను. తన పూర్వికులు ఫ్రాంసులో ఒక భాగ

మునకు రాజులన్న కారణముచేత ఒక ఇంగ్లీషురాజు తాను ఫ్రాంసుకు రాజునని చెప్పుచు ఫ్రాంసుపై దండెత్తెను. ఇంగ్లీషువారికి విజయము చేకూరెను. ఇట్లు కొంతకాలము జరిగెను. జోన్ ఆఫ్ ఆర్క్ అను పేరుగల ఫ్రెంచిబాలిక ఫ్రెంచి ప్రజలందరు ఏకీభవించ వలసినదని ప్రోత్సహించెను. జోన్ ఉక్కు కవచమును ధరించి, ఫ్రెంచి సైనికులను యుద్ధభూమికి తీసుకొనివెళ్లి సేన మొదట తాను నిలబడి పురుషునివలె పోరాడినది. అట్టి ఐక్యభావమును సాధించుట చేతనే ఫ్రెంచివారు ఇంగ్లీషుసైన్యము నోడించగలిగిరి. ఫ్రాంసు కూడ ఒక జాతిగా ఆవిర్భవించెను.

హిందూదేశ చరిత్రను చూచిన మనకు వెల్లడియగు విషయ మేమనగా—రాజపుత్రులందరు ఏకమై మహమ్మదీయులను ప్రతి ఘటించక పోవుటవల్లనే వారు పతితులైరి. 1192 సంవత్సరమున పృథ్వీరాజు తారాయిన్ వద్ద ఘోరీమహమ్మదుచే నోడింపబడుటకు కారణము కనోజిరాజగు జయచంద్రుడు అతనికి సహాయముచేయక పోవుటయే. సంగరాణా 1528 సంవత్సరమున చక్రవర్తియగు బేబరును సైతము ఓడించియుండెడివాడే. అతని సామంతులే విశ్వాసఘాతుకులై అతనికి విషముపెట్టిరి.

హిందూదేశస్థు లేకీభవించినప్పుడు విజయము సాధించి రను విషయముకూడ మనము తెలిసికొనవచ్చును. ఔరంగజేబు చక్ర వర్తివంటి ప్రబలుని ధిక్కరించి శివాజీ మహారాష్ట్ర సామ్రాజ్య మును స్థాపించుటకీ ఏకీభావమే కారణము. నాడునాటికి ఐక్యతను పొందుచున్న హిందూదేశస్థులు ఒక జాతిగా ఏర్పడుచున్నారు.

## 13 పాఠము : ఫ్రాంసుదేశపు 'గొప్పరాజు'

[మూలప్రశ్న 26 : లూయీ XIV యొక్క లక్ష్యమేమి?]

§ 26. 15. 16, 17 శతాబ్దులలో ప్రపంచమందంతటను శౌర్యవంతులగు రాజు లుండిరి. కాని ప్రజాశ్రేయస్సు తమ పరమధర్మమనియు, తాము భోగభాగ్యములతో తులతూగుచుండుట మాత్రము రాజధర్మము కాదనియు గుర్తించినవారు కొద్దిమంది మాత్రమే.

ఈ కాలపు రాజులు పెక్కురు, తమ కిష్టమువచ్చిన పనులు తాము యథేచ్ఛగా చేసికొనుటకు దైవదత్తాధికారము (Divine right) తమకు కలదని నమ్మియుండిరి. ఈశ్వరుడు వారిని రాజులుగా పుట్టించెను ; దేశప్రజలు వారి యాజ్ఞలప్రకారము నడువవలసి యుండునని వారి యూహ.

యూరపు రాజులలో మిక్కిలి ప్రసిద్ధుడు, ఫ్రాంసురాజగు లూయీ XIV. దైవదత్తాధికారము తనకున్నదను నమ్మకము కలవాడు. 1643 సంవత్సరమున నతడు సింహాసనము నధిష్ఠించెను. 1715 సంవత్సరమున చనిపోయెను. ఔరంగజేబు ఇండియాను పరిపాలించు కాలమున నీతడు ఫ్రాంసును పాలించుచుండెను. అయితే ఔరంగజేబుకు 12 సంవత్సరముల ముందుగా నితడు రాజయ్యెను. ఔరంగ



లూయీ XIV

జేబు మరణించినతరువాత 8 సంవత్సరముల కితడు మరణించెను. యూరోపులో ఇంతకాలము రాజ్యముచేసిన రాజు వేరొకడు లేడు.

లూయీ దుష్టుడుకాడు. అతడు సమర్థుడు. ఆశాపూరితుడు. ఫ్రాంసును ప్రపంచమందలి దేశము లన్నిటికన్న శక్తివంతముగా చేయవలెనని అతని ఉద్దేశము. అతని దృష్టిలో ఫ్రాంసు అన్నప్పుడు ఫ్రాంసు ప్రజలులేరు. ఫ్రాంసు అన్నప్పుడు తద్దేశాధీశుడగు తానును తన పరిసరము మాత్రమే అతని దృష్టిలో నుండెను. 'రాజ్యమును నేనే' అను ప్రసిద్ధవాక్య మతడన్నదే. రైనునది మొదలుకొని పిరనీసు పర్వతములవరకు తన రాజ్యము విస్తరింపజేయవలెనని అతని మొదటి లక్ష్యము. భోగభాగ్యములతో వైభవోపేతముగా తా నుండవలె నని యాతని రెండవ లక్ష్యము. ఈ లక్ష్యములు సిద్ధించుటకు అమిత ధనవ్యయము చేయవలెను, గొప్పసైన్యము కావలెను, సౌధములు కావలెను. ఇందుకు కావలసిన ధనము ప్రజలపై పన్నులు విధించుటవలననే రాగలదు. రాజునకు పన్ను లిచ్చుట ప్రజల ధర్మము.

[మూలప్రశ్న 27 : తన లక్ష్యము సిద్ధించుటకు లూయీ ఎట్లు ప్రయత్నించెను? అతడు సాధించిన దేమి ?]

§27. మొదటి లక్ష్యమును సాధించుటకు లూయీ పెద్ద సైన్యమును సమకూర్చెను. మంచి సేనాధిపతుల నియమించి సైనికులకు చక్కని శిక్షణ నిప్పించెను. పిమ్మట నతడు తన దేశమున కుత్తరమున నున్నట్టియు మనమిప్పుడు బెల్జియం అని పిలుచునట్టియు దేశముపై దండెత్తెను. మొట్టమొదట అతనికి విజయమువచ్చెను. క్రొత్తస్థలములు కరగతమయ్యెను. లూయీ తన లక్ష్యము సాధించగలడేమో యనిపించెను.

కాని లూయీ బలవంతుడగుట, యితర జాతుల కిష్టములేదు. తమ దేశములనుకూడ నాత డాక్రమించునేమో యని వారు భయ పడిరి. కాబట్టి వారందరును చేరి లూయీ నెదిరించిరి. క్రమక్రమ ముగా లూయీ సేనలు వెనుకకు తగ్గవలసివచ్చెను. లూయీ పరాజయమునకు ముఖ్యకారకుడు ఇంగ్లీషు సేనాధిపతియగు జాన్ చర్చిల్. ఇతడు హాలండు బెల్జియం దేశములలో పెక్కుచోట్ల ఫ్రెంచి సేలన నోడించెను.

ఇది ఇట్లుండగా లూయీ తన రెండవలక్ష్యమును సాధించు చుండెను. అతడు దివ్యభవనముల పెక్కింటిని నిర్మింపజేసెను. పారిస్‌వద్ద 'వైర్సై' (Versailles) లో చాలాకోట్ల రూపాయలు ఖర్చుపెట్టి అత డొక పెద్ద భవనమును కట్టించెను. 1914–18 సంవత్స రములలో జర్మనీ నెదిరించి పోరిన మొదటి ప్రపంచ సంగ్రామము ముగిసినపిమ్మట సంధిపత్రముపై చేవ్రాళ్లు పెట్టినది వైర్సై భవన ములోనే.

లూయీ XIV కాలమందే దుస్తులు, ఆచారములు, గృహ నిర్మాణము మున్నగు విషయములందేగాక కావ్యనిర్మాణమున కూడ యూరోపుదేశమున కంతటికిని ఫ్రాంసు మార్గదర్శియయ్యెను. 1715 సంవత్సరమున లూయీ మరణించినప్పుడు ఫ్రాంసు బాహ్యసౌందర్యము, వైభవముగల దేశముగా నుండెను. కాని ప్రజలలో అసంతుష్టి, దారిద్ర్యము మెండుగా నుండెను.

## 14. పాఠము: ఘనుడగు పీటరు

[మూలప్రశ్న 28 : పిన్నవయస్సుననే పీటరు తన ఘనత నెట్లు వెల్లడించెను?]

§28. నేటి రష్యా చాలా పెద్దదేశము. బాల్టిక్ సముద్రమునుండి పసిఫిక్ మహాసముద్రమువరకును, ఆర్కిటిక్ మహాసముద్రము

నుండి చీనా ఇండియాల పొలిమేరలవరకును అది వ్యాపించియున్నది. ప్రపంచమందలి ప్రబలమగు జాతులలో నిదియొకటి. మొట్టమొదట ఇది చిన్న దేశము. మాస్కో చుట్టును ఈ దేశముండెను. ఇది అడవులతో నిండియుండెను. సముద్రమును చేరుటకు ఈ దేశస్థులకు మార్గములేదు. బాల్టికు సముద్ర తీరమంతయు స్వీడెన్ రాజు పరిపాలనక్రింద నుండెను. నల్లసముద్రము కాస్పియన్ సముద్రములకు సమీపమందున్న దక్షిణ భాగములు తార్తారుయొక్కయు, తురుష్క రాజులయొక్కయు పరిపాలనము క్రింద నుండెను. జారులు అను రషియారాజు లధిష్ఠించిన సింహాసనమును,



ఘనుడగు పీటర్

చిన్నతనమందే 1682 సంవత్సరములో పీటరు అధిష్ఠించెను. అతడు పేరుకుమాత్రమే రాజు. అతని అక్క రాజ్యభారము వహించి దేశమును పరిపాలించుచుండెను. చిన్నతనమున ఓడలను నడిపించుటయన్న యతనికి పరమప్రీతి. ఓడలను నిర్మించవలెననియు ఆతడాసించుచుండెను.

పీటరు వశమందున్న సముద్రము తెల్లసముద్రమొక్కటే. అది ఉత్తరముగా ఆర్కిటిక్ సముద్రమునకు శాఖగా నున్నది. సంవత్సరమున కారునెలలు అది గడ్డకట్టుకుపోవును. ఈసముద్రములో పీటరు నావికాయాత్రలు చేయ మొదలుపెట్టెను. వయస్సు వచ్చిన పిమ్మట అతడు నిజముగా జార్ అయినప్పటికిని నావలమీదను,

నౌకాయాత్రలమీదను ప్రీతి అతనికి తగ్గలేదు. అన్ని రకముల యంత్రములతోను అతడు ప్రయోగములు చేయుచుండెను. తనకున్న యభిరుచులవంటి యభిరుచులేయున్న యువకుల నతడు చేరదీసెను. అందొక్కడు స్విట్జర్లాండు దేశస్థుడు. లిఫోర్టు అను పేరుగలవాడు. పీటరు సమస్తవిషయములు శ్రద్ధతో నేర్చుకొనెడివాడు. తనకన్న సమర్థులను నాయకులుగా జేసి వారు చెప్పినట్లు తాను చేయుచుండెడివాడు. ఈవిశిష్టలక్షణమే అతనిని ఘనునిగా చేసినది. అందుకే అతనిని నేడు ఘనుడగు పీటరందురు. తెల్లసముద్రము పెద్దది కాదనియు, తనకు చాలదనియు పీటరు భావింపదొడగెను. తన కనువగు ప్రదేశ మెక్కడదొరుకునా యని యూహింపదొడగెను. పశ్చిమదిక్కుగానున్న బాల్టిక్ సముద్రము దక్షిణముననున్న నల్లసముద్రము—పరరాజులవశమందున్నవి. బాల్టిక్ తీరము స్వీడన్ వారిది; నల్లసముద్రము అటమన్ తురుష్కుల సామ్రాజ్యములో నున్నది.

రష్యా దేశపటము చూచిన డాన్‌నది రష్యామధ్యగా మాస్కోకు కొంత దక్షిణములో ప్రవహించుచున్నట్లు తెలిసికొనవచ్చును. నల్లసముద్రపు శాఖయగు అజోవ్ సముద్రములో అది పడుచున్నది. డాన్‌నదీ ముఖమువద్ద అజోవ్ పట్టణము కలదు. ఆకాలమున అది తురుష్కులకోట. పీటరు తన సైన్యముతో వచ్చి ఈకోటను ముట్టడించెను. కాని దానిని పట్టుకొనలేక పోయెను. అతడు మాస్కోకు తిరిగి వెళ్లెను. మరుసటి సంవత్సరము డాన్‌నదిపైనున్న వారొనష్ (Voronezh) వద్ద నౌకాదళము నొకటి నిర్మింపజేసెను. ఈమారు పీటరు అజోవ్‌ను స్వాధీన పరచుకొనెను. పీటరు సైనికులు కోటను ముట్టడించిరి. సముద్రమార్గమున అజోవ్‌ను చేరుటకు తురుష్కులు

ప్రయత్నించిరి. కాని పీటరు నౌకాదళమువారి నష్టగించెను. కోట లోనివారు తిండిలేక ఇతర సహాయములేక లొంగిపోయిరి. ఈవిధముగా పీటరు సముద్రమున కొకమార్గమును చేసికొనగల్గెను.




ఘనుడగు పీటరు కాలమునాటి రష్యా

టాగన్‌రాగ్ నౌకాశ్రయము నతడు నిర్మించెను. నల్లసముద్రములోని అతని నౌకాదళమున కది మొదటి నౌకాశ్రయము.

[మూలప్రశ్న 29: ఏవిధముగా పీటరు రష్యాను నేటిజాతిగా చేసెను?]

§29. ఇది ప్రారంభము మాత్రమే. పశ్చిమయూరోపులోని వృద్ధిలో

నున్న దేశములు తమ కార్యముల నెట్లు చక్కబరుచుకొనుచున్నారో
తెలిసికొనవలెనని పీటరు కోరెను. లిఫోర్టును వెంటబెట్టికొని అతడు
ప్రయాణమై వెళ్లెను. ఇతర దేశములలో ఓడ లెట్లు కట్టుచున్నారో,
ఎట్టి క్రొత్త యంత్రములు వాడుకలోనికి వచ్చినవో అత డీవిధముగా
స్వయముగా నేర్చుకొనెను.

అత డొక సంవత్సరముపైగా దేశమునుండి దేశమునకు తిరి
గెను. ప్రషియాలోని కోనిగ్స్‌బర్గులో తుపాకు లెట్లు చేయుచున్నారో
అతడు చూచెను; డచ్చివారును, ఇంగ్లీషువారును నావల నెట్లు
నిర్మించుచున్నారో అతడు చూచెను; శరీరనిర్మాణశాస్త్రము నతడు
పఠించెను; అతడు నేర్చుకొనదలచిన విషయముల కంతములేదు.
రష్యాను విడిచి ఎక్కువకాల మత డుండ వీలులేకపోయినది. స్వదే
శమున విప్లవము పుట్టినది. దాని నణచివేయుట కతడు తొందరగా
రావలసివచ్చెను. కొద్దివారములలో నాతడు విప్లవము నణచి
వేసెను. వెంటనే అత డొక సంస్కరణమును దేశములో ప్రవేశ
పెట్టెను. ఆనాడు రష్యనులు పొడుగైన వదులుదుస్తులు ధరించి
గడ్డములు పెంచుకొనుచుండిరి. రష్యా పైకి చూచుటకు కూడ నవీన
ముగా కనబడవలెనని పీటరు నిర్ణయించి, తనవద్దకు తన ప్రభువుల
రమ్మని ఆజ్ఞాపించి, స్వహస్తములతో వారి మీసములను గడ్డము
లను కత్తిరించి వేసెను. పొడుగుదుస్తులు ధరించరాదని శాసిం
చెను. జర్మనులవలెను, ఫ్రెంచివారివలెను రష్యనులు దుస్తులు
ధరించవలెనని ఆజ్ఞాపించెను. ఆదినము మొదలు ఎవ్వరైనను గడ్డ
ములను పెంచినచో గడ్డము పొడవునుబట్టి వారు పన్ను చెల్లించ
వలసియుండెను.

పిమ్మట పీటరు తనదృష్టిని బాల్టిక్ సముద్రమువైపు త్రిప్పెను.

అతడు స్వీడన్‌ను ఎదిరించెను. రెండు సంవత్సరములు వారితో యుద్ధముచేసెను. రష్యావైపున ఫిన్‌లాండు సింధుశాఖ తీరమున నున్న రాష్ట్రములనన్నింటిని తనవశము చేయునట్లు స్వీడన్ రాజును బలాత్కరించి తీసికొనెను. సముద్రతీరమున రష్యాకొక క్రొత్త రాజధానిని నిర్మింప నువ్విళ్లూరుచున్న పీటరు కిప్పుడు అనుకూల పరిస్థితులేర్పడెను. సెంటుపీటర్సుబర్గ అను నగరము నాతడు ప్రతిష్ఠించెను. 1917 లో జరిగిన రష్యను విప్లవానంతర మీ నగరమునకు లెనిన్‌గ్రాడను క్రొత్తపేరు వచ్చినది.

'ఘనుడు' అను బిరుదమునకు పీటరు అర్హుడనుటకు సందేహములేదు. గొప్ప ఉదారగుణము లతనియం దున్నప్పటికిని దుర్మార్గముగా కూడ నతడు ప్రవర్తించెను. తానుకోరిన విషయమును కొనసాగించుటకై అతడు ఎట్టి పద్ధతులనైన నవలంబించెను. ఆతని కాలములో క్రూరత్వ మంత తప్పుగా భావింపబడలేదు. కాన క్రూరుడుగా నున్నందుకు మనము అతనిని ఎక్కువ తప్పు పట్టరాదు. రష్యాను నవీనజాతిగా మార్చుట కష్టసాధ్యమగు విషయము. మెత్తనివాడును దయాశీలుడును అట్టిపని చేయజాలడు. పీటరు అట్టిపని చేయగల్గెను.

## అ భ్యా స ము లు

1. ఒకేజాతికి చెందియున్నప్పటికిని ఏయే విషయములలో జనులు భిన్నముగా నుండవచ్చునో ఒకపట్టీ వ్రాయుము.

2. తా మొకేజాతికి చెందినవారమని భావించుట కడ్డువచ్చు విషయములను పట్టికగా వ్రాయుము.

3. రష్యారాజగు ఘనుడగు పీటరు జీవితమును గురించియు, అతడు చేసిన ఘనకార్యముల గురించియు సంగ్రహముగా నొకవ్యాసము వ్రాయుము.

# 8. సముద్రాంతరిత సామ్రాజ్యములు (Overseas empires) స్థాపించుటకు కృషి

## 15 పాఠము : న్యూ ఇంగ్లాండు

[మూలప్రశ్న 30 : న్యూ ఇంగ్లాండు అధినివేశములు ఎందుకు స్థాపించిరి ?]

§30. 17_వ శతాబ్దిలో పలువురు తాము సత్యమని నమ్మిన మతమును మార్చుకొనుట కిష్టపడక తమ ఇష్టముచొప్పున భగవంతు నారాధించుటకు స్వేచ్ఛలేక మాతృ దేశమును విడనాడవలసి వచ్చినది. వారిరాజులు మతము మార్చుకొమ్మని చెప్పుటయేగాక బలాత్కారము చేయుటకూడ ఇందుకు కారణము.

ఇట్లు మాతృదేశమును బాసిపోయినవారిలో ప్రసిద్ధులు పిల్ గ్రిమ్ పాదిరీలు (Pilgrim fathers) అనువారు. ఇంగ్లీషు రాజు ప్రాటస్టెంటుల పక్ష మవలంబించినప్పుడు తానే ఇంగ్లాండు చర్చికి అధిపతియై దానిని రోమన్ కాతలిక్కు చర్చినుండి వేరుచేసెను. ఇంగ్లాండు చర్చికి విధించిన ప్రకారమే ప్రజలు భగవంతు నారాధించవలెను. వారట్లు చేయుటకు సమ్మతించనిచో వారిని రాజు కఠిన దండనలపాలు చేయును. 1620 సంవత్సర ప్రాంతమున కొందరు జనులు ఇంగ్లాండును విడిచిపెట్టుటకు సంకల్పించిరి. మొదట వారు హాలెండుకు వెళ్ళిరి. క్రొత్తదేశమగు అమెరికాకు పోయి క్రొత్తకాపురములు పెట్టుకొనవలెనని తరువాత వారు నిశ్చయించిరి. మేఫ్లవర్ అను ఓడలో 102 పురుషులు, స్త్రీలు, పిల్లలు ప్రయాణమైరి. వర్జీనియా సముద్రతీరమున వారు దిగవలెనని సంకల్పించిరి కాని పవనస్థితి (weather) అననుకూలముగా నుండుటచే వారి యోడ ఉత్తరదిశగా కొట్టుకొనిపోయెను. మూడు

నెలలు ప్రయాణముచేసి వారు మెసచూసెట్సు (Massachusetts) తీరమున, నేడు బోస్టన్ ఉన్న చోటికి కొంచెము దక్షిణముగానున్న




అమెరికా అధినివేశ రాజ్యములు

స్థలమున దిగిరి. ఆ స్థలమునకు వారు ప్లిమత్ అను పేరిడిరి. ఇంగ్లాండులో తాము చూచిన కడపటి స్థలము ప్లిమత్. దానినిబట్టి

దీని కాపరిడిరి. కొన్ని సంవత్సరములలో అధినివేశము వృద్ధినంః జొచ్చెను. ప్రతిసంవత్సరము ఓడల నిండుగ మనుష్యులువచ్చి దిగ సాగిరి. బోస్టన్ అఖాతము (bay) తీరము పొడుగునను గ్రామములు లేచెను.

కాని శోచనీయమగు విషయ మేమనగా—తమకిష్టమువచ్చిన విధముగా భగవంతు నారాధించుటకు స్వేచ్ఛనుగోరి మాతృభూమిని విడనాడివచ్చిన వీరు క్రొత్తభూమిలో నట్టి స్వేచ్ఛనే ఇతరుల కిచ్చుటకు సమ్మతింపరైరి. అందుచే క్రొత్తగా వచ్చినవారు మొస చూపె ట్టుకు ఉత్తరముగాను దక్షిణముగాను అమెరికా తీరస్థ ప్రదేశములం దక్కడక్కడ తమ సొంత అధినివేశముల నేర్పరుచుకొనిరి. మైన్, కనెటీకట్ (Connecticut) అధినివేశము లీవిధముగా లేచినవే. ఇంకను దక్షిణమున డచ్చివారి అధినివేశము స్వీడిష్‌వారి అధిని వేశములును ఉన్నవి. అందు ప్రధానమైనది న్యూ ఆంస్టెర్‌డామ్. కొన్నాళ్లైన పిమ్మట దీనిని డచ్చివారినుండి బ్రిటిష్‌వారు తీసికొని న్యూయార్కు అని దానికి క్రొత్తపేరు పెట్టిరి. ఇదియే యభివృద్ధి చెంది నేటి ప్రసిద్ధనగరమైన న్యూయార్కైనది. ఇంకను దక్షిణ



విలియం పెన్

ముగా విలియంపెన్ అను మహాసీయుడు స్థాపించిన అధినివేశము కలదు. గాంధీ మహాత్ముడు నేడు బోధించుచున్న అహింసాతత్త్వమునే అతడు బోధించెను. అతని అధినివేశము పేరు పెన్సిల్‌వేనియా. ఇందలి జనులు తమ యిష్టముచొప్పున స్వేచ్ఛగా భగవదారాధన చేసికొనవచ్చును. ఎఱ్ఱ ఇండియనుల

యెడ కూడ అహింసాభావమును ప్రకటించిరి. ఇందువలన నా అధినివేశము ప్రసిద్ధికి వచ్చెను. వలసపోయిన వారందరు. ఎఱ్ఱ ఇండియనులతో సామరస్యముగా మెలగుచుండిరి.

[మూలప్రశ్న 31 : వర్జినియా ఎందుకు ప్రసిద్ధిచెందెను? ఫ్లారిడా, జార్జియా, కెరొలైనల నెవరు అధినివేశములుగా చేసికొనిరి?]

§31. పెన్సిల్వేనియాకు దక్షిణముగా మేరీలాండు ఉన్నట్లు మ్యాపులో చూడనగును. మేరీలాండు రోమన్ కాతలిక్కుల అధినివేశము. ఇంగ్లాండులో రోమన్ కాతలిక్కులను సరిగా చూడనందున వారిచ్చటికి వలసవచ్చిరి. మేరీలాండుకు దక్షిణముగా వర్జినియా ఉన్నది. 1584 సంవత్సరములో సర్ వాల్టర్ రాలీ దీనిని స్థాపించెను. అమెరికాలో ఇంగ్లీషువారు స్థాపించిన అధినివేశములలో నిది మొదటిది. ఎఱ్ఱ ఇండియనులు పొగాకు చుట్టలను త్రాగుచుండగా యూరోపియనులు చూచిన దీ వర్జినియాలోనే. ఇప్పుడు కూడ వర్జినియాలో పండిన పొగాకే ప్రపంచమందంతటను ప్రసిద్ధి జెందినది. వర్జినియానుండియే సర్ వాల్టర్ రాలీ ఐర్లాండుకు ఉర్లగడ్డ మొక్కను తీసికొనివచ్చెను.

వర్జినియాకు దక్షిణమున—ఉత్తర దక్షిణ కారోలీనా లున్నవి. ఇవి మొట్టమొదట ఫ్రెంచి ప్రాటస్టెంటుల అధినివేశములు, రోమన్ కాతలిక్కు రాజు వారిని ఫ్రాంసులో బాధపెట్టుటచే వారు ఫ్రాంసును వదలిపెట్టవలసినవారైరి. పిమ్మట ఇంగ్లాండునుండియు స్కాట్లాండునుండియు వలసకై జనులువచ్చి దిగిరి. క్రమముగా నవి బ్రిటిషు అధినివేశములైనవి. కారోలినాకు దక్షిణముగా జార్జియా ఉన్నది. ఇతర అధినివేశములు స్థాపించిన ఎంతకాలమునకో యీ అధినివేశము స్థాపించబడినది. అప్పులు చెల్లించలేక కారాగార

వాసము ననుభవించుచున్న జనులను పలువురను వదలిపెట్టించి ఒక దయార్ద్రహృదయుడు వారికొరకై యీ అధినివేశమును స్థాపించెను. అమెరికాకు వారు వచ్చుటచే అప్పులబాధలు కాని యితర బాధలుకాని వారికి లేకుండపోయెను. ద్వితీయ జార్జిరాజు పేరన అధినివేశమును స్థాపించి దీనికి జార్జియా యను పేరుపెట్టిరి.

పైని పేర్కొన్న వలసభూములన్నియు బ్రిటిషువారిచో, స్థాపించిన కొన్నాళ్లకు బ్రిటిషువారి వశమైనవో. జార్జియాకు దక్షిణమున ఫ్లారీడాగలదు. కొలంబసుకాలమునకు తరువాత పశ్చిమ ఇండీసు దీవులనుండి స్పెయిను దేశస్థులు వచ్చి అమెరికాయొక్క ఈ భాగమును మొట్టమొదట కనిపెట్టిరి. మిసిసిప్పినదికి పడమరగా టెక్సాసు కలదు. ఇదికూడ స్పెయిను దేశస్థుల అధినివేశమే. దాని తరువాత మెక్సికో. (చూడు 8-వ పాఠము)

ఫ్లారిడాకును టెక్సాసుకును మధ్య, మిసిసిప్పినదీ తీరముల రెండు గునను కొన్ని ఫ్రెంచి అధినివేశము లున్నవి. వీనికి లూయీజియానా అనిపేరు. ఫ్రెంచిరాజు లూయి XIV పేరే వీనికి పెట్టిరి. ఉత్తర అమెరికా పటమును జాగ్రత్తగా పరీక్షించినచో మిసిసిప్పి నదిలో చేరు ఉపనదులు పెక్కులు 'మహా సరస్సుల', ప్రాంతమందే పుట్టుచున్నవని తెలిసికొనవచ్చును. మహా సరస్సులను కనిపెట్టిన ఫ్రెంచి పరిశోధకులకు ఉపనదులు గుర్తించుట కష్టము కాదు. అన్నిటికన్న పెద్ద ఉపనది ఓహియో. దీనిమీద దిగువగా నావలపై పోయి మిసిసిప్పినదిని చేరుటకూడ కష్టముకాదు. వారు సరిగా ఆవిధముగానే చేసిరి. దాని ఫలితమేమో ఇప్పుడు తెలిసికొందము.

## 16 పాఠము : ఫ్రెంచివారు—బ్రిటిషువారు : విలియంపిట్ : ప్రషియాదేశపురాజు ఘనుడగు ఫ్రెడరిక్.

[మూలప్రశ్న 32 : ఫ్రెంచివారును బ్రిటిషువారును అమెరికాలోను ఇండియాలోను స్పర్థవహించుటకు కారణమేమి?]

§32. అమెరికాలోని బ్రిటిషు అధినివేశములన్నియు తూర్పుతీరము పొడుగునను ఉన్నవి. మరియు ఫ్రెంచివారికి చెందిన దేశాన్వేషణ తత్పరులు explorers సెంటులారెన్సునదిమీద ఎగువగాపోయి మహా సరస్సులనుచేరి అక్కడనుండి ఓహియోనదిమీద దిగువగా వచ్చి లూయిజియానాను చేరినట్లు తెలిసికొంటిమి. అమెరికాలోని బ్రిటిషు అధినివేశములలోని జనులు నివసించుటకు ఎక్కువ స్థలము కావలసివచ్చెను. అందుకై తూర్పుతీరము పొడుగుననున్న కొండలను వారు దాటిరి. ఓహియోనదియొక్క విశాలమగు లోయను వారు చేరిరి. అక్కడ ఫ్రెంచివా రుండిరి.

ఫ్రెంచివారికి అవసరమునకు మించిన స్థలముండెను. యూరోపియనులు అమెరికాలో ప్రవేశించుటకుముందు అమెరికాలో ఎర్ర ఇండియనులు మాత్రమే నివసించుచుండిరి. వారు ఆసియా ఈశాన్య భాగమునందుండి అమెరికాకు పోయియుండిరి. అమెరికావంటి పెద్ద ఖండములో నివసించియున్న ఎర్ర ఇండియనుల సంఖ్య కొంచెమే. కాన వలసపోయిన బ్రిటిషువారు పశ్చిమముగా తమ భూములను విస్తరించుకొన గోరిరి. ఇంతకుముందు ఫ్రాంసుకొరకు కేటాయింపుచేసిన భూములలో బ్రిటిషువారు కాలుపెట్టుట ఫ్రెంచివారి కిష్టముగాలేదు. సెంటులారెన్సు ఓహియోనదుల పొడవునను వారు బలమైన కోటల నిర్మించుకొనిరి. దగ్గరకువచ్చిన తరిమివేసెదమని బ్రిటిషువారిని వారు బెదరించుచుండిరి.

సరిగా ఆకాలమునందే ఇండియాలో ఫ్రెంచివారును బ్రిటిషు వారును, పోటీలు పడుచుండిరి. ఔరంగజేబు మరణానంతరము మొగలులశక్తి క్రమక్రమముగా సన్నగిల్లెను. వేరు వేరు రాష్ట్రము లందలి నవాబులును, నైజాములును స్వతంత్రరాజులైరి. ఇట్టి కలతరోజులలో ఫ్రెంచి, బ్రిటిషు తూర్పుఇండియా సంఘములు, సాయుధులగు సైనికుల సహాయములేనిదే వ్యాపారముచేసికొనుట కష్టమైనది. మొట్టమొదట వారు తమకోటలను గట్టి చేసికొని వానిని సంరక్షించుటకు సైనికుల నియమించిరి. పిమ్మట తమ పలుకుబడిని వృద్ధిచేసికొనుటకు సమీపమందున్న రాజులకును నవాబులకును సహాయమును చేయ మొదలిడిరి. రాజులయొక్కయు, నవాబులయొక్కయు సైన్యములకొరకు ఇండియను సైనికులకు వారు శిక్షణనిచ్చిరి. వారికి తుపాకులను యూరోపియను సేనాధికారులను ఇచ్చిరి. రాజులును నవాబులును ఒకరితోనొకరు జగడములు పెట్టుకొని ఈ సైన్యములతో పోరాడుటకు తలపడినప్పుడు ఫ్రెంచి బ్రిటిషు తూర్పుఇండియా సంఘములు ఎదురుపక్షముల చేరుచుండిరి.

తరువాత తమలోతాము పోరాడుకొనునప్పుడీ రాజుల యొక్కయు నవాబుల యొక్కయు సహాయమును తీసికొనుచుండిరి. ఈ విధముగా వీరి ఉభయుల పోరాటములును సంగ్రామరూపము ధరించెను. ఉత్తర అమెరికాలోను, ఇండియాలోను ఒకరితో నొకరు పోరాడుటకు ఫ్రెంచివారును బ్రిటిషువారును సంసిద్ధులై యుండిరి. యూరోపులోకూడ వారెట్లు పోరాడిరో ఇప్పుడు తెలిసికొందము.

[మూలప్రశ్న 33: ఏడు సంవత్సరముల సంగ్రామమునందు బ్రిటిషువారికి విజయము నెట్లు పిట్ చేకూర్చెను?]

§33. ఈకాలమున ఇంగ్లాండు ప్రధానమంత్రి విలియం పిట్. అతడు సమర్థుడు. గొప్పవక్త. 48 సంవత్సరముల వయస్సు వచ్చుసరి కతడు ప్రధానమంత్రి యయ్యెను. బ్రిటిషు సామ్రాజ్యమునకు పునాదులు వేసినవాడతడే. ఫ్రెంచివారికిని బ్రిటిషువారికిని యుద్ధము వచ్చితీరునని యతడు భావించెను. బ్రిటిషువారికే విజయము సిద్ధించవలెనని యాతడు నిశ్చయము చేసికొనెను. అతడుచేసిన దిది.



విలియం పిట్ (జ్యేష్ఠుడు)

బ్రిటిషు నౌకాదళమునకును, అమెరికా ఇండియా దేశములలోని సైన్యములకును, సమర్థులగు పడుచువారిని నాయకులనుగా నియమించెను. ప్రశస్తమగు యుద్ధసామగ్రినిచ్చి ఫ్రెంచివారితో పోరాడుటకు వారిని పంపెను. ఇండియాలో బ్రిటిషువారికి నాయకుడుగా నుండుటకై రాబర్టుక్లైవును నియమించినది పిట్టే. అప్పటికి క్లైవు వయస్సు 27 ఏండ్లు.

ఉత్తర అమెరికాలోనున్న బ్రిటిషుసేనల కధిపతిగా జేమ్సు వుల్ఫును పిట్ నియమించెను. అప్పటి కీతనియవస్సు 21 సం॥లు.

పిట్ చేసిన రెండవ కార్యమేమనగా యూరోపులో ఫ్రాంసుకు శత్రువు ప్రషియా. అప్పటి ప్రషియారాజు ఫ్రెడరిక్ II. ఆకాలమున యుద్ధతంత్ర నిపుణులలో పేరెన్నిక గన్నవాడు ఫ్రెడరిక్కు.

అతడు ప్రష్యియన్ సేనలకు మంచి శిక్షణ నిచ్చెను. ఆ కారణమున యూరోపులో అంత శక్తివంతమైన సైన్యములేదని దానికి పేరు వచ్చెను. అట్టి ఫ్రెడరిక్కుకు పిట్ సహాయముచేయ మొదలుపెట్టెను.


ఘనుడగు ఫ్రెడరిక్

తన సైన్యము నాధారముగా జేసికొని ప్రష్యియాను యూరోపులో ప్రప్రథమజాతులలో నొకటిగా చేయవలెనని అతని యాశయము. అట్లు జరుగుట కతడు ఫ్రెంచివారి నోడించవలసియుండెను. ఫ్రెంచి వారే అతని ప్రబలశత్రువులు. ఫ్రెడరిక్కుకు సహాయముగా పిట్ కొందరు బ్రిటిష్ సైనికులను పంపెను. అతడు చేసిన ముఖ్య సహాయము ఫ్రెడరిక్కుకు ధనమిచ్చుట.

1756 నుండి 1763 వరకు ఏడు సంవత్సరములపాటు ఈయుద్ధము జరిగెను. అందువల్లనే దీనికి 'ఏడు సంవత్సరముల సంగ్రామ'మని పేరువచ్చెను. రష్యా, స్వీడన్, ఆస్ట్రియా దేశములు ఫ్రెంచి పక్షమున చేరెను. కాని ఫ్రెడరిక్కు అదృష్టమువల్ల రష్యాచక్రవర్తిని మరణించెను. ఆమె తరువాత వచ్చిన పాలకుడు ఫ్రెడరిక్కును మెచ్చుకొనువాడగుటవల్ల యుద్ధమునుండి విరమించెను. సుశిక్షితులగు తనసైనికుల సహాయమున ఫ్రెడరిక్కు ఫ్రాంసు ఆస్ట్రియాలపై విజయము సాధించెను. ఇది యిట్లుండగా బ్రిటిష్ నౌకాదళము సముద్రములనుండి ఫ్రెంచివారిని తరిమివేసెను. అమెరికాలో వుల్ఫు ఆధిపత్యము క్రిందను, ఇండియాలో క్లైవు ఆధిపత్యము

క్రిందను ఉన్న సేనలు ఫ్రెంచివారిని భూమిపై నోడించెను. 1763 సంవత్సరమున సంధి జరిగినది. పారిస్ సంధిప్రకారము ఫ్రెంచివారు తమకు ఉత్తర అమెరికాలోను ఇండియాలోను ఉన్న ప్రదేశములపై హక్కు వదలుకోవలసివచ్చెను. యూరోపులో ప్రషియా ప్రముఖ జాతి యయ్యెను. బ్రిటిషుసామ్రాజ్య మప్పుడుదయించెను. ఇందుకు కారకులు విలియమ్ పిట్ ఒకడు, ప్రషియారాజగు ఫ్రెడరిక్ II ఒకడు. అప్పటినుండియే ఫ్రెడరిక్కుకు ఘనుడగు ఫ్రెడరిక్కు అను పేరు వచ్చెను. ఈబిరుదమునకతడు తగియుండెను. ఇందుకు కారణ మతడొక గొప్పసైనికుడు. తన ప్రజలకు విద్యగరపుటకును, మత సహనము నేర్పుటకును ప్రయత్నించిన రాజులలో అతడు ప్రథముడు. ఈ విషయములలో అతడు తన కాలమునకు మించి ముందడుగు వేసియుండెను.

## అభ్యాసములు

1. ఉత్తరఅమెరికాలోని యూరోపియన్ అధినివేశముల పేర్లను పట్టికగా వ్రాసి, అందు ప్రతియొక్కటి ఎవరిచే ఎందుకై స్థాపింపబడినదో తెలుపుడు?

2. ఫ్రెంచి, బ్రిటిషు తూర్పుఇండియా సంఘములు తమ పలుకుబడి నెట్లు వృద్ధిజేసికొనినవి?

3. క్లైవును గురించియు, వుల్ఫ్‌ను గురించియు ఇతర గ్రంథములను చదువుము. ఫ్రెంచివారిపై వారు సాధించిన విజయములగూర్చి క్లుప్తముగా వ్రాయుము.

4. ఘనుడగు ఫ్రెడరిక్కును గూర్చి ఇతర గ్రంథములు చదివి, అతడు ప్రషియా నెట్లు ప్రబలమగు దేశముగా చేసెనో తెలిసికొనుడు. అతడు చేసిన కార్యములను గూర్చి క్లుప్తముగా వ్రాయుడు.

# 9. తిరుగుబాటు: (Rebellion) విప్లవము (Revolution)

## 17 పాఠము : అమెరికాలోని అధినివేశముల తిరుగుబాటు : జార్జి వాషింగ్టన్.

[మూలప్రశ్న 34: అమెరికాలో అధినివేశముల స్థాపించుకొన్నవారి కాగ్రహము కలుగుటకు బ్రిటిషు ప్రభుత్వమువా రేమిచేసిరి ?]

§34. బ్రిటిషువారు ఫ్రెంచివారిపై విజయము సాధించినను ఇందుకై వారు ధనమును అపారముగా ఖర్చుపెట్టవలసివచ్చెను. ఫ్రెంచివారోడిపోయినందువల్ల వలసపోయిన బ్రిటిషు జనులకు లాభములు చేకూరినవి గనుక అమెరికాను రక్షించుట కగు వ్యయములో కొంతభాగము వారు భరించవలసియుండునని బ్రిటిషు ప్రధానులు చెప్పిరి.

ఫ్రెంచివారోడిపోయిరిగాని మరల వారో, ఎఱ్ఱ ఇండియనులో యుద్ధమునకు రావచ్చును. అమెరికాను సంరక్షించుటకు ఒక చిన్న సైన్యమును ఉంచుట మంచిదనియు, అందుకగు ఖర్చులో కొంత భాగము భరించుటకు పన్నులు విధించుకోమనియు బ్రిటిషు ప్రభుత్వము అధినివేశప్రజలను కోరెను. కాని వారు సమ్మతించలేదు. 'ప్రాతినిధ్యములేని పన్నులుండరాద'ని వారు చెప్పిరి. అనగా తమ ప్రతినిధులు సమ్మతించినగాని ప్రజలపై పన్నులు విధించరాదని వారనిరి. (బ్రిటిషు పార్లమెంటులో అమెరికన్ అధినివేశజనుల ప్రతినిధులు లేరు). ఇంగ్లాండులో పలువురు అధినివేశజనులు చెప్పిన మాట న్యాయముగా నున్నదనిరి. బ్రిటిషు ప్రభుత్వము 'స్టాంపు చట్టము'ను ప్యాసుచేసెను. కొన్ని తరహాల పత్రములపై స్టాంపులంటించి తీరవలెనని బలవంతముచేసెను. ఈ విధముగా అధినివేశ

జనులనుండి పన్నులు వసూలుచేయ చూచెను. ఈ చట్టమును రద్దు చేయవలసినదని అధినివేశజనులు ఆందోళన సాగించిరి. ఇంగ్లాండు లోని అభిమానులు వీరికి చేయూతనిచ్చిరి. చట్టము రద్దు చేయబడి నది. 1763 సంవత్సరమున పన్నులు వసూలుచేయ వేరొక ప్రయ త్నము జరిగెను. ఈమారు తేయాకుపై పన్ను వేసిరి. తేయాకు తెచ్చిన ఓడలు బోస్టను చేరుటతోడనే అధినివేశజనులు కొందరు ఓడలపైకి త్రోసికొనిపోయి తేయాకును సముద్రములోనికి త్రోసి వేసిరి. వారిని శిక్షించుటకై బ్రిటిషు ప్రభుత్వము బోస్టను నౌకా శ్రయము మూయించవలసినదని ఉత్తరువుచేసెను. అందుకై సైన్య ముల పంపెను. ఇంతలో కొట్లాటలు ప్రారంభమయ్యెను. క్రమ ముగా పోరాటము ప్రాకెను. అధినివేశజనులును, మాతృభూమి లోనున్న వారి స్నేహితులును ఒకరినొకరు చంపుకొనుట మంచిది కాదని భావించిరి. అయినను సుశిక్షితులగు సైనికులు అధినివేశ జనులలో లేరు. కాని వారు లొంగదలచుకొనలేదు. యుద్ధము చేయుటకు వారు సిద్ధముగా నుండిరి.

అధినివేశములు ఐక్యత జెందిన ఒకజాతి కాదు. ప్రతి అధినివేశ మునకును స్వతంత్ర ప్రభుత్వము కలదు. సమానశత్రువు నెదిరిం చుటకు అవసరము కలిగినది గాన వారేకీభావముతో పనిచేయుట కంగీకరించిరి. జార్జి వాషింగ్టన్



జార్జి వాషింగ్టన్

గొప్పనాయకుడని వారు గ్రహించిరి.

1732 సంవత్సరమున వర్జీనియాలో జార్జి వాషింగ్టన్ ప్రజన్మించెను. బ్రిటిషువారి పక్షమున ఫ్రెంచివారి నెదిరించి పోరాడిన ప్పుడు అతనికి యుద్ధమందు కొంత యనుభవము కలిగెను.

విజయము చేకూరినపిమ్మట అతడు తిరిగి వ్యవసాయము చేసికొనుటకు పోయెను. మిగత జీవితకాలమంతయును ... అధినివేశ రాజ్యమును వృద్ధిచేసికొనుచు గడపవలెననియు మిస్సిసిప్పినదివరకు దానిని విస్తరింపజేయవలెననియు అతని కోరిక. బ్రిటిషు ... చేసినచో ఆ ప్రాంతములందున్న ఎర్రఇండియనులతో పోరాడవలసివచ్చు నన్న కారణముచేత బ్రిటిషు ప్రభుత్వమువారు ఇష్టపడలేదు. ఫ్రెంచివారితో యుద్ధము చాలినంత జరిగినది. కాన ఓహియోనది దాటి అధినివేశజనులు పోరాదని శాసనములు పుట్టెను. దక్షిణభూముల యందున్న అధినివేశజనులు బ్రిటిషు ప్రభుత్వమువారి ఈ చర్యకు కుపితులైరి. క్రొత్త పన్నులు చెల్లించవలసినదని చేసిన ఉత్తరువు ఉత్తరమునందున్న అధినివేశజనులను కుపితులను జేసినది. ఉత్తర దక్షిణములందున్న అధినివేశజనులు మాతృభూమిపై కోపించిరి.

మూడవజార్జి బలవంతముగా పన్నులు వసూలుచేయుటకు తన సైన్యములను పంపినప్పుడు అధినివేశజనులు వాషింగ్టనును సేనానాయకునిగా ఎన్నుకొనిరి. వారు యుద్ధశిక్షణ కలవాటుపడ్డవారు కారు. యుద్ధసామగ్రి వారికి లేదనియే చెప్పవలెను. మొదటి 18 మాసములలోను అమెరికనులు అనుభవజ్ఞులగు బ్రిటిషు సైనికులచేత నెన్నిమారులో యోడింపబడిరి. అయినప్పటికిని వారు లొంగలేదు. వాషింగ్టన్ పలువురకు శిక్షణ నిచ్చుచుండెను. వారికొరకై యుద్ధ సామగ్రిని సమకూర్చుచుండెను. చివరకు 1777 సంవత్సరములో

వారి అదృష్టరేఖ బయలుపడ నారంభించెను.

[మూలప్రశ్న 35 : అధినివేశజనులు స్వాతంత్ర్య మెట్లు సాధించిరి? సాధించినపిమ్మట వారికి తటస్థించినకష్టము లేవి?]

§35. 1777 సంవత్సరములో 8000 మంది సైనికులుగల బ్రిటిష్ సైన్యము, సరటోగావద్ద అమెరికనులకు లొంగిపోవలసివచ్చెను. దీనిని పురస్కరించుకొని ఫ్రెంచివారును, స్పెయిను దేశస్థులును అమెరికనులకు సహాయముచేయ మొదలుపెట్టిరి. వీరు మువ్వురును సఖ్యతగా నుండుటకు సంధిచేసికొనిరి. పిమ్మట ఫ్రెంచి నౌకాదళ మొకటి అమెరికాకు ప్రయాణమై వచ్చెను. ఇంతదనుక సముద్రాధిపత్యము బ్రిటిషువారి కైవసమై యుండెను. ఇప్పు డది సడలెను. దీనికి ఫలితము, 1781 సంవత్సరమున వర్జీనియాలోని యార్కుటౌన్ వద్ద 7000 మంది సైనికులుగల బ్రిటిషు పటాలమును అమెరికనుల యొక్కయు ఫ్రెంచివారియొక్కయు మొత్తము సైన్యము చుట్టుముట్టెను. తత్ఫలితముగ అమెరికనులకు విజయము నిశ్చయమయ్యెను. బ్రిటిషువారికి సముద్రాధిపత్యము ప్రధానబలము. దానిని వా రిప్పుడు కోల్పోయిరి. కాన 1783 సంవత్సరమున జార్జి రాజు, న్యూ యింగ్లాండని పిలువబడు బ్రిటిషు అధినివేశములన్నియు స్వతంత్రరాజ్యము లని ఒప్పుకొనవలసివచ్చెను. కెనడా అధినివేశములు యుద్ధమున పాల్గొనకుండుటచే నవి బ్రిటిషు అధినివేశరాజ్యములుగానే యుండెను.

న్యూ యింగ్లాండు అధినివేశజనులు స్వాతంత్ర్యమును సాధించినది మొదలు అమెరికా సంయుక్తరాష్ట్రముల స్వతంత్రజీవనము ప్రారంభమైనది. ప్రపంచమందలి శక్తివంతమగు గొప్ప జాతులలో నొక్కటిగా నివి పరిణమించెను. జూలై నాల్గవ తేది

ఆ జాతి కుత్సవదినము. ఆ దినముననే అధినివేశజనులు బ్రిటిషు ప్రభుత్వాధికారమును ధిక్కరించి స్వాతంత్ర్యమును ప్రకటించి యుండిరి.

ఇప్పుడు వారందరును ఏకమై ఒక్కజాతివలె వ్యవహరించుకొనవలసియున్నది. ఇది సులభవిషయముకాదు. ప్రతిరాష్ట్రమును తన స్వాతంత్ర్యమును తాను నిలబెట్టుకొనవలెనని చూచుచుండెను. తమ యధికారములను కేంద్రప్రభుత్వము వశముచేయుటకు వారిష్టపడకుండిరి. 1776 సంవత్సరమున వారు స్వాతంత్ర్యప్రకటనమును చేసిరి. క్రొత్త రాజ్యాంగవ్యవస్థ (constitution) కుదుర్చుకొనుసరికి వారికి 11 సంవత్సరముల కాలము పట్టెను.

1787 సంవత్సరమున వివిధరాష్ట్ర ప్రతినిధులు, కర్తవ్యము నాలోచించుటకు సమావేశమైరి. తన రాష్ట్రమునకు ప్రతినిధిగా వాషింగ్టన్ వచ్చెను. అతనిని సభాధ్యక్షునిగా ఎన్నుకొనిరి. రాష్ట్రములన్నియు కలిసి ఫెడరేషన్‌గా తయారుకావలెనని సభలో తీర్మానించిరి. ఫెడరేషన్ (federation) స్వరూప మేట్టిదనగా— ఫెడరేషన్‌లో చేరిన రాష్ట్రములన్నియు తమరాష్ట్రములకు సంబంధించినంతవరకు తమ తమ వ్యవహారములను తామే యథాప్రకారము పరిష్కరించుకొందురు. మొత్తము జాతికంతకును సంబంధించిన వ్యవహారములు మాత్రము—అనగా దేశరక్షణ, ఖజానా, పోస్టల్ విధానము టెలిగ్రాఫులు, రైళ్లు, విదేశవ్యాపారము, సంధులు, విదేశములతో యుద్ధములు మున్నగునవి—అన్నిరాష్ట్రముల ప్రతినిధులు చేరుటచే నైన ఫెడరల్ ప్రభుత్వము (federal government) వారు పరిష్కరింతురు.

అమెరికనులు తమలో నాయకుని ఒకరిని అధ్యక్షుని (president)

గా ఎన్నుకొనుటకు నిశ్చయించిరి. ఇతడు నాలుగు సంవత్సరముల కాలముమాత్రమే ఆ పదవిలో నుండును. పిమ్మట వేరొకరిని ఎన్నుకొందురు. ఇట్లు చేయుటచే ఏ ఒక్కడును చిరకాలముపాటు ప్రబలుడు కాజాలడు. అమెరికా సంయుక్తరాష్ట్రములకు ఎన్నుకొనబడిన మొట్టమొదటి అధ్యక్షుడు జార్జివాషింగ్టన్.

## 18. పాఠము : ఫ్రెంచివిప్లవము

[మూలప్రశ్న 36 : ఫ్రెంచి విప్లవమునకు కారణము లేమి?]

§36. అమెరికాలోని వలసజనుల పోరాటమునకు తిరుగుబాటందురు. స్వాతంత్ర్యమునకై చేసినయుద్ధమది. బ్రిటిషు పరిపాలనమును ధిక్కరించి అమెరికనులు చేసిన తిరుగుబాటులో ఫ్రెంచివారు వారికి సహాయముచేసిరి. ఇప్పుడు ఫ్రాంసులోనే ఒక గొప్ప అల్లరి బయలుదేరెను. ఇది తిరుగుబాటు కాదు. దీనిని విప్లవమందురు. అనగా ఒక దేశమందలి ప్రభుత్వమును ఆ దేశప్రజలే తిరుగద్రోయుట. ఈ విప్లవమునకు కారణ మేమనగా—ఫ్రాంసురాజులు తాము భోగవైభవములలో మునిగితేలుచు తమ బీదప్రజలపై అమితముగా పన్నులు విధించుచుండిరి. ఉన్నత వంశోద్భవులగు ప్రభువులును (nobles) పురోహితులును (priests) వారెంతో భాగ్యవంతులైనప్పటికిని, పన్నులు చెల్లించవలసిన పనిలేదు.

ఫ్రెంచివారు పోరాడిన యుద్ధము లనేకములు. అందుకై ధనవ్యయ మమితముగా నయ్యెను. ప్రజలు చెల్లించవలసిన పన్నుల భారము నానాటికి అతిశయించెను. ప్రజలలో అసంతృప్తిజనించెను.

ఫ్రెంచి ప్రజలలో అసంతృప్తి కలుగుటకు వేరొకకారణము—ఫ్రెంచిజనులు బ్రిటిషువారికి ప్రతిపక్షులై అధినివేశజనులతో చేరి పోరాడిరి. వా రప్పుడు స్వాతంత్ర్యమన్న నేమియో తెలిసికొనిరి.

అట్టి యభిప్రాయములతో నింటికి వచ్చిరి. తమ దేశమందలి, రాజుల యొక్కయు, ప్రభువులయొక్కయు, పురోహితులయొక్కయు నిరంకుశత్వమును భరింపలేకపోయిరి.

1789 సంవత్సరమున ఫ్రెంచివిప్లవము ప్రారంభమాయెను. మొట్టమొదట నది తీవ్రరూపము దాల్చలేదు. ఎంతకాలము నుండియో ఫ్రెంచి పార్లమెంటుసభలు జరుగుటలేదు. పార్లమెంటును సమావేశపరచవలసినదని ప్రజలు నిర్బంధించిరి. పార్లమెంటు సభలో క్రొత్తశాసనములు చేయ వారు నిశ్చయించిరి. ప్రజలతో పాటు ప్రభువులును భాగ్యవంతులును కూడ పన్నులు చెల్లించవలసి యుండుననియు, వ్యక్తిని నిర్బంధించు విషయములోను, వివాదములందును భాగ్యవంతులకును బీదవారికిని సమాన హక్కులుండవలెననియు వారు శాసించ నిశ్చయించిరి. ఈ మార్పులను రాజు అంగీకరించెనుగాని అమలులో పెట్టదలచుకొనలేదు. రహస్యముగా ఒకసైన్యమును ప్రోగుచేసి, ప్రజలను అణచివేసి తన యధికారమును నిలువబెట్టుకొనవలెనని యతడు ప్రయత్నించెను. పారిస్ పౌరు లీమాట వినగానే వైర్సైకు నడిచివెళ్ళి, రాజును పారిస్‌కు తిరిగిరమ్మని నిర్బంధపరచిరి. అతడు వచ్చినపిమ్మట అతని నగరులోనే అతనిని చెరబెట్టిరి.

[మూలప్రశ్న 37: ఫ్రెంచివిప్లవమువల్ల కలిగిన ఫలితము లేమి?]

§37. 1791 సంవత్సరమున తనకు సహాయముచేయుటకై స్నేహితులగు కులీనులు (noblemen) సమకూర్చిన సైన్యమును చేరవలెనని రాజు తన నగరునుండి తప్పించుకొనిపోయెను. జర్మనీ పొలిమేర యొద్ద అతనిని పట్టుకొనిరి. ప్రజలకు రాజుపై ఎంతో కోపము వచ్చెను. చేసిన వాగ్దానములు రాజు నిలుపుకొనలేడని వారు

గ్రహించిరి. దేశశాసనముల ననుసరించి ప్రజలను పరిపాలించవలసి కూడ వారు గ్రహించిరి.

1793 సంవత్సరమున రాజు శిరస్సును ఛేదించిరి. తరువాత రెండుసంవత్సరములలో వేలకొలది కులీనులును, రాణియు, రాజ కుటుంబములోని వారందరును అదేవిధముగా హత్యచేయబడిరి. 'భీతావహమగు పరిపాలనము' (reign of terror) ఈ కాలమున జరిగెను. ఉన్నత వంశమునకు జెందిన జనులు మృత్యువువాత పడవలసి వచ్చెను. ఇట్టి భీతావహపరిపాలనమునకు కారకుడైన ముఖ్యనాయకుడు రోబిస్పియర్ (Robespierre) అనువాడు.




ఉరిదీయు యంత్రము

పై విధముగానే ప్రభుత్వములోని తన ప్రతిపక్షులను కూడ కడతేర్చుటకు అతడు పూనుకొనెను. తమకు కూడ అట్టిప్రమాదమే సంభవించునేమో యని ఇతరనాయకులు భయపడిరి. కాన అతనిని తుద ముట్టించుటకు వారందరును చేరి అతనికి శిరచ్ఛేదనము చేసిరి. అతని మరణానంతరము భీతావహపాలన మంతరించెను. నియమబద్ధ ప్రభుత్వమును ప్రజాప్రభుత్వ పద్ధతిపై వారు స్థాపించిరి. అమెరి

కాలోవలెనే రాజునకుబదులు ఒక అధ్యక్షు నెన్నుకొని ప్రభుత్వమును నడిపించిరి.

ఈ విప్లవము మిక్కిలి హింసాత్మకమైనది. నిరపరాధు లెందరో ప్రాణములు గోల్పోయిరి. కాని ఫ్రెంచిప్రజలకు ఇది కొన్ని మేళ్లను చేకూర్చినది. ఒకటి—కులీనులు, భాగ్యవంతులు, పురోహితులు అన్యాయముగా అనుభవించు లాభములు తుదముట్టెను. భాగ్యవంతులకును బీదవారికిని శాసనము లొక్కటే అయ్యెను. బీదవారు హెచ్చుపన్ను లిచ్చుకొనుట, భాగ్యవంతుల కసలే పన్నులు లేక పోవుట అను అన్యాయ మంతరించెను. న్యాయపద్ధతులమీద పన్నులు విధించు ఆచార మేర్పడెను. రెండు—బీదవారిచేత బలాత్కారముగా బానిసలమాదిరి పనిచేయించిన కులీనుల భూము లన్నియు ముక్కలు ముక్కలుగా ఖండించి మధ్యతరగతుల (middle class) వారికిని బీదవారికిని చౌకగా అమ్మివేసిరి. మూడు—వర్తకము వృద్ధిజెందెను. కుటుంబమునుబట్టియు, హోదానుబట్టియు గాక అర్హతగలవారికే అన్నివృత్తులును అవలంబనీయము లయ్యెను.

విప్లవము వచ్చినందువల్ల తాము సుఖజీవితములు గడపుటకు సావకాశము చిక్కినదని ఫ్రెంచిప్రజలు పలువురు భావించిరి. కాని ఫ్రెంచిప్రజలు తమ రాజును చంపిరను కారణముచేత పొరుగు దేశములందున్న రాజులకు వారిపై కోపము వచ్చెను. ప్రషియా ఆస్ట్రియా దేశములు ఫ్రెంచివారిని శిక్షించవలెనని యూహించినవి. ఫ్రాంసుపై దండెత్తుటకు వారు సైన్యముల బంపిరి. కాని ఫ్రెంచి ప్రజలు తమ ప్రజాప్రభుత్వమును ధైర్యసాహసములతో రక్షించుకొనిరి. విప్లవ మప్పుడే ముగిసినప్పటికిని, క్రొత్త ఫ్రెంచిసేనలను సమకూర్చి శత్రువుల నరికట్టిరి. పిదప ఫ్రెంచిసైన్యములు ఆస్ట్రి

యనులను బెల్జియం హాలెండులనుండి తరిమివేసెను. ఆస్ట్రియనుల పరిపాలనక్రిందనున్న ఇటలీపై దండయాత్రచేసెను.

## 19 పాఠము: నెపోలీయన్‌చక్రవర్తి; నెల్సన్: మాస్కో: వాటర్లూ

[మూలప్రశ్న 38: నెపోలీయన్ ఎట్లు ప్రబలుడయ్యెను?]

§383. ఈ కాలమున ఒక అసాధారణపురుషుడు ప్రబలుడై, చక్రవర్తియై ఫ్రాంసునేలుచు, సుమారు యూరోపునంతను జయించెను. అతడు నెపోలీయన్ బోనపార్ట్. పైని చెప్పిన్న యుద్ధమువల్లనే నెపోలీయన్‌కు నాయకత్వము లభించెను. అతడు యుద్ధోద్యోగిగా సామర్థ్యమునుచూపి నందువల్లనే 27 వ యేట ఫ్రెంచిసైన్యమునకు సర్వసేనానియై (commander) ఆస్ట్రియనులను ఫ్రాంసునుండి తరిమివేసి ఇటలీపై దండెత్తెను.



నెపోలీయన్

ఈసరికి బ్రిటిషువారు ఫ్రెంచివారి శత్రువులలో చేరిరి. బ్రిటిషువారిని ప్రతిఘటించుటకు ఉత్తమపద్ధతి వారివర్తకమును సాగకుండ ఆపివేయుటయు, వారివలసరాజ్యములను అనగా ముఖ్యముగా వారి తూర్పు సామ్రాజ్యమును వశముచేసికొనుటయు అని నెపోలీయన్ ఫ్రెంచిప్రభుత్వముతో చెప్పెను. అందువల్ల నతడు ఫ్రెంచిసేనను

మధ్యధరాసముద్రముమీదుగా ఈజిప్టుకు తీసికొనివెళ్లి దానిని జయించి వశపరచుకొనెను. ఇంతలో బ్రిటిషు నౌకాసేన (navy) నెల్సన్ నాయకత్వమున ఫ్రెంచి నౌకాసేనను నైలుయుద్ధములో (1798) ఓడించెను. ఇట్లు చేయుటవల్ల నెపోలియన్ ఫ్రాంసుకు




పోజాలకుండెను. పాలస్తీనా, ఆసియా మైనరులగుండా అతడు తన సైన్యమును తీసికొనిపోవ ప్రయత్నించెను. కాని బ్రిటిషువారును, తురుష్కులును కలిసి సిరియాలో ఏకర్ వద్ద ఆపివేసిరి. అతడు ఈజిప్టుకు తిరిగివెళ్లక తీరినదికాదు.

ఇంటివద్ద కూడ పరిస్థితులు విషమించినవని అతనికి ఫ్రాంసు నుండి వార్తవచ్చెను. క్రొత్త ఫ్రెంచిప్రభుత్వము దుర్బలముగా నుండెను. నెపోలియన్ వశపరచుకొన్న దేశమును చాలవరకు ఆస్ట్రియనులు తిరిగిజయించుకొనిరి. తొందరగా ఆత డింటికి చేరదలచి పాలస్తీనాలో తనసైన్యమును వదలిపెట్టెను. దానిని నడిపించుట కత డక్కడ లేనికారణమున, బ్రిటిషువారు దానిని వెంటనే ఓడించిరి. ఫ్రెంచిప్రజ లతడు తిరిగివచ్చినందుకు సంతోషించిరి. పరిస్థితులు చక్కజేయగల సమర్థు డత డని వారినమ్మకము. ప్రజాప్రభుత్వమునకు బదులు ముగ్గురు మనుష్యులచేతిలో ప్రభుత్వముంచుటకు వారు నిర్ణయించికొనిరి. వీరికి కాంసలులు (consuls) అని పేరు. అందు ప్రధాన కాంసల్‌గా నెపోలియన్ ఎన్నుకోబడెను. తన చేతులలోనికి సర్వాధికారములు రాగానే, నెపోలియన్ ఇటలీ నుండి ఆస్ట్రియనులను తరిమివేసి తాను ఇటలీకి రా జయ్యెను. తరువాత ఆస్ట్రియా రాజధానియగు వియన్నానును స్వాధీనము చేసికొనెను. ఆస్ట్రియన్ రష్యన్ చక్రవర్తులసేనలను ఆస్ట్రియాలో నున్న ఆస్టర్‌లిట్జ (Austerlitz) కడ జరిగిన గొప్ప యుద్ధములో నోడించెను. అక్కడినుండి ముందుకు చొచ్చుకొనిపోయి ప్రషియనులను ఓడించెను. 1802 సంవత్సరమున యావజ్జీవము ప్రథమ కాంసల్‌గా ఉండునట్లు అతనిని ఫ్రెంచి ప్రజలు ఎన్నుకొనిరి. 1804 సంవత్సరమున నతనికి చక్రవర్తియను బిరుదము నొసంగిరి.

[మూలప్రశ్న 39 : నెపోలియన్ జయించిన దేశములేమి?
చివర కాతడు పడిపోవుటకు కారణమేమి?]

§39. బ్రిటిషుదీవులు, రష్యా, టర్కీలుతప్ప మిగత యూరోపంతయు 1810 సంవత్సరమున నెపోలియన్ పాలనలోనికి వచ్చెను. బ్రిటిషు

వారిని జయించుటకు నెపోలియన్ శాయశక్తుల పాటుపడెను. ఇందు కొరకై అతడు ఇంగ్లీషుఛానల్ ఫ్రెంచితట్టున, సుశిక్షితమగు పెద్ద సైన్యమునుంచి, సమయము దొరికినప్పుడు ఛానల్ దాటించు పడవలను కూడ సిద్ధముగ నుంచెను. కాని బ్రిటిషు నౌకాదళము వారికి దారియ్యలేదు. యూరోపులోని జాతులెవ్వరను గ్రేట్ బ్రిటన్‌తో వర్తకము చేయకుండ బలవంతపెట్టి బ్రిటిషువారికి తిండిలేకుండ చేయుట కాతడు ప్రయత్నించెను. బ్రిటిషు నౌకాదళము కారణముగా అతని కిదియును సాధ్యముకాలేదు. ఈకాలమునందే బ్రిటిషు వారికిని ఫ్రెంచివారికిని ట్రిఫాల్గరువద్ద గొప్ప నౌకాయుద్ధము జరిగెను. బ్రిటిషునౌకాదళమునకు నెల్‌సన్ నౌకాధిపతిగా (admiral) పనిచేసెను. ఫ్రెంచి నౌకాదళము పూర్తిగా ఓడిపోయెను. సముద్రాధికారము బ్రిటిషువారు నిలుపుకొనిరి.



నెల్సన్

యూరోపులోని ఇతర జాతులెవ్వరును బ్రిటిషువారితో వర్తకము చేయరాదనుటయే నెపోలియన్ పతనమునకు కారణము. బ్రిటిషువారితో వర్తకము కూడదన్నప్పుడు రష్యాను జారు అతని ఆజ్ఞను లెక్కపెట్టలేదు. నెపోలియన్ రష్యాపై దండెత్తి దానినోడించి, ఆవిధముగా రష్యారాజును బుద్ధిచెప్పవలె

నని నిశ్చయించెను. 1912 సంవత్సరమున నెపోలియన్ 5 లక్షల మంది సైనికులను వెంటనిడికొని రష్యాదేశమును ప్రవేశించెను. వారు రష్యనుసైన్యము నోడించి రష్యాదేశ రాజధానియగు మాస్కో ప్రవేశించిరి. కాని మాస్కో పరశురామప్రీతి యగుచుండెను. తినుటకు వారి కొకమెతుకైనను దొరకలేదు. ఇండ్లు ప్రమాదమున అంటుకొన్నవో, వారలే అంటించిరో తెలియదు. గ్రామములను విడిచి పారిపోవుటకు ముందు రష్యనుప్రజలు పంటలను ఆహారపదార్థములను నాశనముచేయుచుండిరి. ఫ్రెంచి సైనికులు తిండిలేక మలమల మాడజొచ్చిరి. అప్పుడే శీతకాలము ప్రవేశించెను. ఫ్రాంసులో కన్న రష్యాలో శీతకాలము తీవ్రముగానుండును. ఫ్రాంసుకు తిరిగి నడిచిపోవలసినదేగాని వారు చేయునదేమియు లేకుండెను. వారు నడువవలసిన దూరము రెండువేలమైళ్ళపై చిల్లర. ఫ్రెంచిసేనలకు, తిండిలేదు సరిగదా రష్యను సైనికులు వారిని వెనుకనుండి హింసింప మొదలిడిరి. ఈ విధముగా వేలకొద్ది సైనికులు చనిపోయిరి. 5 లక్షలపై బడిన సైనికులలో ఫ్రాంసుకు చేరినవారు 20 వేలమంది మాత్రమే!

అయినప్పటికిని నెపోలియన్ అసాధారణ జీవితము ముగియలేదు. ఆత డింకొక సైన్యమును సమకూర్చెను. కాని యూరోపులోని యితరజాతుల కతని పరిపాలనము నచ్చలేదు. బ్రిటిషువారు ఒకసైన్యమును స్పెయినులోను, వేరొకటి పోర్చుగల్‌లోను దింపిరి. స్పెయిను పోర్చుగల్ దేశములు తిరుగుబాటు చేయుటవల్ల వారికి సహాయముచేసిరి. రష్యనులు, ప్రషియనులు, ఆస్ట్రియనులుచేరి అతనిని ధిక్కరించిరి. జర్మనీలో ఈ గొప్పజాతుల యుద్ధము జరిగెను. అందు నెపోలియన్ ఓడింపబడెను. పారిస్‌కూడ శత్రువుల

వశమయ్యెను. నెపోలియన్ సింహాసనమును పరిత్యజించక తప్పినది కాదు. ఇటలీ తీరమునకు కొంతదూరములోనున్న ఎల్బాద్వీపము నకు అతడు ప్రవాసిగా పంపబడెను. విప్లవకాలమున చంపబడిన రాజసోదరు డొక్కడు ఫ్రాంసుకు రా జయ్యెను.

ఏడాదిలోపున నెపోలియన్ ఎల్బాద్వీపమునుండి తప్పించుకొని వచ్చి, శాసనముల కనుగుణముగ పాలించెద నని ఫ్రెంచివారికి వాగ్దానము చేసెను. వారు అందుల కియ్యకొనిరి. కాని యూరోపు లోని యితర మిత్రజాతులు, ఏకమై మరల నాతని నెదిరించిరి. 1815 సంవత్సరము జూన్ నెలలో నెపోలియన్ కడపటి యుద్ధమును చేసెను. దానికి వాటర్లూయుద్ధమని పేరు. అతడు పూర్తిగా పరా జితుడై లొంగిపోవలసివచ్చెను.

ఆఫ్రికా పశ్చిమతీరమునకు కొంత దూరముననున్న సెంటు హెలీనా ద్వీపమునకు అతడు ప్రవాసిగా పంపబడెను. 1821 సంవ త్సరమున అతడచ్చటనే మరణించెను. కొంతకాలముపాటు ప్రాత రాజులే మరల ఫ్రాంసును పాలించిరి. కొన్ని సంవత్సరములు గడచిన పిమ్మట మరల వారొక ప్రజాప్రభుత్వమును స్థాపించిరి. నాటినుండియు ఫ్రాంసు ప్రజాప్రభుత్వ పాలనము క్రిందనే యుండెను.

నెపోలియన్ పాలనమువల్ల ఫ్రాంసుకు కొంతలాభము కల్గెను. అతడు చక్కనిరోడ్లను వేయించెను. వంతెనలను కట్టించెను. భవనములను నిర్మించెను. నేటికిని అవి నిలిచియున్నవి. ఫ్రాంసు దేశపు శాసనముల నాతడు సంస్కరించెను. కాని ఈ మంచి కార్యములకొరకు యూరోపుదేశమంతయు ఎంతో బాధపడవలసి వచ్చెను. ఎందరో ప్రాణముల గోల్పోవలసివచ్చెను.

## అ భ్యా స ము లు

1. జార్జివాషింగ్టన్ జీవితమును గూర్చియు, అతడు నిర్వహించిన పనులను గూర్చియు క్లుప్తముగా వ్రాయుము.

2. సముద్రాధిపత్యము, అమెరికా స్వతంత్ర యుద్ధఫలితముల నెట్లు మార్చినది ?

3. ఫెడరేషన్ అన నేమి ? జాతిసమితి లేదా రాష్ట్రసమితికిని దానికిని భేదమేమి ?

4. ఫ్రెంచి విప్లవమునకు కారణములేమి? దాని ఫలితము లేమి ?

5. ఫ్రెంచి విప్లవమునాటి ఉద్రేకపూరితమగు నవల, చార్లెసు డికెన్సువ్రాసిన 'ఎ టేల్ ఆఫ్ టూ సిటీస్' చదువుము.

6. ఫ్రాంసుకు నెపోలియన్ చేసిన మేళ్లేమి? అతడుచేసిన కీళ్లే ?

7. సముద్రాధిపత్యము నెపోలియన్ కార్యక్రమము నెట్లు బాధించినది?

# 10. యంత్రయుగము

## 20 పాఠము : పారిశ్రామిక విప్లవము (Industrial Revolution)

[మూలప్రశ్న 40 : బ్రిటిషు సామ్రాజ్యము ఎట్లు ఎందుకు పెరిగినది ?]

§40. యూరోప్పుకు వాయువ్య దిశయందున్న చిన్న దీవులలో నివసించువారే బ్రిటిషువారు. సముద్రాధిపత్యము కారణముగా వారు నెపోలియను నోడించి తమ సామ్రాజ్యమును విస్తరింపజేసికొనిరి. అందుకు కారణము లరయుదము.

సామ్రాజ్య ప్రారంభమునకును, తదభివృద్ధికిని మొదటికారణము—బ్రిటిషు ద్వీపవాసులు సాహసులై యుండుట. క్రొత్త భూములను, క్రొత్త విషయములను కనిపెట్టుటయన్న వారి కుత్సాహము. వారు మంచి అధినివేశజనులు—అనగా ఇల్లువదలి దూర

దేశములకు పోయి అక్కడ క్రొత్త కాపురములు పెట్టుకొనుటకు వారు వెనుదీయరు.

రెండవకారణము—వారు తెలివితేటలు గల వర్తకులు. బ్రిటిషు సామ్రాజ్యములో నేడు చేరియున్న పెక్కు భాగములవారు మొదట వర్తకరీత్యా వెళ్లి దర్శించినవే. వెళ్ళినచోట వారు వర్తక స్థానముల నిర్మించుకొనిరి. కొంతకాలమైన పిమ్మటనే బ్రిటిషు ప్రభుత్వము ఆ దేశముల పరిపాలనమును స్వీకరించినది. ఇండియా, కెనడా, దక్షిణ ఆఫ్రికాలలో నిట్లే జరిగినది.

మూడవకారణము—వారు చురుకైన నావికులు. వర్తక సౌకర్యార్థమును దూరదేశములందున్న అధినివేశ రాజ్యములతో



వేగముగా పోవు ఓడలు

సంబంధము వీడిపోకుండ రాకపోకలు జరిగించుటకు వారు వడిగా పోవు నావలను నిర్మించుకొనిరి. దూరదేశములందున్న మిత్రుల

నుండి వేరుచేయుటకు బదులు సముద్రము వారికి ఐక్యత చేకూర్చినది. బలమగు నౌకాదళ ముండుటవలన వారు తమ సామ్రాజ్యమును రక్షించుకొనగలిగిరి.

తుదికారణము—వారు చురుకైన బుద్ధికలవారు, కల్పనాశక్తి కలవారు. ఎన్ని కష్టములు సంభవించినను వానినుండి తప్పించుకొనుటకు మార్గములు వెదకుచుందురు.

[మూలప్రశ్న 41: పారిశ్రామిక విప్లవ మన నేమి? అది తొందరగా వచ్చుటకు కారణమైన సృష్టములు (inventions) ఏవి?]

§41. ఈ కాలమువరకును తయారగుచున్న వస్తువులన్నియు చేతితో చేయబడుచుండెను. ఇంటివద్దకూర్చుండి పనివాండ్రు పని



వడుకు నూలు తీయుట

చేయుచు స్వల్పముగా వస్తువులను చేయుచుండిరి. ఇట్టి పనులకు కుటీర పరిశ్రమ (cottage industries) లని పేరు.

నేడు ఇండియాలో నున్నట్లే అప్పుడు ఇంగ్లాండు ప్రతి గ్రామము మందును ఇట్టి వృత్తులవలంబించువా రుండిరి. స్త్రీలు తమ రాటముల త్రిప్పి నూలు వడుకుచుండిరి. బట్టలు నేయువారు, కుండలు చేయువారు, కమ్మరులు, వడ్రంగులు, తోటపని చేయువారును ఉండిరి. ఒక్కొక వస్తువున కొక్కొక్క దేశము ప్రసిద్ధికెక్కెను; బెంగాలులో డక్కా మజిలినులకు (muslins), ఫ్రాంసు పట్టుకు, ఇంగ్లాండు ఉన్ని బట్టలకు, చీనా పట్టుకు, మట్టి పాత్రలకు, స్పెయిను కత్తులకు. ముడి వస్తువులు, నేర్పరులు ఆయా ప్రదేశములందుండుట ఇందుకు కారణము.

బ్రిటిషువారు ఉత్తర అమెరికాకు వలసపోయినప్పుడు ఆ ఖండమందలి ఉష్ణభాగములలో ప్రత్తి పండింపవచ్చునని తెలిసికొనిరి. ఇంగ్లాండుకు వాయవ్యభాగమందున్న లాంకషైరులో వాతావరణమందు తేమ విశేషముగా నుండుటచే, ప్రత్తి పండించుటకు మిక్కిలి శీతలముగా నున్నను, నూలు తీయుటకును, బట్టలు నేయుటకును అనుకూలముగా నుండునని కూడ తెలిసికొనిరి. లాంకషైరులో నేసిన బట్టలకు మంచి ధరలు వచ్చుననియు, ఎక్కువ లాభము వచ్చుననియు తలచిరి. కాబట్టి అమెరికానుండి వచ్చిన ప్రత్తితో లాంకషైరు జనులు వస్త్రములు నేయ ప్రారంభించిరి. ఈ బట్టలకు గిరాకీయుండుటచే, చేతితో నూలుతీసి తమ కుటీరములలో చేతితో బట్టలు నేయుటవల్ల వచ్చు బట్టల సంఖ్యకంటె ఎక్కువ సంఖ్య బట్టలను తయారుచేయుటకు మార్గములను కనిపెట్టుటకు ప్రయత్నించిరి. భాగ్యవంతులు, వడుకునూలు తీయువారిని, చేనేతగాండ్రను కూలికి కుదుర్చుకొనిరి. పెద్ద ఇండ్లలో, నేతమగ్గములను వరుసలుగా బిగించి, వారిచేత బట్టలు నేయించుచుండిరి. ఇట్టి యిండ్లకు కర్మా

గారములని (factories) పేరు. ఎవడికివాడు తాను నేసిన బట్టల నమ్ముకొనుటకు బదులు యజమానితో ఒప్పన్నము చేసికొన్న కూలి డబ్బులను పుచ్చుకొనుచుండిరి. తక్కువకూలికి నేతగాండ్రచే



చేనేత

ఫాక్టరీ అధికారి పనిచేయించగలిగినప్పుడును, దినమున కెక్కువ గంటలు పనిచేయించగలిగినప్పుడును, ఎక్కువ బట్ట వచ్చుటచే ఎక్కువ లాభము నాతడు పొందవచ్చును. ఫాక్టరీ పద్ధతివల్ల కుటీర పరిశ్రమలు చేయువారికి, ఎన్నో కష్టములు సంభవించెను. పని కావలసినవారు తమ గ్రామములను ఇండ్లను వదలి ఫాక్టరీలసమీప మున నివసించవలెను. ఈ విధముగా గొప్ప ఫాక్టరీ పట్టణములు

షాడచూప నారంభించెను. వందలకొలది బీదపనివాండ్రు ఆ పట్టణములలో నివసింపవలసివచ్చెను. పారిశ్రామిక విప్లవ మను గొప్ప పరిణామములో నిది మొదటిదశ.



హార్‌గ్రీవ్‌స్ యొక్క జెన్నీ రాటము (spinning jenny)

తరువాతి దశ—కొద్ది పనివాండ్ర సహాయముతో ఎక్కువబట్ట నేయుటకై యంత్రములను అభివృద్ధిపరచుట. 1766 సంవత్సరమున జేమ్సు హార్‌గ్రీవ్‌స్ అను లాంకషైరు మనుష్యుడు 'స్పిన్నింగ్ జెన్నీ' (spinning jenny)అను రాటము కనిపెట్టెను. ఒకచట్రములో ఎన్నో కదుళ్లు అమర్చబడియుండును. ఒక్క మనుష్యుడు పిడిచక్రమును త్రిప్పిన కదుళ్లన్నియును ఏకకాలమున తిరిగి నూలు పోసుకొనును. కొన్ని సంవత్సరములైనపిమ్మట లాంకషైరులోని వేరొకడు ఆర్క్‌రైటు అనువాడు దీనిని అభివృద్ధిపరచెను. రోలర్ల మధ్య నుండి దారమును పోనిచ్చినట్లయితే కసెలన్నియు దగ్గరగా అదుము

బడుటచే దారమునకు ఎక్కువ బలము వచ్చునని యాతడు కనుగొనెను. ఆర్కురైటు ఫాక్టరీలను కట్టెను. అందు వరుసలుగానున్న యంత్రములన్నియు ఒకేమారు 'జలచక్ర' (water wheel) శక్తిచే పనిచేయును. ప్రవహించు నీటి కెదురుగా చక్రమునుంచిన నది గిర్రున తిరుగును. ఇది జలచక్రము. ఇది తిరుగుటచే కలిగిన శక్తివలన యంత్రములను త్రిప్పవచ్చును. ఆ కాలమున జలమును,



యంత్రముతో వడుకుట

వాయుశక్తియు మాత్రమే తెలిసిన యంత్రశక్తులు. నీటి యావిరి యుపయోగమును విద్యుత్తు ఉపయోగమును అప్పటికి కనిపెట్టబడలేదు.

ఎడ్మండు కార్టురైటు అనునత డొకడు వేరొక ముఖ్యవిషయమును కనిపెట్టెను. మనుష్యులచేగాక యంత్రశక్తిచే నడిపింపబడు మగ్గము నాతడు నిర్మించెను. దీని నుపయోగించి, ఫాక్టరీలలో

యంత్రసహాయమున గుడ్డను విశేషముగా తయారు చేయవచ్చును. యంత్రములను నడిపించుటకు కొద్దిమంది మనుష్యులున్న చాలును. ఫాక్టరీ యజమానుల కిది లాభకరముగానే యుండెనుగాని నేత గాండ్రకు మాత్రము కష్టముగా నుండెను.

## 21 పాఠము : ఆవిరి శక్తి (Steam Power)

[మూలప్రశ్న 42 : ఆవిరి ఇంజను (steam engine) ఎట్లు సృష్టింపబడినది ? దాని నెట్లుపయోగించిరి ?]

§42. వస్తువులను బహుళముగాను, త్వరగాను తయారుచేయు ప్రయత్నముయొక్క తుదిదశ పిమ్మట వచ్చెను. ఇది—ఫాక్టరీల లోని యంత్రములను పనిచేయించుటకు నీటియావిరిశక్తి నుపయో



యంత్రములో నేత

గించుట. బొగ్గు గనులనుండి నీటిని తోడుటకు ఆవిరి యంత్రముల [illegible] వాడుచుండిరి.

తామస్ న్యూకమెన్ అను డివాన్‌షైరు కమ్మరి నీరు పంపు (pump) చేయు ఇంజనును నిర్మించెను. అదియే మొట్టమొదటి మంచి ఇంజను. 1705 సంవత్సరమున అత డొకవిధమగు పంపు చేయు ఇంజనును ప్రదర్శించెను. బొగ్గు గనులనుండి నీటిని పంపు చేసి తోడివేయుటకై దానిని విరివిగా ఉపయోగించిరి.

1765 లో న్యూకమెన్ ఇంజన్ ఒకటి బాగుకు వచ్చెను. దానిని బాగుచేయుటకై జేమ్సు వాట్‌కు ఇచ్చిరి. దానిని పరీక్షించిచూచి అంతకన్న మంచి ఇంజనును నిర్మించుటకు వీలున్న దేమో అని అతడు ఆలోచించెను. 1774 సంవత్సరము నాటికి అత డొక ఇంజను నిర్మించెను. అది వెనుకటి ఇంజనుకన్న బాగుగా పనిచేసెను. బొగ్గు గనులనుండి నీటిని తోడుటకు మాత్రమేగాక, ఫాక్టరీలలో యంత్రములను త్రిప్పుటకును, తెడ్ల చక్రమును (paddle-wheel) త్రిప్పి నీటిపై నావలను నడిపించుటకును కూడ అది పనికివచ్చెను. దాని శక్తితో తమ ఫాక్టరీలలోని కదుళ్ళను మగ్గములను ఆడించవచ్చుననియు, విశ్రాంతి కోరకుండ అది కొన్ని వందలమంది మనుష్యులు చేయు పనిని చేయగలదనియు, జల చక్రముకన్న అది చాల శక్తివంతమైనదనియు తెలిసికొని ఫాక్టరీ యజమానులు దానిని కొని ఉపయోగించిరి.

1801 సంవత్సరమున వాట్ యింజను నొకదాని నొకపడవలో నమర్చిరి. వెనుకనున్న తెడ్లచక్రము నది త్రిప్పెను. పడవ నీటిపై కదలి ముందుకు పోయెను. అదియే మొదటి ఆవిరి పడవ. కొన్ని సంవత్సరములైన పిమ్మట రాబర్టు ఫుల్‌టన్ అను అమెరికా దేశస్థుడు కొన్ని ఆవిరి పడవలను, వాట్ ఇంజనుల నమర్చి తయారు చేసెను. అట్లాంటిక్ మహాసముద్రమును దాటిన మొట్టమొదటి

ఆవిరియోడ అమెరికాలో తయారైనదే.

[మూలప్రశ్న 43: రైళ్లు ఎట్లు కనిపెట్టబడినవి? వానిఫలిత మేమి?]

§43. చక్రములుగల బండికి ఆవిరి ఇంజనును అమర్చిన నది లోకోమోటివ్ (locomotive) అగును. స్వశక్తిచేత ఒక స్థలము నుండి వేరొక స్థలమునకు పోవు ఇంజనుకు లోకోమోటీ వని పేరు. ఈ కాలమందే ఆవిరి లోకోమోటీవ్ కనిపెట్టబడెను.

1801 సంవత్సరమున రిచర్డ్ ట్రెవిథిక్ అనువాడు ఒక సరకుల బండికి వాట్ ఇంజనును అమర్చగా అది మామూలు రోడ్డుమీాద



స్టీఫెన్సన్ (ఇంజను)

నడిచినది. పిమ్మట 1804 సంవత్సరమున అతడు అట్టి బండినే రైలు పట్టాలమీాద నడిపించెను. సుమారీ కాలమునందే న్యూకాసిల్ వద్ద ఒక బొగ్గు గనిలో ఒక యువకుడు పనిచేయుచుండెను. అతని పేరు జార్జి స్టీఫెన్సన్. 1815 సంవత్సరమున నతడు బొగ్గుబండ్లను

లాగుకొనిపోవు ఇంజనుల నిర్మించెను. బొగ్గునిండిన బండ్లను ఇంజను లాగగలిగినప్పుడు మనుష్యులు కూర్చున్న బండ్లను మాత్రము లాగలేదా? అందుకొరకై దాని నేల వినియోగించరాదు? అను సందేహము ప్రజలకు గలిగెను. ఆ ప్రకారముగా 1825 సంవత్సరమున జార్జి స్టిఫెన్‌సన్ ఒక రైల్వేను నిర్మించెను.

లివర్పూల్ మాంచెష్టర్ నగరముల మధ్య ఒక రైల్వే కట్టుటకు 1829 సంవత్సరమున నిర్ణయించిరి. ఈ రైల్వే కుపయోగించుటకు ఏ లోకోమోటివ్ ఇంజను అత్యుత్తమ మైనదో నిర్ణయించుటకు పోటీపెట్టిరి. పోటీలో స్టిఫెన్‌సన్ గెలిచెను.

మనుష్యులకును సరుకులకును ఒక చోటనుండి వేరొక చోటికి తీసికొనిపోవు ఈ నూతనపద్ధతి అందరికిని నచ్చినది. పది సంవత్సరముల లోపల 250 రైల్వే కంపెనీలు ఒక్క ఇంగ్లాండులో తల యెత్తెను. ప్రపంచమందన్ని ప్రాంతములందును రైల్వేలను నిర్మించ ప్రారంభించిరి. జార్జి స్టిఫెన్‌సన్ పేరు ప్రసిద్ధికెక్కెను. పారిశ్రామిక విప్లవము తేవలసిన అభివృద్ధిని తెచ్చినది.

10,000 సంవత్సరముల క్రితము కాబోలు వ్యవసాయము కనిపెట్టబడినది. నాటినుండి మానవుని జీవితమున మార్పు లేమియు కలుగలేదు. 19-వ శతాబ్దిలో గొప్పమార్పు వచ్చినది. యంత్ర సహాయముతో వస్తువులను బహుళముగా తయారుచేయుట, భూమిమీదను, నీటిమీదను దూరప్రయాణము లేదేశమునకైనను యంత్రసహాయముతో చేయుట—అనునవి ఈ మార్పు లక్షణములు. ఈ మార్పును విప్లవ మనవచ్చును. ఇది పారిశ్రామిక విప్లవము—వస్తువులను తయారుచేయు పద్ధతిలో హఠాత్తుగా వచ్చిన మార్పు. ఇది సాంఘిక విప్లవముకూడ—మానవుని జీవిత

పద్ధతులలో కలిగిన గొప్ప మార్పు.

అ భ్యా స ము లు

1. ఈ కాలమున బ్రిటిషు సామ్రాజ్యము పెరుగుటకు కారణమేమి ?

2. పారిశ్రామిక విప్లవమునకు కారణమైన యంత్రములు ఏయే దశలుదాటి యభివృద్ధి కెందినవి ?

3. మనుష్యులనుగాని వస్తువులనుగాని ఒకచోటనుండి వేరొకచోటికి తీసి కొని పోవుటకు ఎన్ని విధములగు రవాణాపద్ధతు లున్నవో వ్రాయుము. వాటిలో (1) హిమాలయ పర్వతములగుండా సరుకును తీసికొనిపోవుటకును, (2) పసిఫిక్ మహాసముద్రముమీద ప్రయాణీకులను తీసికొని పోవుటకును పనికి వచ్చువాటిని—వాటి ప్రయోజనమును వేగమునుబట్టి అంకెలువేసి చూపుము.

4. మానవుని జీవితములో యంత్రములను ఉపయోగించుటవల్ల వచ్చినంత గొప్పమార్పు ఎప్పుడును రాలేదు—దీనిని చర్చింపుము.

# 11. బానిసత్వమునుండియు బాధలనుండియు ప్రజలను కాపాడుట

## 22 పాఠము : అబ్రహామ్ లింకన్ : అమెరికనుల అంతఃకలహము (Civil war)

[మూలప్రశ్న 44 : బానిసవ్యాపార మెట్లు ప్రారంభమైనది ? అమె సంయుక్తరాష్ట్రములలో అంతఃకలహమున కది ఎట్లుకారణమైన

§44. మానవుడు సాటిమానవులయెడల చూపిన దారుణ క్రౌ మునకు కారణములో బహుశా అసహనము ఒకటి. అత్యాశ త్వరలో భాగ్యవంతులు కావలెనను కోరికయుకూడ దారుణ క్రూ కృత్యములకు కారణమైనవి. ధనము వృద్ధిచేసికొనుటకు అనేకా కాశములను కల్పించిన పారిశ్రామిక విప్లవముకూడ ఇట్టి క్రౌర్య మునకు కారణమైనది.

ఉష్ణమండలములలో దొరుకు చక్కెర, సుగంధద్రవ్యములు, కాఫీ, పొగాకు మున్నగు వస్తువులు ప్రజల కెక్కువగా కావలసి వచ్చెను. దక్షిణ అమెరికాలోను, ఉత్తర అమెరికా దక్షిణ ప్రాంతములందును పై వస్తువులను పెంచిన మిక్కిలి లాభకరముగా నుండును. అందుకై బానిసలచేత కూలిపనిచేయించుట అవసరము. ఇట్లు చేయించుటవల్ల డబ్బుఖర్చు ఎక్కువ కాదు. మరి బానిసలను సంపాదించుట ఎట్లు? ఆఫ్రికా పశ్చిమతీరము పొడుగునను నీగ్రో జాతులు నివసింతురు. వారిని పట్టుకొని నావలనిండుగ ఎక్కించి అట్లాంటిక్ మహాసముద్రమునుదాటి అమెరికాకు తీసికొనివచ్చుట



వర్జీనియాలో బానిసలను ఏలము వేయుట

సులభము. ఈ నీగ్రోలను బానిసలుగా చేసికొనవచ్చును. సముద్ర జీవులగు జాతులకుచెందిన వర్తకులు — ముఖ్యముగా స్పెయిను

దేశస్థులు, బ్రిటిషువారు, పోర్చుగీసువారును—, వారికి అమెరికాలో అధినివేశములున్నవి కాబట్టి, 1600 సంవత్సరము మొదలు కొని బానిసలను తెచ్చి అమ్మే వ్యాపారమును సాగించిరి. 1790 సంవత్సరమునాటికి అమెరికాలో పనిచేయుచున్న నీగ్రోబానిసల సంఖ్య 700,000 అయ్యెను.

సాటిమానవులను పశువులవలె అమ్ముటయు కొనుటయు సిగ్గు పడవలసిన విషయముగా పలువురు భావించిరి. ఫ్రెంచి విప్లవ కాలమున, ఇంగ్లాండులో బానిసవ్యాపారము చేయుట చట్టవిరుద్ధమని శాసనములు పుట్టెను. దానిని నిర్మూలించుటకు పనిచేసిన వారిలో నాయకుడు విలియం విల్బర్‌ఫోర్సు అను ఒక ఇంగ్లీషువాడు.

1833 సంవత్సరమున బ్రిటిషు అధినివేశము లన్నిటిలోను బానిసత్వము రద్దుచేయబడెను. బానిసలందరిని వదలిపెట్టుటకై రెండుకోట్ల పౌనులు బానిస యజమానులకు చెల్లించబడెను. యూరోపులోను యితర దేశములందును ఇట్టిశాసనములు వెంటనే పుట్టెను.

కాని ఇట్టిశాసనములు అమెరికాలో పుట్టుట కష్టసాధ్యముగా నుండెను. నూలుబట్టలునేయుటకు యంత్రము లుపయోగించుటవల్ల ముడిప్రత్తి ఎక్కువగా కావలసివచ్చెను. అమెరికా దక్షిణరాష్ట్రములలో అమితముగా ప్రత్తి పండించుచుండిరి. అందు కూలిపని చేయువారు బానిసలు. ఆఫ్రికానుండి బానిసలను తీసికొనివచ్చుట చట్టవిరుద్ధ మైనప్పటికిని రహస్యముగా ఎందరినో ఇంకను తీసికొని వచ్చుచుండిరి.

1861 సంవత్సరమునాటికి అమెరికా సంయుక్తరాష్ట్రములలో 40 లక్షల మందికి తక్కువకాకుండ బానిస లుండిరి. బానిసలను

వదలిపెట్టుటవల్ల తాము అమితముగా కష్టనష్టముల పా లగుదుమని దక్షిణరాష్ట్రజనులు నమ్మియుండిరి.

బానిసత్వసమస్య విషయమై ఉత్తరరాష్ట్రవాసులకును దక్షిణ రాష్ట్రవాసులకును తీవ్రకలహములు పుట్టెను. పారిశ్రామికవిప్లవము అమెరికాకు వ్యాపించెను. ఇనుము, రాక్షసిబొగ్గు విశేషముగా దొరుకు ఉత్తరరాష్ట్రములలో ఫాక్టరీపట్టణములు త్వరత్వరగా లేచుచుండెను. దక్షిణరాష్ట్రములందన్ననో ఎన్నియో భూములు వ్యవసాయముచేయు భాగ్యవంతుల చేతులలో నుండెను. యథాలీతిని వారు బానిసకూలీలతో తమ భూములకు సంబంధించిన పనులను జరుపుకొనగోరిరి. తమకార్యములలో ఉత్తరరాష్ట్రజనులు కలుగజేసికొనకుండ ఉండుటకు ఒక్కటే మార్గమున్నదని వా రూహింపసాగిరి. అమెరికా సంయుక్త రాష్ట్రములనుండి తాము పూర్తిగా విడివడి వేరొక స్వతంత్రజాతిగా 'కాంఫిడెరసీ' (confederacy) అను పేర ఏర్పరచదలచిరి.

1860 సంవత్సరమున అమెరికా సంయుక్తరాష్ట్రముల కధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన అబ్రహామ్ లింకన్ బానిసత్వమును సహించువాడు కాడు. కాబట్టి దక్షిణరాష్ట్రములు విడిపోవుటకు నిశ్చయించెను.

[మూలప్రశ్న 45: ఉత్తర దక్షిణరాష్ట్రము లొకరితోనొకరు పోరాడుటకు కారణమేమి? తత్ఫలితమేమి?]

§45. అమెరికాలోని కెంటకీరాష్ట్రమున, దుంగలతో కట్టిన ఒక గుడిసెలో 1809 సంవత్సరమున అబ్రహామ్ లింకన్ జన్మించెను. తనకను వ్రాయుట చదువుట స్వయముగా నేర్చుకొనెను. కాలిక మా రాతడు పడవనిండ సరుకులు నింపుకొని మిసిసిప్పినది

మీద ప్రవృత్తికి గొప్ప కేంద్రమగు న్యూ ఆర్లియన్సులో అమ్ముటకు పోయెను. బానిసత్వమనగా నేమో అతడచ్చట చూచెను. చూచినదానినిబట్టి అతడు బానిసత్వమును రూపుమాపవలె నని



దుంగలతో కట్టిన గుడిసె

నిశ్చయించెను. వ్రాయను చదువను నేర్చిన కొద్దిమందిలో ఇతడొక్కడగుటవలన అక్కడి ఎన్నికలలోకూడ ఇతనికి పనిదొరికెను. దీనినిబట్టి రాజకీయ వ్యవహారములలో ప్రవేశింపవలె నని యాతడుద్దేశించెను. రాష్ట్రశాసనసభకు అభ్యర్థి (candidate)గా అతడు నిలుచుండెను. 27 సంవత్సరముల వయస్సప్పుడు శాసనసభకు అతడు సభ్యుడయ్యెను.

తరువాత నతడు స్ప్రింగు ఫీల్డులో లాయరువృత్తి నవలంబించెను. పది సంవత్సరముల తరువాత, కాంగ్రెసుకు (అమెరికా లోని కామన్సు సభ) తన రాష్ట్రప్రతినిధిగా ఎన్నుకోబడెను. బానిసత్వనిర్మూలనమునకుచేయు ఆందోళన కాతడు గట్టిసహాయము

చేసెను. 1860 సంవత్సరమున అమెరికా అధ్యక్షపదవికి, రిపబ్లికన్ పార్టీవారి అభ్యర్థిగా అతను నిలబడెను. అత డధ్యక్షుడుగా నెన్నుకోబడెను. మరి నాలుగుదినములకు అమెరికా అంతఃకలహము ప్రారంభమాయెను. దక్షిణరాష్ట్రవాసులు ఉత్తరరాష్ట్రవాసులతో పోరాడి తాము స్వతంత్రజాతిగా నుండవలెనని కోరిరి. దక్షిణరాష్ట్రవాసులనుండి బానిసలను విడిపించుటకు మాత్రమే అతడు అంతఃకలహములోనికి దిగలేదు. అమెరికా సంయుక్తరాష్ట్రములు చీలిపోరాదనియు, ఒక్క సంఘముగా నుండవలెననియు అతని యాశయము. దక్షిణరాష్ట్రవాసులు చీలిపోవుట అతని కిష్టము లేదు. ఇందులకై అమెరికనులు ఘోరయుద్ధములోనికి దిగిరి. 5 లక్షలమంది ఒకరినొకరు చంపుకొనిరి. నాలుగు సంవత్సరముల పాటు యుద్ధము జరిగెను. చివరకు ఉత్తరరాష్ట్రవాసులు జయము కాంచిరి.



అబ్రహాం లింకన్

దక్షిణరాష్ట్రములు బానిసలను వదలిపెట్టవలసివచ్చెను. నీగ్రోలకు - కాగితముమీద - అమెరికన్ పౌరసత్వము (citizenship) పూర్తిగా నీయబడెను. కాని అమెరికాలోని నీగ్రోజనుల సమస్యనిది పరిష్కరించలేదు. ఇంతవరకును అవి పరిష్కరింపబడలేదు. అమెరికాలో నేడు 120 లక్షలమంది పయిగా నీగ్రోలున్నారు. కొన్ని విషయములలో బానిస లగు వారి పూర్వికులకన్న వారే విధముగాను మెరుగుగా లేరు. వారి సంఖ్య పెరుగుచున్నది. వారిభావిని నిర్ణయించుట అమెరికావారికి పెద్దసమస్య.

## 23 పాఠము : క్రౌర్యము నరికట్టుట

[మూలప్రశ్న 46 : జాన్ హోవర్డు, ఎలిజబెత్ ఫ్రై, ఫ్లారెంసు నైటింగేల్ —వీరు ఏ దురాచారముల నిర్మూలించుటకు ప్రయత్నించిరి ?]

§46. అంతకంతకు ప్రజలు అధికముగా నాగరీకు లగుచున్నారనుటకొక నిదర్శనము వారిలో పురుషులును స్త్రీలును క్రౌర్యమును సహింపక దాని నరికట్టుటకు ప్రయత్నించుటయే.

150 సంవత్సరములకు పూర్వము కారాగారవాస మనుభవించు దురదృష్టవంతుల పాట్లు చెప్ప నలవికాదు.

ఇంగ్లాండు దేశములోని ఒక రాష్ట్రములో జాన్ హోవర్డు ఉన్నతోద్యోగి. శాసన విరుద్ధముగా నడచినవారి నతడు తరుచు చెరసాలకు పంపుచుండెను. ఒకనాడు తన పట్టణమగు బెడ్ ఫర్డులోని చెరసాలను చూచుట కతడు వెళ్లెను. అచ్చటి పరిస్థితులు దుర్భరముగానుండుట అతడు కనిపెట్టెను. ఖైదీలను సరియైన విధముగా చూచుటకు తగిన నిబంధనములు చేయించుట కతడు పూనుకొనెను. ఇంగ్లాండును, యితర దేశములలోను ఉన్న చెరసాలల నన్నిటిని చూచుట కతనికి 15 సంవత్సరములు పట్టినది. తాను

చూచిన విషయములన్నియు వర్ణించుచు నాతడొక పుస్తకమును వ్రాసెను. దీనికి ఫలితముగా ఇంగ్లాండులో ఖైదుచేయుటకు సంబంధించినట్టియు, ఖైదీలకు సంబంధించినట్టియు చట్టములు బాగుపడినవి.

ఇట్లే పాటుపడిన దయార్ద్రహృదయయగు వేరొకవ్యక్తి ఎలిజబెత్ ఫ్రై. చెరసాలలో స్త్రీలు పడుపాట్లు విని, ఆమె స్వయముగా ఆ చెరసాలను చూచుటకు వెళ్లెను. లండనులోని ఆడ ఖైదీల యవస్థను బాగుచేయుటకామె ప్రారంభించి క్రమక్రమముగా ఇంగ్లాండులోను ఇతర దేశములలోను ఉన్నవారికి సహాయముచేయుచు వచ్చెను. ఖైదీల కొరకు న్యాయమైన చట్టములను చేయుమని ఆ దేశములవారిని పురికొల్పినది. బిచ్చగాండ్రకును, తలదాచుకొనుట కిల్లులేని బీద వారికిని సహాయము చేయుటకై ఆమె పాటుపడినది.



ఎలిజబెత్ ఫ్రై

వైద్యాలయములలోని రోగులకు ఉపచారములుచేయు సందర్భములను చక్కజేయుటకు తన జీవితమును ధారపోసిన వేరొక స్త్రీ ఫ్లారెన్సు నైటింగేల్. బ్రిటను రష్యాలకు జరిగిన క్రిమియన్ యుద్ధమున క్షతగాత్రులగు సైనికుల కుపచారము చేయుట కామె వెళ్ళెను. అక్కడి ఆస్పత్రులు దుస్థితిలో నుండెను. పరిశుభ్రత లేదు. మందులు లేవు. ఇంగ్లాం

డున కామె తిరిగివచ్చిన పిమ్మట ఆస్పత్రులలో పనిచేయుటకై నర్సులకు శిక్షణ నిప్పించుటకై ఎక్కువగా పాటుపడెను.

[మూలప్రశ్న 47: షాఫ్ట్స్‌బరి ప్రభువును, డాక్టరు నాన్‌సెన్‌యును చేసిన ప్రత్యేక ఘనకార్యము లేమి?]

§47. ఇట్టి భూతదయాపరులలో ఉత్కృష్టుడు షాఫ్ట్స్‌బరి ప్రభువు. క్రొత్తగా స్థాపించిన ఫాక్టరీలలో పసిపిల్లలపట్ల చూపుచున్న క్రౌర్యము దుర్భరముగా నుండెను.

పిల్లలకొరకు పాటుబడుట కతడు నిశ్చయించుకొనెను. అతడు 25 వ యేట పార్లమెంటు సభ్యుడయ్యెను. 20 సంవత్సరములకు పైగా అతడు పార్లమెంటులో పాటుపడి రోజుకు 10 గంటలకన్న ఎక్కువకాలము పిల్లలచేత ఫాక్టరీలలో పని చేయించరాదని శాసనము చేయించెను. ఆ రోజులలో మగ్గములకును, యంత్రములకును పసిపిల్లలను గొలుసులతో కట్టివేసి, వారిచేత రోజుకు 15 గంటలకాలము సైతము పనిచేయించెడివారన్నచో నాటి పరిస్థితు లెంత దుర్భరముగా నుండెనో మన మూహించుకొనవచ్చును.

తరువాత, బొగ్గు గనులలో పనిచేయు పిల్లలు అనుభవించుచున్న కష్టములను తొలగించుటకు షాఫ్ట్స్‌బరి పనిచేసెను. గనులలో చీకటి మార్గములగుండ పిల్లలు ప్రాకుచు చిన్న బొగ్గుబండ్లను లాగుచుండిరి. మరియు చిన్న పిల్లలను పొడుగుగానుండు పొగ గొట్టములను (చిమ్నీలను) తుడుచుటకు పంపుచుండిరి.

గనులలోను, ఫాక్టరీలలోను పనిచేయు పిల్లల కష్టములను తొలగించుటయేగాక షాఫ్ట్స్‌బరీ తిండిగాని యిల్లుగాని లేని పిల్లల వ్యవస్థ బాగుపరచుటకు కూడ ప్రయత్నించెను. లండనులోను యితర పెద్ద నగరములలోను ఆ రోజులలో వేలకొద్ది పసిపిల్లలు

బిచ్చమెత్తుకొనుచు, దొంగతనములు చేయుచు ఉండెడివారు. ఇట్టి పిల్లల సంరక్షణకొఱకు షాఫ్ట్స్‌బరి 'పిల్లల యిండ్లను' (children's homes) స్థాపింపజేసెను.




షాఫ్ట్స్‌బరీ ప్రభువు - పిల్లల మిత్రుడు

నేటికాలమున ఇట్టి కార్యములు చేసినవాడు, నార్వే దేశ శాస్త్రజ్ఞుడగు డాక్టర్ నాన్‌సెన్. ఉత్తర ధ్రువప్రాంతములకు, పరిశోధనార్థమై నౌకాయాత్రలు సాగించి ఇతడు ప్రసిద్ధికెక్కెను. మొదటి ప్రపంచ సంగ్రామము ముగిసినపిమ్మట లక్షలకొద్ది జనులు యూరోపులో తినతిండిలేక రోగగ్రస్తులై మరణించుచుండిరి. అట్టి వారికి సహాయముచేయుటకై నాన్‌సెన్ ఆహారపదార్థములను, ధనమును ప్రోగుచేసెను. యూరోపులో 120లక్షల మంది దీనులకు ఒక మారాతడు ఆహారమును పెట్టించెను.

## అభ్యాసములు

1. మానవులు సాటి స్త్రీ పురుషులపట్ల క్రూరముగా ప్రవర్తించుటకు కారణములను పేర్కొనుము. (ఈ యధ్యాయములో పేర్కొన్న కారణములే గాక ఆలోచించి మరికొన్ని కారణములనుకూడ పేర్కొనుము).

2. అమెరికాలో బానిసత్వమంత త్వరలో వృద్ధిజెందుటకు కారణమేమి? అది ఎట్లు అంతరించినది? దానినుండి వచ్చిన ఫలితము లేమి?

3. ఇతర యుద్ధములకంటె అంతఃకలహము కొన్ని విధములుగా జూచిన మిక్కిలి దారుణమైన దనుటకు కారణము లేమి?

4. ఇదివరలోకన్న ఇప్పుడు స్త్రీ పురుషులు ఎక్కువ నాగరీకులనుటకు ఎట్టి లక్షణములు కనిపించుచున్నవి?

5. అంకుల్ టామ్సు కాబిన్ అను పుస్తకములో అమెరికా దక్షిణ రాష్ట్ర మందలి నీగ్రో బానిసల జీవితము వర్ణింపబడినది. దానిని చదువుము.

# 12. ప్రజా ప్రభుత్వాభివృద్ధి (Democracy)

## 24 పాఠము : పార్లమెంటు వృద్ధిచెందినవిధము

[మూలప్రశ్న 48: అఖండైకాధిపత్యము (absolute monarchy) నియమబద్ధైకాధిపత్యము (limited monarchy) నియంతృత్వము (dictatorship) స్వల్పజనాధిపత్యము (oligarchy) నియమబద్ధ ప్రభుత్వము (constitutional government) - అననేమి?]

§48. నిరంకుశముగా పాలించిన రాజులను ప్రజ లెట్లు తొలగించిరో వెనుకటి పాఠములలో నేర్చుకొంటిమి. ఒక ప్రభుత్వమును తొలగించినపిమ్మట వేరొక ప్రభుత్వమును నెలకొల్పవలయును. దేశమునకు మంచి ప్రభుత్వముండుట ప్రధానము. ఇందుకై వివిధ దేశ ప్రజలు ఎట్టిప్రయత్నములు చేసిరో తెలిసికొందము.

ఈ సందర్భమున నాలుగుమాటలను మనము తెలిసికొనవలెను. అవేవన—ఏకాధిపత్యము — అనగా రాజుచేయు పరిపాలనము. స్వల్పజనాధిపత్యము—కొందరు జనులుచేరి చేయు పరిపాలనము. ధనికాధిపత్యము అనగా భాగ్యవంతులుచేరి చేయు పరిపాలనము. ప్రజాస్వామికము అనగా ప్రజలు తమ ప్రతినిధులద్వారా చేయు పరిపాలనము.

ఏకాధిపత్యమున పరిపాలకు డొక్కడే; అతడు రాజు. కాని ఒక రాజు అనేకవిధములుగా పరిపాలన చేయవచ్చును. అన్ని అధికారములు తన చేతిలో పెట్టుకొని, మంత్రుల ద్వారానో, ఉద్యోగులద్వారానో రాజు తన యాజ్ఞలను జారీచేయుచు పరిపాలించవచ్చును. ఇట్టి పరిపాలనను అఖండైకాధిపత్య మందురు. ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులుగలట్టియు శాసనములు చేయునట్టియు పార్లమెంటు సహాయముతోను, పార్లమెంటు సభ్యులలోనుండి ఎన్నుకొనబడిన మంత్రుల సహాయముతోను పరిపాలన సాగించిన దానిని నియమబద్ధైకాధిపత్య మందురు. దేశశాసనముల ననుసరించి సక్రమపద్ధతిని మంత్రుల సంఘముచే—రాజుచే కాదు— పరిపాలన జరిగిన దానిని నియమబద్ధ ప్రభుత్వ మందురు.

రాజనామము వహింపక నిరంకుశముగా పరిపాలించువాని ప్రభుత్వమును నియంతృత్వ మందురు. అట్టి పాలకుని నియంత (dictator) యందురు. ఫ్రెంచివారిచే చక్రవర్తి బిరుదమును పొందకముందు నెపోలియన్ యథార్థముగా నియంతయే. ముస్సోలినీ హిట్లరులు నియంతలు. వారి దేశములలో పార్లమెంట్లు ఉన్నమాట వాస్తవమే కాని వాటి యిష్టప్రకారము నియంతలు పరిపాలన సాగించలేదు. వారు చేసిన పనిని పార్లమెంటులు ఆమో

దించునట్లు చేయుచుండిరి. భిన్నాభిప్రాయములు గలవారిని సభ్యులుగ నుండనియ్యలేదు.

ఇది గమనించదగిన విషయము. పార్లమెంటుకు సభ్యులను స్వేచ్ఛగా ఎన్నుకొనుటకు వీలుండవలెను. పాలకుని యభిప్రాయముతో సభ్యులెల్ల వేళల ఏకీభవించవలసిన పనిలేదు. ఇట్లున్నప్పుడే పార్లమెంటు ప్రయోజనకారిగా నుండును. సభ్యులందరును పాలకుని పార్టీకి చెందినవారై యుండి, వారిలో కొందరిని తనకు సహాయము చేయుటకై పాలకుడు నియమించినచో నట్టిపాలనము స్వల్ప జనాధిప్రభుత్వ మనిపించుకొనును. ఏలయన పలుకుబడిగల కొందరు మాత్రమే పరిపాలన కార్యములు జరిగింతురు. మిగిలినవారు ఇష్టమున్నను లేకున్నను వారి యాజ్ఞలకు తలయొగ్గవలసినవారే. పార్లమెంటు లేకుండకూడ స్వల్పజనాధిపత్య ముండవచ్చును.

పార్లమెంటుకు సభ్యులను ఎట్లు ఎన్నుకొందురు, ఎవరు ఎన్నుకొందురు, ఎవరు అభ్యర్థులుగా నుండదగుదురు అను విషయములు మనము తెలిసికొనుటకై ఇంగ్లీషు పార్లమెంటు చరిత్రను తెలిసికొందము. ప్రపంచమందున్న పార్లమెంటులన్నిటికన్న నది ప్రాచీనమైనది. నియమబద్ధ ప్రభుత్వముల స్థాపించునప్పుడు ఇతరజాతులు దీనిని మాదిరిగా పెట్టుకొనుచుండిరి.

[మూలప్రశ్న 49 : ఇంగ్లాండులో పార్లమెంటు ఎట్లు ప్రారంభమయ్యెను ?
కామన్సుసభ రాజు నెట్లు తనవశములో నుంచుకొనెను ?]

§49 ఇంగ్లీషు పార్లమెంటు ఈ విధముగా ప్రారంభమాయెను. పదమూడవ శతాబ్దిలో ఇంగ్లాండుకు రాజుగానున్న జాన్, తన పలుకుబడిని వృద్ధిచేసికొనుటకు ప్రయత్నించుటవలన ఆ కాలపు సామంతులు అతనిపై తిరుగబడిరి. వారందరు ఏకమై జాన్‌రాజుచేత

ఒక అంగీకారపత్రము (agreement) పై చేవ్రాలు పెట్టించిరి. పత్రములోని ముఖ్యవిషయములు రెండు. ఏవనగా—చట్ట విరుద్ధముగా తన యిష్టమువచ్చినట్లు ఎవ్వని ఆస్తిని రాజు కలుపుకొనకూడదు. న్యాయవిచారణ చేయకుండ ఎవ్వరిని చెరసాలలో పెట్టరాదు. ఈ పత్రమునకు మాగ్నకార్టా అని పేరు. మాగ్నకార్టా అనగా మహా స్వాతంత్ర్యశాసనము. జాన్ రాజుచే 1215 సంవత్సరమున ఈ పత్రముపై చేవ్రాలు పెట్టించబడెను. ఇది మిక్కిలి ప్రధానమైన పత్రము. దీనినిబట్టి రెండుభావము లుదయించెను. ఇవి నేటి నియమబద్ధ ప్రభుత్వమునకు ప్రాప్తినవి. అవేవన (1) రాజు తన యిష్టానుసారముగాక శాసనబద్ధుడై పరిపాలన చేయవలెను. (2) ప్రజా ప్రతినిధులే శాసనములు చేయవలెను. జాన్ తరువాత వచ్చిన రాజు కాలములో ప్రజాప్రతినిధులుగల పార్లమెంటు సమావేశ పరుపబడెను. రాజు స్వయముగా ఖర్చుపెట్టుటకు ఎంతధన మతని కీయవలెనో నిర్ణయించు నిమిత్తము ఈ సమావేశ మేర్పాటు చేయబడినది. పార్లమెంటులోని సభ్యులు పలువురు కులీనులు లేదా ప్రభువులు. వారేగాక రాష్ట్రమున కిద్దరు చొప్పునను, నగరమున కిద్దరు చొప్పునను, ప్రజాప్రతినిధులుకూడ అందుండిరి. ప్రజలును ప్రభువులును ఎవరెవరిలాభ క్షేమములకొరకు వారు వారు పాటుపడవలసి యున్నది. కాబట్టి వారు వేరు వేరుగా సమావేశము కాజొచ్చిరి. ఈ విధముగా కామన్సుసభ (House of Commons) యనియు లార్డ్సు సభ (House of Lords) యనియు రెండు సభలు ప్రారంభమయ్యెను. కామన్సు సభలో ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధు లుందురు. లార్డ్సు సభలో కులీనులై పుట్టిన ప్రభువులును, రాజుచే ప్రభువులుగా చేయబడ్డవారును ఉందురు. కొందరు

బిషప్పుల (bishops) ను కూడ ప్రభుసభలో చేర్చుకొందురు.

రాజునకు ధనము కావలసివచ్చినప్పుడు అతడు కామన్సుసభకు సందేశ మంపును. తాను ప్రజలపై ఫలానా పన్నులు విధించదలచి నట్లును కామన్సు సభవా రందుల కంగీకరించవలసినదనియు సందేశము. దీనినిబట్టి గ్రహించవలసిన విషయ మేమనగా—రాజుకు కావలసిన ధనము నిచ్చు అధికారము కామన్సుసభ కున్నది. కామన్సు సభ కిష్టములేని పని రాజు చేసినయెడల అట్టిపని యిక ముందు చేయనని రాజు ఒప్పుకొనునట్లు కట్టడి చేయుచుండిరి. అత డొప్పుకున్న పిమ్మటనే కావలసినధన మతని కిచ్చుచుండిరి. ఇందు వల్ల రాజు తన యిష్టానుసారము యేపని చేయుటకును సాధ్యము కాకుండెను. తమకు దైవదత్తాధికారము కల దనుకొను రాజులు మాత్రము పై పద్ధతి కిష్టపడకుండిరి. మొదటి చార్లెసు రాజుగా వచ్చు పర్యంతము ప్రజలకును రాజునకును మధ్యనుండు అభిప్రాయ భేదము తీవ్రరూపము ధరించ లేదు.

## 25 పాఠము : పార్లమెంటు రాజును తనవశములో పెట్టుకొన్న విధము.

[మూలప్రశ్న 50 : మొదటి చార్లెసు పార్లమెంటును ధిక్కరించినప్పు డేమి జరిగెను ?]

§50. మొదటి చార్లెసు నిరంకుశముగ నుండగోరెను. పన్నుల వసూలు చేయుటకు పార్లమెంటు అనుమతి నాతడు కోరుటకు తిరస్కరించెను. పన్నులు వసూలుచేయుట తన హక్కు అని వసూలుచేయ ప్రయత్నముచేసెను. కామన్సు సభ అట్లుచేయ కూడ దన్నప్పుడు అతడు ప్రధాన సభ్యులను నిర్బంధించుటకై తన సైనికులను పంపెను. తరువాత పార్లమెంటువారి నాతడు పొమ్మ

నెను. వారు సమావేశములు జరుపగూడదని నిషేధించెను. పార్ల మెంటు లేకుండ తానొక్కడే దేశమును పాలించ సమకట్టెను.

కాని పార్లమెంటు దుర్బలముగా లేదు. ఇట్టి అవమానమును వారు సహించి ఊరకొనలేదు. అది కూడ సైన్యమును సమకూర్చెను. వెంటనే అంతఃకలహము ప్రారంభమయ్యెను. (1642-8) రాజు పక్షమున కులీనులు పెక్కురు చేరిరి. పార్లమెంటు పక్షమున పట్టణవాసు లందరును చేరిరి. నాలుగు సంవత్సరములపాటు యుద్ధము జరిగెను. చివరకు రాజు పరాజితుడయి చెరబెట్టబడెను. అతనిని న్యాయాధికారుల సమక్షమునకు తీసికొనివచ్చిరి— దేశద్రోహి కెట్టి దండనమో అట్టి దండనమే అతనికిని విధించుటకు పార్లమెంటు ఉత్తరువు చేసెను—అది మరణదండనము. 1649 సంవత్సమున, బహిరంగముగా నతని శిరస్సు ఖండింపబడెను. నిరంకుశ రాజాధిపత్యమున కిది పెద్దదెబ్బ.



మొదటి చార్లెసు

తరువాత పదకొండు సంవత్సరములపాటు ఇంగ్లాండులో ప్రజాప్రభుత్వపాలనము (republic) సాగెను. అధ్యక్షుడు (అతనినే లార్డ్ ప్రొటెక్టరు—Lord Protector అనెడువారు) ఆలివర్ క్రాంవెల్

ఇతడే ప్రజాసభకు నాయకుడై రాజు నోడించి విజయము సాధించెను. ప్రజాప్రభుత్వము ఇంగ్లాండులో జయప్రదము కాలేదు.



ఆలివర్ క్రాంవెల్

క్రాంవెల్ మంచివాడును, సమర్థుడును కాన అతని కాలములో తిరుగుబాట్లు సంభవించ లేదు. కాని అతని అనుచరులు నిరంకుశులు. మత విషయమున ప్రజలందరును ప్రాటెస్టెంటు అభిప్రాయములనే అంగీకరించవలసిన దని బలవంతముచేసిరి. 1658 సంవత్సరమున ఆలివర్ మరణించెను. అతని తరువాత అతని కొడుకు ప్రొటెక్టరయ్యెను. అతడు దుర్బలుడు. కాబట్టి రాజును మరల సింహాసనముపై కూర్చుండబెట్టవలెనని సంవత్సరకాలములో ఆందోళన బయలుదేరెను.

[మూలప్రశ్న 51: రెండవ చార్లెసు సింహాసనము నెట్లు నిలబెట్టుకొనెను? రెండవ జేమ్సు దాని నెట్లు పోగొట్టుకొనెను?]

§51. 1660 సంవత్సరమున లూయీ XIV రక్షణలోనున్న మొదటి చార్లెసుకుమారుని ఇంగ్లాండుకు ఆహ్వానించి రెండవ చార్లెసను పేర అతనికి పట్టము గట్టిరి. తనతండ్రివలె గాక అతడు పార్లమెంటున కనుకూలముగ ప్రవర్తించెను. 25 సంవత్సరములాతడు దేశమును పరిపాలించెను. అతడు మరణించినపిమ్మట అతని తమ్ముడు, రెండవ జేమ్సు రాజయ్యెను. ఇతడు తనసోదరునివలెగాక, తండ్రియగు మొదటి చార్లెసువలెనే తనయిష్టానుసారము చేయ మొదలుపెట్టెను.

ప్రజల కతని పరిపాలన సంతుష్టిగా లేదు. రెండవ జేమ్సు కుమార్తె నొక డచ్చిరాజపుత్రున కిచ్చి వివాహముచేసిరి.

అతనిపేరు విలియం ఆఫ్ ఆరెంజి. అత డాసమయమున లూయీచక్రవర్తి నెదిరించి హాలండులో యుద్ధము చేయుచుండెను. ఇంగ్లాండు సింహాసనము నధిష్ఠించమని అతనిని పార్లమెంటువారు ఆహ్వానించిరి. ఈసారు అంతఃకలహము జరుగలేదు. రెండవ జేమ్సు ఫ్రాంసుకు పారిపోయెను. లూయీ అతనికి శరణిచ్చెను. రక్తపాతములేని విప్లవ మది. తాను రా జగుటకు కారణము పార్లమెంటు కాబట్టి, విలియం పార్లమెంటు చేసిన చట్టముల ననుసరించి పరిపాలించెను. నాటినుండీ ఎన్నడును ఇంగ్లాండుకు నిరంకుశప్రభువు రాలేదు. పార్లమెంటరీప్రభుత్వపాలన క్రిందనుండు నియమబద్ధైకాధిపత్య మిదియే.

## 26 పాఠము: మధ్య తరగతి (middle class): రిఫారం బిల్లులు; గ్లాడ్‌స్టన్

[మూలప్రశ్న 52: జాతిలోనున్న అన్నివర్గముల ప్రతినిధులు పార్లమెంటులో నుండుట ఎట్లు తటస్థించెను?]

§52. పార్లమెంటులో నున్న సభ్యు లెవరు? ఎవ్వరైనను సభ్యు డగుటకు వీలున్నదా? వీలులేదనియే దీనికి సమాధానము. భాగ్యవంతులును, ఉన్నతస్థితిలో నున్నవారును మాత్రమే సభ్యులు కావచ్చు నను నిబంధనలేదు. కాని బీదవాడు పార్లమెంటు సభ్యు డగుటకుమాత్రము సాధ్యముకాదు. అది ధనముతో కూడుకొన్న పని. ఆకాలమున పార్లమెంటుసభ్యులకు జీతము లిచ్చెడువారు కారు. ఇతరపను లేమియు చేసికొనకుండ లండనులో నివసించుటకు చాలి

నంత డబ్బుగలవారే సభ్యు లగుటకు వీలున్నది. ఈవిధముగం పార్లమెంటు పరిపాలన ధనికుల పరిపాలనగా పరిణమించినది. అదే ధనికాధిపత్యము.

పారిశ్రామిక విప్లవానంతరము ఇంగ్లాండు భాగ్యవంతమగు దేశమయ్యెను. వెనుకటికన్న ప్రజలు పెక్కురు సుమారు ధనవంతు లైరి. చిన్న ఫాక్టరీలు, వర్తకవ్యాపారములు, అనేకవిధములగు షాపులు ప్రారంభింపబడినవి. వాటిని నడుపు యజమానులు బీద వారునుకారు, మిక్కిలి భాగ్యవంతులును కారు. వారు మధ్యతరగతి ప్రజలు. వీరు చదువుకొన్నవారు.

ధనికాధిపత్యము సంతృప్తికరముగా లేదని చదువుకొన్నవారు భావింపదొడగిరి. పార్లమెంటులో తమ ప్రతినిధు లుండుటకు వీలు లేకుండెను. కాన పార్లమెంటును సంస్కరించవలసినదని యొక ఆందోళన బయలుదేరెను. ఆకాలమున భాగ్యవంతుల ప్రతినిధులే పార్లమెంటులో నుండెడివారు. ఎందువల్ల ననగా గ్రామములలో నివసించు భాగ్యవంతులును, పట్టణములలో నివసించు ప్రముఖులును మాత్రమే ఎన్నికలలో పాల్గొని ఓటు నిచ్చెడివారు. అనేక క్రొత్త పట్టణములకు ప్రాతినిధ్యమే లేదు. మధ్యతరగతివారికికూడ ఓటు నిచ్చు అధికార ముండవలెనని ఇప్పుడు ప్రతిపాదింపబడెను. ఇందులకై పెద్దపోరాటము జరిగినది. అంతఃకలహమువరకుకూడ వచ్చినది. తరువాత 1832 సంవత్సరమున ప్రథమ రిఫారం బిల్లు ఆమోదించబడెను. ఈ సంస్కరణానంతరము ఎన్నుకోబడిన పార్లమెంటు, బానిసత్వమును రద్దుచేసెను. పసిపిల్లలచేత ఫ్యాక్టరీలలో కూలిపనులు చేయించరాదని శాసనములు చేసెను.

కాని ప్రభుత్వ మింకను నిజముగా ప్రజాస్వామికము కాలేదు.

ప్రభుత్వములో కార్మికుల ప్రతినిధులు లేరు. చేతులతో పనిచేసి జీవనము గడపుకొనువారును, ఫ్యాక్టరీలలోను, షాపులలోను పని చేయువారును ఓడలకు బరువు లెక్కించి దింపువారును వ్యవసాయ కార్యములు చేయువారును మున్నగు వారు కార్మికులు. వీరి ప్రతినిధులు కూడ పార్లమెంటులో ఉన్నప్పుడే అది ప్రజాప్రభుత్వ మనిపించుకొనును. 1867 సంవత్సరమున వీరిలో కొందరికి ఓటు నిచ్చిరి. అప్పుడే ద్వితీయ రిఫారం బిల్లు ఆమోదించబడెను. జాతికంతకును అన్నితరగాల వారికిని



కామన్సుసభ లోపలిభాగము

ప్రతినిధులు పార్లమెంటులో నుండుటవల్ల క్రొత్తచట్టములు పుట్టినవి. అనేకవిధములుగా ప్రజల పరిస్థితులు చక్కబడినవి. లిబరల్ (liberal) పక్షమునకు చెందిన ప్రధానమంత్రి గ్లాడ్‌స్టన్ మొట్టమొదటి విద్యాశాసనము (education bill) ను ప్రవేశ

పెట్టెను. ఉచితజాతీయ ప్రాథమిక పాఠశాలలు (free national primary schools) స్థాపింపబడినవి. ఐర్లాండుకు స్వరాజ్య మిచ్చుటకు ప్రయత్నించిన ప్రధాని గ్లాడ్ స్టన్. ఈకాలమునందే అధినివేశ రాజ్యములకు స్వతంత్ర మిచ్చినదికూడ. ఇప్పుడే కెనడా, 1867 సంవత్సరంలో సంయుక్త అధినివేశరాజ్యమయ్యెను (federal dominion).

1911 సంవత్సరమునుండి పార్లమెంటుసభ్యులకు జీతము లిచ్చుచుండిరి. 1918 సంవత్సరమువరకు స్త్రీలకు ఓటులేదు. 1928 సంవత్సరమున 21 సంవత్సరముల వయస్సు పైబడినవారి కందరికి ఓటిచ్చు అధికారము వచ్చినది.

[మూలప్రశ్న 53 : పార్లమెంటు ప్రభుత్వములోనుండు మంచి చెడ్డ లేమి ?]

§53. పార్లమెంటరీ ప్రభుత్వమువలన లాభములు పెక్కులున్నవి. ఒకటి, రాజుగాని నాయకుడుగాని నిరంకుశముగా ప్రవర్తింపరాదు. పార్లమెంటు అనుమతించినగాని ప్రజలపై పన్నులు విధించరాదు. రాజుగాని అతని ప్రభుత్వముగాని ఖర్చుపెట్టదలచిన ధనమును ప్రతి సంవత్సరమును పార్లమెంటువారు గ్రాంటుచేయవలసియుండును. మంత్రులుగాని, బాధ్యతగల యితరులుగాని, యేశాఖ ఉద్యోగులైనగాని, యేమైన తప్పుచేసిన అది తప్పకుండ ప్రకటింపబడును. పార్లమెంటులో దానిని గురించి చర్చ జరుగును. కాలక్రమమున తప్పు సవరించబడును.

ఇట్టి సందర్భములలోనే పార్లమెంటరీ ప్రభుత్వమువల్ల కొన్ని యిబ్బందులు కలుగుచున్నవి. అందు కార్యములు బహుమెల్లగా జరుగును. చురుకుగా పనులు జరిగించుకొనుటకు పార్లమెంటరీ పద్ధతి అనుకూలముగా లేదు. క్రొత్త శాసనములు చేయుటకు

పార్లమెంటున కెంతో కాలము పట్టును. సభ్యులలో పలువు రుపన్యాసములీయ నిష్టపడుదురు. ఇంకను ఆలస్యకారణము లనేకము. కాటకము, శత్రువుల దండయాత్ర మున్నగు ప్రమాదకరములగు పరిస్థితులు తటస్థించినప్పుడు వెంటనే నివారణోపాయము లాలోచించకున్న జాతికి నష్టమువచ్చును. ఇట్టి సందర్భములలో ఆలస్యము పనికిరాదు. ప్రభుత్వ కార్యములు చురుకుగా పరిష్కరించుటకు మార్గములు వివిధ దేశములలో కనిపెట్టుటకు నేడు ప్రయత్నించుచున్నారు.

ఒక జాతిలోనుండు ప్రతి పౌరునకు హక్కులును బాధ్యతలును కూడ ఉండును. ప్రజల హక్కులను కాపాడుటకును, నిరంకుశ ప్రభువులును నియంతలును వానిని తీసివేయకుండ చూచుటకును పార్లమెంటు ప్రభుత్వ మెంతో సహాయము చేసినది. ప్రజాస్వామిక మనగా 'ప్రజలకొరకు, ప్రజలచే నిర్వహింపబడు, ప్రజయొక్క ప్రభుత్వము'. సర్వజనుల శ్రేయస్సుకొరకు న్యాయముగా ప్రజలచే నిర్వహింపబడు ప్రజలయొక్క ప్రభుత్వముగా దీనిని ఎట్లు చేయ వచ్చునో మనము తెలిసికొనవలెను.

## అభ్యాసములు

1. ఇంగ్లీషు పార్లమెంటు పొందిన వివిధ పరిణామదశలను పేర్కొనుము. ఎప్పుడు ఎట్టి మార్పుల నది పొందినదో తెలుపుము.

2. మొదటి చార్లెసు రాజు నురిదీయుటకు కారణమేమి ?

3. ఇంగ్లాండు ప్రజాప్రభుత్వపాలన క్రింద ఏల యుండలేదు ?

4. పార్లమెంటరీ ప్రభుత్వము కాక ఇంకను యితర విధములగు ప్రభుత్వము లేమి ? వాని మంచి చెడ్డలను పేర్కొనుము.

# 13. విజ్ఞానశాస్త్రము కనిపెట్టిన క్రొత్త విషయములు

## 27 పాఠము: రక్తప్రసరణము (circulation of blood): గురుత్వాకర్షణ సిద్ధాంతములు (laws of gravitation): పరిణామసిద్ధాంతము (theory of evolution)

[మూలప్రశ్న 54: ప్రకృతి సిద్ధాంతము (laws of nature)ల ననేమి?]

**§ 54.** ఏల, ఎట్లు అను ప్రశ్నలకు సమాధానము చెప్పు విద్యలన్నింటికిని విజ్ఞానశాస్త్ర మందురు. ఇప్పుడు ప్రతిదేశమందును వేలకొద్ది బుద్ధిమంతులు ఏల, ఎట్లు అను ప్రశ్నలకు సమాధానములు కనుగొన ప్రయత్నించుచున్నారు. ప్రతివారము ఏదో ఒకవిషయము కనిపెట్టుచున్నారు. ఈమధ్య వైద్యశాస్త్రజ్ఞులు న్యూమోనియా (pneumonia) మున్నగు జబ్బులకు కొన్నిమందులు కనిపెట్టిరి. ప్రథమమున నెవరైన క్రొత్తవిషయములను కనిపెట్టినచో వారు నిజముగా ప్రకృతిసిద్ధాంతముల కనిపెట్టినవా రగుచున్నారు.

కనిపెట్టబడినవిషయములలో ముఖ్యమైన దొకటి రక్తప్రసరణము అనగా హృదయకోశముయొక్క సంకోచ వికోచములవలన రక్తము ధమనుల (arteries) ద్వారాను, సిరల (veins) ద్వారాను దేహమందంతట ప్రసరించును. ఈవిషయమును చీనాదేశస్థులు రెండు వేలసంవత్సరములకు పూర్వమందే కనిపెట్టియుండిరి కాని ఈసంగతి పాశ్చాత్యదేశస్థులకు తెలియదు. 1628 సంవత్సరమున డాక్టరు విలియం హార్వే ఈ విషయమును మరల కనిపెట్టెను.

కనిపెట్టబడిన వేరొక ముఖ్యవిషయము గురుత్వాకర్షణ

సిద్ధాంతములకు సంబంధించినది. (వస్తువులు భూమిపై పడుటకు కారణమేమి?) ఈ సిద్ధాంతములు గొప్ప ఇంగ్లీషు గణితశాస్త్రజ్ఞుడగు సర్ ఐజక్ న్యూటన్ 1700 సంవత్సర ప్రాంతమున కనిపెట్టెను.

[మూలప్రశ్న 55: చార్లెసు డార్విన్ ఏమి కనిపెట్టెను?]

జ55. 1859 సంవత్సర ప్రాంతమున చార్లెసు డార్విన్ 'ది ఆరిజిన్ ఆఫ్ స్పీషీస్' (ఉపజాతుల ఉత్పత్తి) అను గ్రంథమును ప్రకటించెను. అందు పరిణామసిద్ధాంతము చర్చింపబడినది.

పాఠశాలకు పోవుటయన్న చార్లెసు డార్వినుకు ఇష్టములేదు. కాని రకరకముల రాళ్లను, పువ్వులను, కీటకములను ప్రోగు చేయుట చార్లెసు కిష్టము. ఇన్ని రకములుగా చెట్లును జంతువులును ఉండుట ఏల, అవి ఎట్లు భిన్నమైనవి, అవి యన్నియు నేల ఒక విధముగా లేవు? — అను విషయము లాతడు తెలిసికొనగోరెను.



చార్లెస్ డార్విన్

వృక్ష జంతుశాస్త్రముల జదువ నాతడు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునకు వెళ్లెను. 1831 సంవత్సరమున అతడు కోరుకొనుచున్న సదవకాశమతనికి లభించెను. అట్లాంటిక్ పసిఫిక్ మహాసముద్రముల తీరములగూర్చియు, అందలి ద్వీపములలోని నౌకాశ్రయముల

గూర్చియు బ్రిటిషు దొరతనము యథార్థవిషయముల తెలిసికొన గోరెను. బీగిల్ అను పేరుగల ఓడపై యావద్విషయములు తెలిసికొనుటకై శాస్త్రజ్ఞులు బయలుదేరిరి. జంతుశాస్త్రజ్ఞుడు (zoologist) గా డార్విన్ ఈ యోడపై వెళ్లెను. 5 సంవత్సరములపాటు డార్విన్ ప్రతి ద్వీపమును పరీక్షించెను. అనేక రకముల మొక్కలను జంతువులను అతడు ప్రోగుచేయగల్గెను. మొక్కలలోను జంతువులలోను భేదములు పుట్టుటకు కారణమేమో తెలిసికొన గోరిన యతనికి కావలసిన సామగ్రి చిక్కెను.

ఇంటికి వచ్చినపిమ్మట డార్విన్ పరిణామవాద సిద్ధాంతమును గురించి పనిచేయ మొదలిడెను. పరిణామవాద సంగ్రహమిది-ఎంతో కాలమునకు ముందు-బహుశా లక్షల సంవత్సరములకు పూర్వము-మొక్కల రకములును జంతువుల రకములును కొద్ది సంఖ్యగానే యుండి యుండును. ప్రపంచమందలి వేర్వేరు భాగములలో వేర్వేరు శీతోష్ణ స్థితులును, పరిసరములును ఉండుటచే ఎట్టి మొక్కలకును జంతువులకును ఆయా శీతోష్ణస్థితియు పరిసరములును అనుకూలముగా నుండునో అవియే వృద్ధినందును. మిగిలిన రకములు నశించును. ఒక్క ఉదాహరణము : బీటిల్ అను కీటకము సాధారణముగా ఎగురగలదు. కాని మడీరా ద్వీపములో ఎగురలేని బీటిల్ కీటకము లనేకరకములున్నవి? ఇందుకు కారణమేమి? మడీరా ద్వీపములో ప్రబలమగు పశ్చిమ మారుతములు వీచుచుండును. అందుచే ఎగురజాలిన బీటిల్ కీటకము లన్నియు సముద్రములోనికి కొట్టుకొనిపోయినవి. అందవి నశించినవి. ఎగురలేనివి వృద్ధి పొందినవి. ఇదియే డార్విన్ నిసర్గవరణ (natural selection) సిద్ధాంతము. అనగా కొన్ని రకముల మొక్కలను కొన్ని రకముల-

జంతువులను వరణము చేసికొన్న స్థలములలో వానివృద్ధికి ప్రకృతి తోడ్పడును. ఇట్టితోడ్పాటులేని ఇతర జంతువులును మొక్కలును నశించును.

దీనినుండి డార్విన్ వేరొక సిద్ధాంతముచేసెను. 'ది డిసెంట్ ఆఫ్ మాన్' (మానవుని అవతరణ) అను అతడు రచించిన గ్రంథములో మానవుడుకూడ నిసర్గవరణమువల్లనే వృద్ధిచెందినాడని అతడు నిరూపించెను.

## 28 పాఠము: టీకాలు (vaccination); క్లోరోఫారమ్ (chloroform); క్రిమిహారులు (antiseptics)

[మూలప్రశ్న 66: టీకాలువేయుట ఎట్లు కనిపెట్టబడినది?
.. X—కిరణముల నెవరు కనిపెట్టిరి?]

§56. ఎడ్వర్డ్ జెన్నర్ అను ఆంగ్లవైద్యుడు 1800 సంవత్సరమునకు కొంతముందు ఒక ముఖ్యవిషయమును కనిపెట్టెను.

స్ఫోటకము వచ్చిన ఆవుపొందునుండి రసితీసి అత డొకబాలుని రక్తములోని కెక్కించెను. ఆ బాలునకు ఆవులకు వచ్చు స్ఫోటకము వచ్చి త్వరలో నయమాయెను. తరువాత జెన్నరు స్ఫోటకము వచ్చిన మనుష్యుని కుండనుండి రసితీసి వెనుకటి బాలుని రక్తములోని కెక్కించెను. ఆ బాలునకు స్ఫోటకము రాలేదు. ఈ విధముగా టీకాలు వేయుట కనిపెట్టబడినది. నేడు



ఎడ్వర్డ్ జెన్నర్

ప్రపంచమందంతట టీకాలు వేయుపద్ధతి అమలులో నున్నది. బ్రిటిషుదీవులలోను, పెక్కు ఇతర దేశములలోను స్ఫోటక మంత రించినది.

ఆవులకు వచ్చు స్ఫోటకము వచ్చినవారికి స్ఫోటక మేలరాదో జెన్నరుకు తెలియదు. సుమారు 50 సంవత్సరములతరువాత ఈ విషయము కనిపెట్టబడినది. ఒక జర్మన్ వృక్షశాస్త్రజ్ఞుడు (botanist) ఫెర్డినాండుకోహన్ (Cohan) అనువాడు సూక్ష్మదర్శిని (microscope) సహాయముతో గాలిలోను నీటిలోను సూక్ష్మజీవు లుండుట కనుగొనెను. కొన్ని రోగములు కలుగుటకు సూక్ష్మజీవులే (bacteria) కారణమన్నమాట కోహన్‌కు తెలియదు. ఫ్రెంచి వాడైన లూయీపాస్టరు ఈ విషయమును కనుగొనెను.

సన్నిపాతజ్వరము (typhoid) కలరా, న్యుమోనియా మున్నగు వ్యాధులనుండి బాధపడు రోగులరక్తమును సూక్ష్మదర్శినిగుండా పరీక్షించునప్పుడు, ఆరోగ్యవంతుల రక్తమందు కనిపించని కొన్ని పదార్థముల నాతడు రోగులరక్తమందు చూచెను. ఈ పదార్థములే రోగక్రిములనియు, (germs) రోగబీజములనియు నాతడు కనిపెట్టెను. వ్యాధులుమారిన ఈ పదార్థములుకూడ మారుచుండెను. ఈ రోగక్రిములు రక్తములోని కెట్లు ప్రవేశించుచున్నవి, అట్లు ప్రవేశింపకుండచేయుట యెట్లు, ఒకవేళ ప్రవేశించిన వానిని నిర్మూలించుట యెట్లు అను విషయములు తరువాత కనుగొనవలసి యున్నది.

మనము పీల్చుగాలిగుండ రోగక్రిములు రక్తములోనికి ప్రవే శించునని పాస్టరు కనిపెట్టెను. ఇన్ఫ్లుయంజా (influenza), నూగు లమ్మ (measles), ఆటలమ్మ (chicken-pox), స్ఫోటకము

(small pox), క్షయ (tuberculosis) ఈ వ్యాధుల క్రిములు అట్లు ప్రవేశించును. కలరా, సన్నిపాతము, గ్రహణిరోగముల క్రిములు మనము తీసికొను ఆహారపానీయములద్వారా మనలోనికి ప్రవేశించును. మలేరియా, ప్లేగు (మహామారి) రోగములక్రిములు కీటకముల కాట్లద్వారా మనలోనికి ప్రవేశించును. పరిశుభ్రమైన గాలి పీల్చుటవల్లను, పరిశుద్ధమగు ఆహార పానీయముల తీసికొనుటవల్లను, దోమలు, నల్లులు మొదలగు కీటకములు కుట్టకుండ జాగ్రత్తపడుట వల్లను మనకు రోగములు రావు.



లూయీ పాస్టరు

టీకాలు వేయుటవల్ల స్ఫోటక మెందుకు రాదో ఇప్పుడు బోధ పడినది. మనుష్యుని రక్తములో ఆవుల స్ఫోటకముయొక్క క్రిములను ప్రవేశపెట్టినచో అందలి రక్తకణములు ఒకవిధమగు పదార్థమును తయారుచేయును. అది ఆవుల స్ఫోటకక్రిములను చంపును. అట్లు తయారైన పదార్థమే స్ఫోటకక్రిములనుకూడ చంపును. కావుననే ఒకని రక్తములో స్ఫోటకక్రిములు ప్రవేశించిన నవి చంపబడును. అతనికి స్ఫోటకవ్యాధి రాదు. కాని ఈ పదార్థము ఇతరరోగక్రిములను చంపలేదు. కలరా క్రిములనుగాని, సన్నిపాత క్రిములనుగాని చంపుటకు ఆ రోగములక్రిములను బహుకొద్దిగా రక్తమున ప్రవేశపెట్టవలయును. అప్పుడు రక్తకణములు, కలరా సన్నిపాతక్రిములను చంపు పదార్థమును తయారుచేయును. దీనినే 'రోగ నివారణకై క్రిములను ప్రవేశపెట్టుట'' (preventive

(inoculation)అందురు. మలేరియారాకుండ కొయినాను (quinine) రక్తములో ప్రవేశపెట్టుదురు. దోమలు మనరక్తములో వదలిన మలేరియా క్రిములను కొయినా చంపును.

వెర్రికుక్క కాటువల్ల వచ్చు దారుణరోగమును కుదుర్చుటకు పాస్టర్ కనిపెట్టినవిషయములు తోడ్పడినవి. నేడు ప్రపంచమందంతటను ఇందుకై ప్రత్యేకవైద్యశాలలను స్థాపించిరి. వానికి పాస్టర్ సంస్థలనిపేరు (Pasteur institutes).

మానవులను బాధనుండి రక్షించిన అద్భుతపదార్థము క్లోరోఫారం. దీనిని పీల్చిన మనుష్యులకు నిద్రవచ్చును. స్మృతి తప్పిపోవును. ఆసమయములో దేహమునకు శస్త్రచికిత్స చేయవచ్చును. దేహభాగములుకూడ ఖండించివేయవచ్చును. ఏమిచేసినను రోగికి స్మృతిలేదు. కాబట్టి బాధయుండదు.

1847 సంవత్సరమున జేమ్సుసింప్సన్ అను స్కాటిషు వైద్యునిచే క్లోరోఫారం కనిపెట్టబడినది.

మానవుల స్వస్థత కాటంకము కల్పించు వేరొక విషయమున్నది. దానిని కూడ తొలగించవలసియున్నది. రోగికి బాధలేకుండ, జయప్రదముగ శస్త్రము చేసినప్పటికిని కొన్ని వారములైన పిమ్మట, రక్తముపాడై రోగి మరణించుచుండెను. గ్లాస్గో వైద్యశాలలో పనిచేయు జోసెఫ్ లిస్టర్ అను వైద్యుడు ఇందుకు కారణముల కనిపెట్టెను. రక్తము పాడగుటకు కారణము, గాలియందును నీటియందును క్రిము లుండుటయే. క్రిములవల్ల గాయ



లిస్టర్ ప్రభువు

ములు సెప్టిక్ (Septic అగుచున్నవి—అనగా మాంసము క్రుళ్లు టకు మొదలుపెట్టును, అందలి విషపదార్థములు రక్తములో ప్రవే శించును. ఇట్లు జరుగకుండ నివారించుటకు క్రిమిహారులగు కొన్ని పదార్థములను కనిపెట్టవలెను. కార్బాలిక్ ఆమ్లము (carbolic acid) అట్టి పదార్థమని లిస్టర్ కనిపెట్టెను. అది క్రిములను చంపును. కాని మానవదేహమునకు అపకారము చెయ్యదు. దానిని నోటిలో పెట్టుకొనరాదు. తన వైద్యశాలలోని రోగుల గాయములను కార్బాలిక్ ఆమ్లముతో కడిగి లిస్టర్ వేలకొద్ది ప్రాణముల కాపాడగలిగెను.

X కిరణములు (x-rays) అను అద్భుత కిరణములను కనుగొనుట వల్ల వైద్యుల కెంతో సదుపాయము కలిగినది. 1895 సంవత్సరమున, జర్మను శాస్త్రజ్ఞుడగు ర్యాంట్ యేన్ (Rontgen) వల్ల నవి కను గొనబడినవి. వెల్తురుచొరని ఘనపదార్థములగుండా నీ కిరణములు చొచ్చుకొని పోగలవు. ఒక తుపాకిగుండు దేహములో ప్రవేశించి నచో అది సరిగా ఎక్కడ నున్నదియు ఈ కిరణముల సహాయ ముతో ఫొటోతీసి నిర్ణయించవచ్చును. వైద్యుడు సులభముగా దానిని తొలగించవచ్చును. ఈ కిరణములు వచ్చుటకు కారణ మేమో మొదట ర్యాంట్ యేన్‌కు తెలియదు. అందువల్ల వానికి X కిరణములని పేరుపెట్టెను. కిరణములనగా—X 'తెలియని' కిరణములు. అతడు చేసినపనికి 1901 సంవత్సరమున అతనికి నోబుల్ బహుమానము వచ్చెను.

## అభ్యాసములు

1. సృష్టములను అధికముగా చేయుటకు ముందు 'ప్రకృతి సిద్ధాంతముల' కనుగొనవలెను. ఏలక?

2. న్యూటన్, డార్వినులు కనిపెట్టిన ప్రకృతిసిద్ధాంతము లేమి?

3. నిసర్గవరణ మన నేమి?

4. టీకాలువేసిన ఎందువల్ల స్ఫోటకమురాదు?

5. కోహన్, లిస్టర్, పాస్టర్, సింప్సన్—వీరు కనిపెట్టిన ముఖ్యవిషయము లేమి?

# 14. సామ్రాజ్యస్థాపనకును వర్తకమునకును పోటీదారులు

## 29 పాఠము: గొప్ప మార్గదర్శులు (pioneers)

## కెప్టెన్ కుక్: డేవిడ్ లివింగ్‌స్టోన్

[మూలప్రశ్న 57: కెప్టెన్ కుక్ ఏ ప్రదేశముల కనిపెట్టెను?]

§57. జ్ఞానతృష్ణకారణముగా కొందరు సాహసులు అజ్ఞాతప్రపంచ భాగముల నన్వేషించి కనుగొనుటకు బయలుదేరిరి. అట్టి ప్రపంచ భాగములు, ఆఫ్రికా మధ్యభాగమంతయును, దక్షిణ పసిఫిక్ మహాసముద్రమందున్న కొన్ని ద్వీపములును, భూములును.

పసిఫిక్ మహాసముద్ర ద్వీపాదుల నన్వేషించిన గొప్ప అన్వేషకుడు కెప్టెన్ జేమ్సుకుక్.

27 సంవత్సరముల వయస్సప్పుడు అతడు బ్రిటిషు నౌకాదళములోచేరి స్వల్పకాలములోనే కెప్టెన్ అయ్యెను. బ్రిటిషు శాస్త్రసంఘమువారు శాంతసముద్రమునకుబోవు శాస్త్రజ్ఞుల సముద్రయాత్రను నడిపించ నతనిని కోరిరి.

ఈ యాత్రా సందర్భమున న్యూజిలాండు తీరమును, ఆస్ట్రేలియా తూర్పుతీరమును కెప్టెన్‌కుక్ అన్వేషించెను. ఆ ప్రదేశములను మొదట కనిపెట్టినది డచ్చివారు. కాని వారు తీరములను

చక్కగా పరిశోధించలేదు. ఆ ద్వీపములలోనికి పోనేలేదు. కెప్టెన్ కుక్ న్యూజిలాండు రెండు ద్వీపములనుచుట్టి వచ్చెను. ఈ రెండు ద్వీపముల మధ్యనుండు (నేడు కుక్ జలసంధి అనబడుచున్న) జలసంధిగుండా కూడ పోయెను. పిమ్మట నతడు ఆస్ట్రేలియాకు పోయి



ఒక పసిఫిక్ ద్వీపమున కెప్టెన్ కుక్ దిగుట

బోటనీ అఖాతమువద్ద, నేడు సిడ్నీపట్టణ మున్నచోట దిగెను. ఆ ప్రదేశమున కాతడు న్యూసౌత్ వేల్సు అను పేరిడెను.

ఇంగ్లాండుకు తిరిగివచ్చినతోడనే మరల నాతడు అన్వేషణార్థము పంపబడెను. ఈ మారాతడు దక్షిణధ్రువము (South Pole) చుట్టును ఉన్న భూఖండమును కనిపెట్టుటకు ప్రయత్నించవలసియుండెను. భూఖండమున్నట్లు మనకిప్పుడు తెలియును. కుక్ దానిని కనుగొనలేకపోయెను. కారణ మేమనగా ఆ భూఖండముచుట్టును ఉండు సముద్రము మంచుచే గడ్డకట్టుకొని యుండెను. కాని అంతవరకు

ఎవరును చూడని పసిఫిక్ ద్వీపముల ననేకము అతడు కనిపెట్టెను. ఇందుకై యాతడు తూర్పుగా ఈస్టర్ ద్వీపమువరకు సముద్ర యానము చేసెను. (పటము చూడు.)




కుక్ చేసిన సముద్ర యాత్రలు

1776 సంవత్సరమందు కెప్టెన్ కుక్ కడపటి పర్యాయము సముద్ర

యాత్రచేసెను. ఈమార్గమున నతడు ఉత్తర పసిఫిక్ సముద్రమునకు పోయెను. కెనడాకు ఉత్తరముగా పోయిన అట్లాంటిక్ మహా సముద్రమును చేరుటకు సముద్రమార్గ మున్నదేమో అతడు కనుగొన గోరెను. అలాస్కాతీరము నతడు పరిశోధించెను. (పటములో కుక్ కయ్య కెలదు చూడుము). కాని అతడు అట్లాంటిక్ మహా సముద్రమునకు సముద్రమార్గము నక్కడ కనుగొనలేకపోయెను. పసిఫిక్ మహాసముద్రము మధ్యభాగమున కతడు వచ్చి హావాయి (Hawaii) ద్వీపముల కనుగొనెను. పిమ్మట నతడు ఒక ద్వీపమందలి ప్రజలచే చంపబడెను. అతడొక గొప్ప అన్వేషకుడు (explorer) గొప్ప నాయకుడు.

[మూలప్రశ్న 58 : లివింగ్‌స్టోన్ ఆఫ్రికా కేల వెళ్లెను? అక్కడ ఏమి చేసెను?]

§58. నూరు సంవత్సరములు క్రితమువరకును ఆఫ్రికాను అజ్ఞాత భూఖండ (Dark continent) మనెడివారు. అందుకు కారణము— తీరప్రాంతములు తప్ప మిగత భాగము గురించి ఎవరికిని ఏమియు తెలియదు. స్కాట్లాండు దేశస్థుడగు డాక్టర్ డేవిడ్ లివింగ్‌స్టోన్ ఆఫ్రికా మధ్యభాగము నన్వేషించిన వారిలో శ్రేష్ఠుడు. గ్రంథపఠనము నతడమితముగా చేయువాడు. అందువల్ల నతనికి రెండు కోర్కె లుదయించెను. అజ్ఞాత భూముల నన్వేషించవలెనని మొదటి కోర్కె. క్రైస్తవమత ప్రచారకుడుగా నుండవలెనని రెండవ కోర్కె.



డేవిడ్ లివింగ్‌స్టోన్

వైద్యవిద్య నేర్చుకొన్నచో తా నితరుల కెక్కువ సహాయము చేయవచ్చునని తలచి యతడు వైద్యవిద్య నభ్యసించెను. పిమ్మట




లివింగ్‌స్టోన్ చేసిన సముద్రయాత్ర

ఆఫ్రికాకు వెళ్లెను. ఆఫ్రికాలో నతడు మొట్టమొదట జెంబెజీ నదిని కనుగొనెను. ఆ నదీ జలపాతమున కాతడు విక్టోరియా జలపాతి (waterfall) మని పేరిడెను. ప్రపంచమందలి గొప్ప జలపాతములలో నిది యొక్కటి; జెంబెజీనది నయాగరానది యంత వెడల్పు లేదు. కాని నయాగరా జలపాతమునకు రెండు రెట్లు ఎత్తుననుండి దాని జలపాతము పడుచున్నది. ఆ దేశవాసు లీజలపాతమును 'చప్పుడుచేయు పొగ' యందురు. గొప్ప నీటిమొత్తము మెత్తన నుండి పడుటవలన పెద్ద చప్పుడగును. 400 అడుగుల ఎత్తునుండి లోతుగానున్న లోయలోనికి నది పడునప్పుడు చెదరిన నీటితుంపురులు మేఘమువలె లేచి పొగవలె కనబడును.

మరొకమారు వెళ్లినప్పుడు లివింగ్‌స్టోన్ న్యాసాసరస్సును కనిపెట్టెను. ఆఫ్రికాలో జరుగుచున్న బానిసత్వ వ్యాపార మెంత క్రూరముగానున్నదో యూరోపు జనులకు తెలిపెను. ఈ కాలమందే అమెరికాలో 'లింకను' బానిసత్వమును రూపుమాప పోరాడుచుండెను.

కడపటిసారి వెళ్లినప్పుడు లివింగ్‌స్టోన్ నైలునది పుట్టినచోటు కనుగొనవలె నని ప్రయత్నించెను. అయిదు సంవత్సరముల కాలమతని వార్తలు తెలియలేదు. టాంగాన్యీకసరస్సుచుట్టును తిరుగుచు అతడా కాలమును గడపెను. 1873 సంవత్సరమున అతడు తన పటకుటీరము (tent) లో మరణించెను.

మధ్యఆఫ్రికా మహారణ్యములను లివింగ్‌స్టోన్ పరిశోధించుచున్న కాలమునందే సాహసులగు ఇతర అన్వేషకులు ఆస్ట్రేలియా అంతర్భాగములను పరిశీలించుచుండిరి. ఆస్ట్రేలియా మధ్యభూమి ఎడారి. ఉత్తరమునుండి దక్షిణమునకును, తూర్పునుండి పడమర

కును వెళ్లుటకు ప్రయత్నించిన ధైర్యవంతులగు అన్వేషకులు పెక్కురు త్రాగుటకు నీరు లేక పిపాసాపీడితులై మరణించిరి.

## 39 పాఠము: సామ్రాజ్యవాదము (imperialism)

## డిజ్‌రేలీ: సిసిల్‌రోడ్సు

[మూలప్రశ్న 59: సామ్రాజ్యవాద మన నేమి?
అది వృద్ధిజెందుటకు కారణమేమి?]

§59. కెప్టెన్‌కుక్, లివింగ్‌స్టోన్ వంటి పలువురు పురుషులు కని పెట్టిన భూములు, చేసిన అన్వేషణలు కారణముగా బ్రిటిషు సామ్రాజ్యము నానాటికి వృద్ధిజెందినది. సామ్రాజ్యమందలి కొన్ని భాగములు దౌర్బల్యముతో జయించి కైకొనబడినవి. ఫ్రెంచివారి నుంచి కెనడాయును, వారి యధీనమందున్న ఇండియాలోని భాగ ములును బ్రిటిషువారు జయించి తీసికొనిరి. డచ్చివారినుండి దక్షిణ ఆఫ్రికాయును, సింహళమును జయించి తీసికొనిరి. సామ్రాజ్య మందలి ముఖ్యభాగమును, అనగా—క్రొత్త ఇంగ్లీషు అధినివేశ ములను, అమెరికా స్వాతంత్ర్యయుద్ధమునందు పోగొట్టుకొనిరి. క్రొత్తగా జయింపబడిన కెనడా దక్షిణఆఫ్రికాలోను, క్రొత్తగా కనిపెట్టబడిన ఆస్ట్రేలియా న్యూజిలాండులలోను బ్రిటిషువారు వలసవెళ్లి కాపురము లేర్పాటుచేసికొనిరి. నానాటికి వారి జన సంఖ్య పెరుగుచుండెను. కష్టజీవితముల కొప్పుకొని వారీ దేశము లలో ఇష్టపడి స్థిరనివాస మేర్పరుచుకొనిరి.

అన్వేషణమువల్లను, వలసలకు వెళ్లుటవల్లను మాత్రమేకాదు–బ్రిటిషుసామ్రాజ్యము పెరుగుట కితర కారణములు కూడ ఉన్నవి. ఇతర జాతులవారు కూడ దూరప్రాంతములలో కొంత దేశము సంపాదించుటకు ప్రారంభించిరి. జాతులు సామ్రాజ్యములుగా పెరి

గిన కథ ఇప్పుడు మనము తెలిసికొందము. దీనినే సామ్రాజ్య వాదముయొక్క అభివృద్ధియందురు.

జాతులు సామ్రాజ్యములు కావలెనని ఎందుకు కోరుదురో మనము మొట్టమొదట గ్రహింపవలయును. జాతిలోనున్న ప్రజలందరు తమ దేశముతో తృప్తిపడియుండరాదా? ఇతరుల దేశములు జయించవలెనని వారెందుకు కోరవలెను?

జాతీయతయందువలెనే సామ్రాజ్యవాదమునందును అనేక అంశము లున్నవి. మొదటియంశము—తమ యధికారమును విస్తరింపజేసికొనుటలో నాయకుల కుండు సంతోషము. ఈ యంశమును మనము నాయకులకు వ్యక్తిగతముగానుండు ఆశ— అనవచ్చును.

తమ్ము అనుసరించుటకును తాముచెప్పినట్లు చేయుటకును ప్రజలున్నతప్ప నాయకు లేమియు చేయజాలరు. సామ్రాజ్యముకొరకని ప్రజలు నాయకుల నేల యనుసరింపవలెను? యుద్ధముచేయుటకు కూడ ఏల సమ్మతింపవలెను? దీనికి కారణము సామ్రాజ్యవాదమందలి రెండవయంశమగు ఆర్థికావశ్యకత (economic necessity). ఆర్థికావశ్యకత యననేమి?

ద్రవ్యమును, ఐశ్వర్యమును, వస్తువులను ఉత్పత్తిచేయుటకును పంచిపెట్టుటకును సంబంధించిన—అని ఆర్థికపదమున కర్థము. కాన ఆర్థికావశ్యకత అనగా ధనమునుగాని వస్తువులనుగాని ఉత్పత్తి చేయుట కావశ్యకత. ఇట్టి యావశ్యకత సామ్రాజ్యవాదమున కెట్లు దారితీయును?

ఒక దేశమందలి ప్రజలు వారికి కావలసిన ఆహారపదార్థములను వారు పండించుకొనుచు, వారికి కావలసిన వస్తువులను వారు చేసి

కొనుచు నుండినచో ఇతర దేశములతో వర్తకము చేయవలసిన అవసరములేకుండ వారు కాలక్షేపము చేయుగలరు. కాని ఒక దేశమునుండి వేరొక దేశమునకు జనులు విరివిగా ప్రయాణములు చేయుట మొదలుపెట్టిన పిమ్మట జనులు ఇతర దేశములందలి మంచి వస్తువులను గురించి విని వానిని తమకు కావలెనని కోరుచుండిరి. ఇతర దేశములనుండి వర్తకులు లాసరుకులను తెచ్చినప్పుడు ఎక్కువ ధర పెట్టి వానిని కొనుచుండిరి. ఈవిధముగా వర్తకము ప్రారంభమై క్రమక్రమముగా వృద్ధిఅయ్యెను.

నూరు సంవత్సరములక్రితము యూరోపులో చవుకగాను త్వరగాను వస్తువులను తయారుచేయగల యంత్రములు కనిపెట్టబడినవి. అమెరికానుండి వచ్చిన ప్రత్తితో లాంకషైరులో బట్టలు నేయ సాధ్యమగుచుండెను, త్వరగాను, చౌకగాను యంత్రములతో బట్టలు తయారగుటచేత, వాటిని ఇండియాలో, చేమగ్గముల మీాద తయారైన బట్టలకంటె తక్కువధరకు ఇండియాలో అమ్ముటకు వీలుగా నుండెను. బ్రిటిషు వర్తకులు తమ వస్త్రములను ప్రపంచమం దన్నిభాగములందును అమ్మ మొదలిడిరి. ఇతర పాశ్చాత్యజాతులు కూడ యంత్రములను సంపాదింప మొదలిడిరి. 1868 సంవత్సరము తరువాత జపానుదేశస్థులుకూడ ఇట్లే చేసిరి. ఒక దేశమందు ఫ్యాక్టరీలు అధికముగనుండి, అందు యంత్రసహాయముతో పలువిధములగు వస్తువులు తయారుచేయబడుచున్నచో— అట్టి దేశమును పారిశ్రామిక దేశ మందురు. 1890 సంవత్సరమునకు పాశ్చాత్యదేశములు పెద్దవన్నియును, జపానుదేశమును పారిశ్రామిక దేశములైనవి. తయారైన వస్తువుల నమ్ముటకు వారు [illegible] నొకరు పోటీపడవలసివచ్చెను. వస్తువులమ్ము ప్రదేశము

నకు వ్యాపారరంగము (market) అందురు. పై విధముగా వ్యాపార రంగములు సంపాదించుకొనుటకు వివిధదేశములు తీవ్ర ప్రయత్నములుచేయ మొదలిడెను.

[మూలప్రశ్న 60 : ఆఫ్రికాలోను తూర్పుదేశములందును వర్తకము చేసికొనుటకై పోటీపడిన జాతులెవ్వి?]

§60. వ్యాపారరంగముల కొరకే కాదీ తీవ్రపరియత్నము; ముడి వస్తువులను సంపాదించుటకును వారు పోటీలు పడవలసివచ్చెను. వస్త్రములు తయారుచేయుటకు ప్రత్తిగాని, పట్టుగాని, ఉన్నిగాని అవసరము. నీ దేశములో కావలసినంత ప్రత్తిగాని, పట్టుగాని, ఉన్నిగాని ఉత్పత్తికానప్పుడు ఇంకొక దేశమునుండి నీవు కొనవలెను. ఈవిధముగా పారిశ్రామిక దేశములు ముడివస్తువులకొరకు పోటీ పడజొచ్చిరి.

134 పేజీలోనున్న ఆఫ్రికాపటమును చూడుము. ఆ పెద్ద భూఖండమందు స్వతంత్రరాజ్యములు కొద్దిగానున్నట్లు గమనింపవచ్చును. ఆఫ్రికాలోని మిగతభాగమంతయు, 1890, 1900 సంవత్సరములమధ్య, పాశ్చాత్యజాతులు తీసికొన్నవి. దక్షిణఆఫ్రికాలో బ్రిటిషుసామ్రాజ్యము విస్తరించుటకు కారణభూతుడు సిసిల్ రోడ్సు అను ఆంగ్లేయుడు. అతనిపేరే రోడీషాకు వచ్చినది.

ఇంకొకవిధముగా కూడ సామ్రాజ్యవాదము విస్తరించెను. దూరదేశములతో వర్తకము చేయదలచినచో నీ సరుకులు సురక్షితముగాను త్వరగాను ఆ దేశములు చేరగలవను నమ్మకము నీకుండవలెను. నీవు సముద్రముద్వారా సరుకులను పంపదలచినచో సముద్రయానము చేయునప్పుడు మధ్యమధ్య ఆగుటకు నౌకాశ్రయము (harbours) లుండవలెను. నౌకాశ్రయములందు ఓడలు

బొగ్గును, నీటిని, ఆహారమును తీసికొనును. అవసరమైనచో ఓడలకు




ఆఫ్రికా: 1880, 1913 సంవత్సరములమధ్య యూరోపుజాతులు పంచుకొన్నట్లు.

(1) మొరాకో: అరబ్బులరాజ్యము, ముఖ్యముగా ఫ్రెంచి స్పానిష్‌వార రక్షణక్రిందను అధికారము క్రిందను ఉన్నది. (2) ట్రిపోలి: 1911 వరకు తురుష్క పరిపాలనక్రింద నున్నది. పిదప ఇటలీ స్వాధీనముచేసుకొని లిబియా

అను పేరు పెట్టినది. (3) ఈజిప్టు : 1882 వరకు తురుష్క పరిపాలన క్రిందను పిమ్మట బ్రిటీషువారి రక్షణక్రిందను ఉన్న రాజ్యము. (4) అబిసీనియా: స్వతంత్రరాజ్యము. 1936 లో ఇటలీ స్వాధీనపఱచుకొనెను. 1941 లో మరల స్వతంత్రరాజ్యమయ్యెను. 1942 నుండి స్వతంత్రరాజ్యము. (5) లైబీరియా : నీగ్రోల స్వతంత్ర గణప్రభుత్వము. 1847 లో బానిసత్వమునుండి విముక్తి కాంచిన నీగ్రోలకొరకు స్థాపింపబడినది. (6) బోయరు గణప్రభుత్వములు: 1900-2లో బ్రిటిషువారు స్వాధీనము చేసికొనిరి. ఇప్పుడు దక్షిణఆఫ్రికా యూనియనులో ఒక భాగము. బ్రిటిషు కామన్‌వెల్తులో ఒక రాజ్యము.

మరమ్మతులు చేసికొనును. బ్రిటిషువారు ఓడలద్వారానే ఎక్కువగా తమ వర్తకమును సాగించుచుండిరని తెలిసికొంటిమి. కాబట్టి అనేకముగా నౌకాశ్రయములు వారి యధీనములో నుండవలెను. ఇందువల్లనే ప్రపంచమందంతటను పెక్కుద్వీపములందును, ఇతర ప్రదేశములందును బ్రిటిషు వర్తకులు అధినివేశము లేర్పరచుకొనిరి. కొన్నిటిని బ్రిటిషువారు తమ నౌకాబల సహాయముతో జయించిరి. బ్రిటిషు సామ్రాజ్య పటములో చూచిన ఈ విషయము సువ్యక్తమగును. ఇంగ్లాండు ఇండియాలమధ్య ప్రయాణమును సుళువుచేసిన సూయజ్ కాలువ డీలెస్సెప్సు(De Lesseps)అను ఫ్రెంచి ఇంజినీరు (engineer)త్రవ్వెను.



సిసల్ రోడ్స్

1869 సంవత్సరమున నది తెరువబడెను. అది ఒకకంపెనీ మానేజి మెంటులో నున్నది. కంపెనీలో సగము వాటాలు బ్రిటిషుప్రభుత్వము కొరకు బ్రిటిషు మంత్రిశేఖరుడు బెంజెమిన్ డిజ్రేలీ కొనెను.

నాటుమార్గముగుండ నీవు వర్తకము చేయదలచినచో నీకు రోడ్లుగాని రైల్వేలుగాని ఉండవలెను. అమెరికా రష్యాదేశములు చాలపెద్దవి. వారికి నాటువ్యాపార మెక్కువ. ఆ కారణమువలన చాలకాలమువరకు వారు సముద్రయానము చేసి దూర దేశముల వ్యాపారరంగముల కొరకు పోటీచేయలేదు. కాని దేశములందన్ని భాగములకును వారు రైళ్లు నిర్మించుకొనిరి. మధ్యప్రాచ్యము (middle east) గుండా జర్మనులు టర్కీతోను, ఇండియాతోను వర్తకము చేయగోరిరి. కాబట్టి వారు బెర్లిన్ నుండి బాగ్దాదువరకు రైలు నిర్మింప ప్రారంభించిరి. యుద్ధమే రాకున్నచో ఇరాన్ దేశము మీదుగా సింధుదేశపు పొలిమేరలవరకు రైలు పడవలసినదే. యుద్ధమునకు యథార్థకారణము—రెండు సామ్రాజ్యముల మధ్య నుండు పోటీయే.

## 31 పాఠము: జర్మను సామ్రాజ్యము, మొదటి ప్రపంచయుద్ధము

[మూలప్రశ్న 61 : జర్మనీలో ఐక్యత చేకూర్చినవా రెవరు? ఎట్లు చేకూర్చిరి?]

§61. ఈపుస్తకములో ఇంతవరకును జర్మనుజాతి సంగతి ఎత్తుకో లేదు. ఎందువల్ల? 80 సంవత్సరముల క్రితమువరకు జర్మనుజాతి అనునది లేనికారణమువల్లనే.

16-వ పాఠములో ప్రషియారాజగు రెండవ ఫ్రెడరిక్కును గూర్చి చదివియున్నాము. యూరోపులో ఫ్రెంచివారి నోడించుటకు విలియం పిట్ ఈ రాజునకే సహాయముచేసెను. ఇండియా అమెరి

కాలలో ఫ్రెంచివారిని బ్రిటిషువారే యోడించిరి. కాని ఫ్రెడరిక్కు జర్మనీకంతకును రాజుకాడు; జర్మనీ కుత్తరభాగమగు ప్రషియాకు మాత్రమే రాజు. ఫ్రాంసును జయించి అతడు ప్రషియాను వృద్ధి చేసెను. సైన్యమునకు సర్వతోముఖమగు శిక్షణ నిచ్చి యూరోపులోనున్న రాజు లందరికన్న ప్రబలు డయ్యెను. ఫ్రెడరిక్ మరణించినతరువాత నూరుసంవత్సరములకు ప్రషియా, సంయుక్త జర్మనీలో ప్రధానరాష్ట్ర మయ్యెను. ఇది ఎట్లు సంభవించెనో చూతము.

ఇదియంతయు ప్రిన్సుఆటోవాన్ బిస్మార్కుయొక్క ప్రయోజకత్వమే. ఆకాలమున జర్మనీలో స్వతంత్రరాష్ట్రము లనేకము లుండెను. అందు ప్రషియా ప్రధానమైనది. 1862సంవత్సరమున ప్రషియాకు రాజగు మొదటివిల్ హెల్మురాజునకు బిస్మార్కు ప్రధానమంత్రి యయ్యెను. ప్రషియాలోని ఆరోగ్యవంతులగు పడుచువాండ్రందరు సైనికశిక్షణపొందవలయు నని అతడు వెంటనే ఒక శాసనమును ప్రవేశపెట్టెను. కొద్ది సంవత్సరములలో యూరోపుదేశమం దెచ్చటనులేని ఉత్తమశిక్షణ పొందిన సైన్యము ప్రషియాలో నుండెను. తరువాత నతడు ఆస్ట్రియాపై యుద్ధము ప్రకటించెను. నెపోలియన్ పరాజితు




బిస్మార్క్

డై నప్పటినుండియు జర్మనురాష్ట్రములకు నాయకత్వము వహింప ఆస్ట్రియా ప్రష్యాతో పోటీ పడుచుండెను. మూడువారములలో నతడు ఆస్ట్రియనులను పూర్తిగా ఓడించెను. జర్మన్ రాష్ట్రములలో ప్రషియాను ప్రధానరాష్ట్రముగా నంగీకరించునట్లు ఆస్ట్రియాతో సంధిషరతులు చేసికొనెను.

ఈ కాలమున ఫ్రాంసునేలుచున్న రాజు మూడవ నెపోలియన్. అతడు నెపోలియన్ బోనాపార్ట్ సంతతివాడు. అతడు ప్రషియాపై యుద్ధము ప్రకటించెను. బిస్మార్కు కోరినదియుకూడ ఇంతే. అంతవరకును జర్మన్ రాష్ట్రములు ఒకజాతిగా ఏకము కాలేదు. ఇప్పుడు ఫ్రెంచివారితో పోరాడుటకు ప్రషియా నాయకత్వము క్రింద అవి ఏకమైనవి. కొద్దిమాసములలో ఫ్రెంచిసైన్యము ప్రషియనులచే నోడింపబడినది. నెపోలియన్‌ను చెరబట్టిరి. పారిస్‌ను ముట్టడించిరి. అది వారికి లోబడెను. ఫ్రెంచివారి పరాజయము పూర్తియయ్యెను. జర్మనీకి సమీపముగా నున్న ఆల్‌సేస్, లోరైను అను తమ రాష్ట్రములను ఫ్రెంచివారు జర్మనీకి ఇచ్చుకోవలసివచ్చెను. ఇంతేగాక యుద్ధవ్యయమునకని పెద్దపెద్ద ధన మొత్తములు వారినుండి వసూలుచేయబడెను. యుద్ధముకొరకై ఏకమైన జర్మన్ రాష్ట్రములు తాము శాశ్వతముగా ఏకమై యుండుటకు నిశ్చయించుకొనెను. ప్రషియన్ రాజగు మొదటి విల్‌హెల్మును జర్మనుచక్రవర్తిగా 1871 సంవత్సరము జనవరి మాసమున పట్టాభిషేకము చేసిరి. బిస్మార్కు నిర్వహింపదలచుకొన్న పని పూర్తియైయెను.

[మూలప్రశ్న 62: కైజర్ విల్‌హెల్మ్ II యొక్క లక్ష్యమేమి? అతడేల విఫలమనోరథుడయ్యెను?]

§62. పశ్చిమయూరోపుదేశములు జాతులైన 300 సంవత్సరములకు జర్మను లొకజాతివారైరి. ఐక్యత సాధించినపిమ్మట వారి యభివృద్ధి అసాధారణముగా నుండెను. పశ్చిమయూరోపుదేశములు పారిశ్రామికదేశము లగుచున్నకాల మది. తెలివిగలశాస్త్రజ్ఞుల యొక్కయు, పరిశోధకులయొక్కయు సహాయముతో జర్మని పారిశ్రామికదేశములలో నగ్రగణ్యమయ్యెను. యంత్రములు, అన్నిరకముల లోహసామగ్రులు, రసాయనద్రవ్యములు, రంగులు, ఔషధములు మున్నగు జర్మనుసరకులు ప్రపంచ మన్నిమూలలకును పోజొచ్చెను. జర్మనీకూడ వ్యాపారరంగములకును, ఆఫ్రికాలోని అధినివేశములకును పోటీపడెను.

ప్రష్యారాజును జర్మనీకి చక్రవర్తియు నగు రెండవ విల్‌హెల్మ్ అత్యాశగలవాడు. అన్నివిధముల జర్మనీ, ప్రపంచమందలి జాతులన్నింటికన్న ప్రబలమగు జాతిగా నుండవలెనని యతడు కోరెను. ఈ ఉద్దేశముతో అతడు జర్మనువర్తకమును, జర్మను పరిశ్రమలను ప్రోత్సహించెను. అవసరము కలిగినప్పుడు ఉపయోగించుటకు జర్మనుసైన్యమును, నౌకాబలమును సిద్ధముగా నుంచెను.

1914 సంవత్సరమున కోరిన అవకాశము వచ్చెను. జర్మను రాష్ట్రములకు నాయకత్వము ఆస్ట్రియా యిప్పుడు వహించి యుండలేదు. అది జర్మనీకి మిత్రదేశమై యుండెను. పొరుగున నున్న సెర్బియా (ఇప్పుడు యుగోస్లావియా)నుండి కొన్నిరాష్ట్రములను కలుపుకొని ఆస్ట్రియాను వృద్ధిచేసికొమ్మని ఆస్ట్రియన్

రాజును విల్ హెల్ము ప్రోత్సహించెను. కాని సెర్బియాతో చెలిమి పాటించిన దేశమైన రష్యాఫ్రాంసులు సెర్బియాపై దండయాత్ర సాగించినచో తాము ఆస్ట్రియాతో యుద్ధముచేసెదమని బెదిరించిరి. బలమైన తన సైన్యములను ఫ్రాంసుపై త్వరలో నడిపించి వారిని ఓడించవచ్చునని విల్ హెల్ముచక్రవర్తి నమ్మెను. బిస్మార్కు కాలములో ఫ్రాంసు నిశ్లేగదా తనతాత యోడించినది. కాబట్టి ఆస్ట్రియాపై రష్యా యుద్ధము ప్రకటించుటతోడనే విల్ హెల్ము తనసేనలను బెల్జియంగుండా ఫ్రాంసుమీదికి నడిపించుకొనిపోయెను. బెల్జియంపై దండెత్తుట, 1830 సంవత్సరమున బ్రిటిషువారును, ఫ్రెంచివారును, జర్మనులును చేసికొన్న ఒడంబడికకు వ్యతిరేకము. అప్పుడే స్వతంత్రరాజ్యముగా హాలెండునుండి బెల్జియం వేరుపడినది. కాబట్టి జర్మనుసేనలు బెల్జియంలో ప్రవేశించుటతోడనే బ్రిటిషు వారు ఫ్రాంసు, బెల్జియం, రష్యా, సెర్బియాలపక్షమున జర్మనీ ఆస్ట్రియాలకు ప్రతికక్షులై యుద్ధములో ప్రవేశించిరి.

బ్రిటిషువారు యుద్ధములో ప్రవేశింతురని జర్మనుచక్రవర్తి అనుకొనలేదు. ఒకవేళ ప్రవేశించినను, అంతకుముందుగానే ఫ్రెంచి వారిని తా నోడించగలిగియుందునని తలచెను. అంతపని జరుగవలసినదేకాని జర్మనుసేనలు పారిస్ సమీపమునకు వచ్చుసరికి బ్రిటిషు సేనలు ఫ్రెంచిసేనలను కలుసుకొని జర్మనుసేనల నెదిరించెను. తూర్పున జర్మనీ ఆస్ట్రియాలమీదకు రష్యా దండెత్తదలచెను కాని జర్మనులును, ఆస్ట్రియనులును అట్లు జరుగనియ్యలేదు.

అప్పుడే వాయువిమానములు ఉపయోగములోనికి వచ్చినవి గాని బాంబులు (bombs) వేయుటకు వాటి నింకను ఉపయోగించుట లేదు. 1916 సంవత్సరమున టాంకులు (tanks) కనిపెట్టబడినవి.

కాన ఉత్తర ఫ్రాంసుదేశమున కడ్డముగా కందకముల (trenches) వెనుకను, ముళ్లతీగెల (barbed wire) వెనుకను ఒకతట్టున జర్మను సేనలును, రెండవతట్టున బ్రిటిషు ఫ్రెంచిసేనలును ఎదురెదురుగా నిలుచుండిరి. ఏ ఒక్కరును రెండవవారిని తరుమగొట్టలేకపోయిరి. ఈలోపుగా ఇంగ్లాండుకు ఆహారమును గొనిపోవు నావలను ముంచుటకును, మిత్రసేనలకు యుద్ధసామగ్రిని గొనిపోవు నావలను ముంచుటకును జర్మనులు జలాంతర్గాముల (submarines) నసంఖ్యాకముగా బంపి ఆ విధముగా బ్రిటిషువారి నోడింప బ్రయత్నించిరి. అనేక నావ లీవిధముగా ముంపబడెను. చివరకు బ్రిటిషు నౌకాబలము జలాంతర్గాముల నోడించి, యూరోపుతో వర్తకము సాగించకుండ జర్మనీని ముట్టడించిరి. ఇటలీ, జపాను, అమెరికా సంయుక్తరాష్ట్రములును మిత్రమండలితో చేరెను. 1918 సంవత్సరమున జర్మని సంధిని కోరెను. విల్‌హెల్మ్ చక్రవర్తి హాలెండుకు పారిపోయెను. జర్మనులు ప్రజాప్రభుత్వ పరిపాలనమును స్థాపించుకొనిరి.

## అ భ్యా స ము లు

1. పసిఫిక్ మహాసముద్రము నన్వేషించుచు కెప్టెన్ కుక్ తన జీవితమును గడపుటకు కారణములేమి? డాక్టరు లివింగ్‌స్టోను తన జీవితమును ఆఫ్రికాలో గడపుటకు కారణములేమి? వారు చేసిన కార్యములవల్ల వచ్చిన ఫలితములేమి?

2. సామ్రాజ్యవాద మనగేమి? అది ఎందువల్ల, ఎట్లు వృద్ధిజెందినది?

3. సూయజ్ కాలువను గూర్చి క్రొత్త పుస్తకములను చదివి, దానిని గురించియు, దాని ఉపయోగములను గురించియు సంగ్రహముగా వ్రాయుము.

4. జర్మనీ ఎట్లు ఒకజాతియైనది?

5. మొదటి ప్రపంచయుద్ధమునకు కారణములేమి? దాని ఫలితమేమి?

# నేటికాలమున సృష్టమైన అద్భుత విషయములు

## 32 పాఠము : ఎడిసన్ : మేధంకారి

[మూలప్రశ్న 63: ఎడిసన్ చేసిన సృష్టములు ఏవి?]

§63. ఏమానవుడును యిదివరలో సృష్టించనన్ని పనికివచ్చు క్రొత్త సాధనములను థామస్ ఆల్వా ఎడిసన్ నూతనముగా సృష్టించెను.

1847 సంవత్సరమున అమెరికాలో ఎడిసన్ జన్మించెను. చిన్నతనమున నతడు రైలుబళ్లలో వార్తాపత్రికలమ్ముచుండెను. ఆ రోజులలో నతడు సామాను బండిలో ముద్రణయంత్రము పెట్టుకొని సొంతముగా వార్తాపత్రికముద్రించి అమ్ముచుండెను. మరియు నతడు స్వయముగా తయారుచేసిన టెలిగ్రాఫును రైలుబండిలో అమర్చి ప్రయోగములు (experiments) చేయుచుండెను.



థామస్ ఆల్వా ఎడిసన్

టెలిగ్రాఫు (telegraph) లో అతనికున్న అనురక్తివల్లనే, 20-వ యేట అతనికొక మంచి యుద్యోగము లభించెను. న్యూయార్కు పట్టణములోనున్న ఒక పెద్ద కంపెనీయొక్క టెలిగ్రాఫు యంత్రములు ఉన్నట్లుండి చెడిపోయినవి. ఆ సమయమున ఉద్యోగము సంపాదించుకొనుటకు

వచ్చిన ఎడిసన్ అదృష్టవశాత్తు అక్కడనే యుండుట తటస్థించెను. త్వరలో నాతడు యంత్రములు చెడిపోవుటకు కారణమును కనుగొని వాటిని సరిచేసెను. వెంటనే ఆకంపెనీ, టెలిగ్రాఫ్ యంత్రము లన్నియు సరిగా నుండునట్లు చూచుటకై అతనిని నియోగించిరి. టెలిగ్రాఫు ఎక్కువ సమర్థముగా పనిచేయుట కత డెన్నివిధములు గానో మార్పులు చేయుటకు ప్రయత్నించుచుండెను. అత డొక నూతన విధానమును కనిపెట్టుటచే కంపెనీ కెంతో లాభము వచ్చెను. అందుకు కంపెనీవా రతనికి పెద్దధనమొత్తము నిచ్చిరి. దానితో నతడు సొంత ప్రయోగశాల (laboratory) పెట్టుకొని ప్రయోగము లెక్కువగ చేయుచువచ్చెను.

అత డొక డూప్లికేటింగ్ యంత్రము (duplicating machine) తయారుచేసెను; క్రొత్తగా కనిపెట్టబడిన టైపురైటర్ (type-writer) యంత్రమును బాగు చేసెను. తరువాత టెలిఫోన్ (telephone) యంత్రముపై తన దృష్టి ద్రిప్పెను. టెలిఫోను కని పెట్టినవాడు గ్రాహంబెల్. కాని ఎడిసన్ దాని నెంతో అభివృద్ధి చేయుటచే దాని నిప్పుడు ప్రపంచ మందంతట వాడుచున్నారు. పిమ్మట నాతడు ఫోనోగ్రాఫు (phonograph) ను సృష్టించెను. మాటలను గాని సంగీతమును గాని యీ యంత్రము ఉన్న



ఎడిసన్ : అతని ఫోనోగ్రాఫ్

దున్నట్లు తిరిగి పలుకును. దీనినుండియే గ్రామాఫోను(gramophone) పరిణమించినది.

విద్యుద్దీపము (electric lights) లప్పటికే కొద్దిగానుండెను. కాని అవి సర్వసామాన్యము కాలేదు. ఎందువల్లననగా గాజుబల్బు (bulb) లో నుంచుటకు తగిన ఫిలమెంటు (filament) ఎవరును కనిపెట్టలేదు. వేలకొద్ది ప్రయోగములనుచేసి ఎడిసన్ చివరకు దానిని కనిపెట్టెను. ఇందుచే విద్యుద్దీపములు విద్యుత్తు ఉన్న తావులందెల్ల పెట్టుటకు వీలైనది.

తరువాత నితడు సృష్టించిన యంత్రము కినెటోస్కోపు (kineto-scope). దీనినుండియే నేటి సినీమా పరిణమించినది. 1912 సంవత్సరమున నతడు కినెటోఫోన్ (kineto-phone) సృష్టించెను. ఇందు బొమ్మలును, వారిమాటలును కలిసియుండును. దీనివల్లనే టాకీ చిత్రములు సాధ్యమయ్యెను. మొత్తముమీద నీతడు 1300 పైగా క్రొత్త విషయములను కనిపెట్టి 1931 సంవత్సరమున కీర్తిశేషుడయ్యెను.

[మూలప్రశ్న 64: మేడంకూరీ ఏమి కనిపెట్టెను, దాని నెట్లామె వినియోగములోనికి తెచ్చెను?]

§64. ఈ కాలమునందు కనిపెట్టబడిన ఉత్కృష్టమగు పదార్థములలో నొక్కటి రేడియం. దీనిని కనిపెట్టిన స్త్రీ మేడం మేరీ కూరీ. పారిస్‌బడిలో నామె సైన్సుటీచరుగా పనిచేయు కాలమున డాక్టరు పీయేర్‌కూరీ అను ఫ్రెంచి శాస్త్రజ్ఞునివద్ద శాస్త్ర మభ్యసించెను.


మేడం కూరి

1895 సంవత్సరమున గురుశిష్యులు

దంపతులైరి. మంచి ప్రయోగశాల కట్టుకొనుటకు వారికి డబ్బు లేదు. ఒక పాత, చీకటి కొట్టుగదిని వారు ప్రయోగశాలగా చేసికొనిరి. రాత్రింబగళ్లు వారు కష్టపడిరి. మూడేండ్ల తరువాత శిష్యురాలు రేడియం అను అద్భుతమగు నూతనపదార్థమును కనిపెట్టెను.

1904 సంవత్సరమున పియేర్ కూరీకిని మేడంకూరీకిని ఫిజిక్సులో నోబెల్ బహుమానము వచ్చెను. పారిస్ విశ్వవిద్యాలయములో రేడియం పరిశోధనకు ప్రత్యేకశాఖ ఏర్పరచబడినది. ఆశాఖకు డాక్టరుకూరీ అధిపతిగాను మేడంకూరీ ప్రధాన సహాయకురాలుగాను ఏర్పరుపబడిరి. మూడు సంవత్సరములు గడచిన పిమ్మట పారిస్ వీధిలో సంభవించిన ప్రమాదము కారణముగా పియేర్ కూరీ ప్రాణముల విడిచెను. అయినను మేరీ అతడు ప్రారంభించిన పనిని కొనసాగించ నిశ్చయించుకొనెను. అతని స్థానమున పనిచేయుటకు ఆమెను నియోగించిరి. 1911 సంవత్సరమున మరల నామెకు నోబెల్ బహుమానము వచ్చెను. ఈమారు రసాయన శాస్త్రములో వచ్చెను.

ఆమె కనిపెట్టిన నూతన పదార్థములనుబట్టి మేడంకూరీకి ప్రపంచమందంతటను కీర్తివచ్చెను. ఆమె మిగత జీవితమునంతయు—20 సంవత్సరములుపైగా—రోగనివారణార్థము రేడియం నుపయోగించుచు గడపెను. ఇందువల్ల కూడ ఆమెకీర్తి దేశదేశముల వ్యాపించెను.

రేడియం ప్రమాదకరమైన పదార్థము. రేడియం కిరణముల ప్రభావమువల్ల ఆమె తీవ్రముగా బాధపడెను. తుదకు ఒక పారిస్ వైద్యశాలలో, 1934 సంవత్సరమున, స్వార్థరహితమగు ఆమె నిరుపమాన జీవనము అంతమయ్యెను.

## 33 పాఠము: పెట్రోలు ఇంజను: విమానము; రేడియో: భావికాలము

[మూలప్రశ్న 65: ఏ సృష్టములవలన గాలిలో ఎగురుట సాధ్యమయ్యెను? విమాన మేయే పనులకై ఉపయోగింపబడినది?]

§65. నేటికాలమున చేయబడిన సృష్టము లన్నింటిలోను విమానము ముఖ్యమైనది. పెట్రోలువల్ల పనిచేయు ఇంజను లేకున్న విమానము పుట్టుట అసంభవము. విమానములో



విమానము—తొలిమాదిరి

ఉపయోగింపదగ్గ ఇంజను తేలికగా నుండు పెట్రోలు ఇంజ నొక్కటే. 'ఇన్‌టర్నల్ కంబశ్చన్ ఇంజను' (internal-combustion engine) (దానిలోపలి పెట్రోలు అంటుకొని ప్రేలుట

వల్ల యీ ఇంజను పనిచేయును) ఒక్కడు కనిపెట్టినదికాదు. పలువురు పనిచేసి క్రమముగా దానిని లోపరహితముగా చేసిరి. 1794 సంవత్సరమున స్ట్రీట్ అను ఆంగ్లేయుడు మొదటి గాస్ (gas) ఇంజనును నిర్మించెను. కాని 1886 సంవత్సరమున డైమ్లర్ అను జర్మనుడు లోపరహితమగు పెట్రోలు ఇంజను నిర్మించెను. మోటారు బై సికిల్ నడిపించుట కీఇంజను మొదట ఉపయోగించిరి.



నేటి విమానము

తరువాత మోటారుకారు నడుపుట కుపయోగించిరి. 1890 సంవత్సరము తరువాత మోటారుకార్లకు పెట్రోలు యింజను ఉపయోగించుట ఫ్రాంసు, జర్మనీలలో పరిపాటియయ్యెను. గాలిలో ఎగురు యంత్రమును తయారుచేయుట అప్పటికి సాధ్యమయ్యెను. ఇంజనులేని యంత్రములో, గాలిలో తేలియాడుటకు 'గ్లైడింగ్;' (gliding) ప్రయోగములు ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను, అమెరికను శాస్త్రజ్ఞులచే 1850 ప్రాంతమున చేయబడినవి. వీరిలో ప్రముఖుడు లిలింథాల్ అను జర్మనుడు. ఆర్విల్, విల్బర్ రైట్ అను అమెరికను సోదరులిద్దరు 1900 సంవత్సరప్రాంతమున గాలిలో తేలిపోగలిగిరి. 1903 సంవత్సరమున ఒక గ్లైడరు ప్లేనులో పెట్రోలు

యింజనును అమర్చి మొదటితడవ 40 గజముల దూరమును, వారము దినములు గడచినపిమ్మట 270 గజములును వారు పోగలిగిరి. విమానము కనిపెట్టబడిన దన్నమాట.

దాని అభివృద్ధి బహువేగముగా జరిగినది. 1904 సంవత్సరమున రైటుసోదరులు మూడుమైళ్లు విమానములో పోగలిగిరి. 1905 సంవత్సరమున 24 మైళ్లు పోయిరి. కాని ఇం 1914-18 సంవత్సరములలో జరిగిన మొదటి ప్రపంచయుద్ధమందు విమానములు తరుచు వాడబడుచుండెను. బాంబులను వేయుటకుగాను, శత్రుదేశముల చూచి వారి రహస్యముల తెలిసికొనుటకును, శత్రువులకోటలు, బాటలు, కందకములు, ఫొటోగ్రాఫులు తీసికొనుటకును విమానముల నుపయోగించుచుండిరి. ఇంకను బలమైన ఇంజనులను నిర్మించి వానిసహాయముతో విమానములను మిక్కిలి ఎత్తుకు తీసికొనిపోయి, తుపాకిగుండ్లు తగులకుండ చేసికొనుచుండిరి.

యుద్ధానంతరము విమానములతో నద్భుత కార్యములు చేయుదొడగిరి. 1919 సంవత్సరమున, 26½ గంటలలో అట్లాంటిక్ మహాసముద్రముమీదుగా విమానము మొదటిసారి పోయినది. ఆ యేడే ఇద్దరు ఆస్ట్రేలియనులు మొదటితూరి ఇంగ్లాండునుండి ఆస్ట్రేలియాకు విమానములో పోయిరి. 1926 సంవత్సరమున అమెరికాదేశస్థుడు, అడ్మిరల్ బర్డు ఉత్తరధ్రువముపై నెగిరెను. 1929 సంవత్సరమున విమానముపై పోయి దక్షిణధ్రువఖండమందలి హిమావృతప్రదేశముల నన్వేషించుట కతడు పోయెను. దక్షిణధ్రువముపై నప్పుడతడు ఎగిరెను. 1933 సంవత్సరమున రెండువిమానములు ప్రపంచమందలి అత్యున్నతశిఖరమగు ఎవరెస్టు మీదుగా ఎగిరిపోయినవి.

ఇరువది ముప్పది ప్రయాణీకులనుగాని, అంతే బరువుగల సామానులను జాబులనుగాని మోసికొనిపోగలిగిన పెద్దవిమానము లను కట్టుటకు ప్రయోగములుకూడ చేయబడినవి. యూరోపునుండి ఇండియాగుండా ఆస్ట్రేలియాకు, జాబులను ప్రయాణీకులను తీసి



ఎవరెస్టు శిఖరముపై ఎగురుట

కొనిపోవుటకై గొప్ప వాయుప్రయాణశాఖలు (air-services) స్థాపింపబడినవి. యూరోపునుండి ఉత్తరదక్షిణఅమెరికాలకును, అమెరికానుండి పసిఫిక్ మహాసముద్రముమీదుగా ఆసియాకును కూడ వాయుప్రయాణశాఖలు స్థాపింపబడినవి. ఇందులకై సముద్ర విమానములు (sea-planes) (అనగా నీటిమీదకు దిగజారిన విమానములు) ఎక్కువగా వినియోగింపబడుచుండెను. ఇట్టి పెద్ద విమానములు నిర్మించుటవల్ల గాలిలో వేగముగా ప్రయాణము చేయుట సాధ్యమైనది. నేటికాలమందలి యుద్ధములలో నిది పెద్ద

ప్రమాదమును తెచ్చిపెట్టినది. చాలామంది ప్రయాణీకులను, జాబులను తీసికొనిపోవుటకు బదులు యుద్ధకాలమందలి పెద్దపెద్ద బాంబులను తీసికొనిపోవుట కుపయోగింపబడుచుండెను. శత్రువుల కర్మాగారములమీదను, రైల్వేలమీదను, నౌకాశ్రయముల మీదను, నగరములమీదను ఆ బాంబులనువేసి అపారనష్టమును కలిగించుచుండెను.

[మూలప్రశ్న 66 : మనకాలమందు చేసిన అతినూతన సృష్టము లేవి?]

§66. మొన్నమొన్ననే సృష్టముచేయబడిన అత్యద్భుతసాధనము రేడియో. గుండీ (button) స్విచ్చి (switch) చేసి ముల్లు



మార్కొనీ రేడియోద్వారా మాట్లాడుట

త్రిప్పినచో ప్రపంచమందన్ని ప్రాంతములనుండి వచ్చు వాక్కులను నీవు వినవచ్చును. దీనిని లోపరహితముగా చేసినవాడు ఇటలీదేశస్థు

డగు మార్కొనీ.

మార్కొనీ 1874 సంవత్సరమున జన్మించెను. 21-వ యేట అతడొక వైర్లెస్ ట్రాన్స్మిటింగు ఉపకరణము (wireless transmitting apparatus) ను సృష్టించెను. మరుసటిసంవత్సర మతడు ఇంగ్లాండుకువెళ్లి అక్కడనుండి పదిమైళ్లదూరము వైర్లెసు వార్తల పంపించి తిరిగి వార్తల నందుకొనెను.

1898 సంవత్సరమున ఇంగ్లాండునుండి ఫ్రాంసుకు వైర్లెసు వార్తలు పంపబడెను. 1901 సంవత్సరమున ఇంగ్లాండు అమెరికాల మధ్య వైర్లెసు వార్తలు పంపబడి అందుకోబడినవి. ఇదిజరిగిన తరువాత వైర్లెసువల్ల ఎంత ప్రయోజన మున్నదో ప్రజలు తెలిసికొనిరి.

మొదటి ప్రపంచయుద్ధములో వైర్లెసునుకూడ వినియోగములో పెట్టిరి. యుద్ధానంతరము 1919 సంవత్సరమున మార్కొనీ ఇంగ్లాండులో చెల్మ్జుఫర్డువద్ద ప్రపంచములోని మొదటి బ్రాడ్కాస్టు చేయు స్టేషను (broadcasting station) స్థాపించెను. 1937 సంవత్సరమున నతడు మరణించెను.

మన విశ్వమున కనిపెట్టవలసిన యద్భుతములకు అంతము లేదు. మేధావులు పెక్కు రట్టికార్యములందు నిమగ్నులై యున్నారు. సముద్రతరంగముల శక్తిని వినియోగించుటకు మార్గము లింకను కనిపెట్టబడలేదు. పెద్దగాజుకటకములతో (lenses) సూర్యుని ఉష్ణమును కేంద్రీకరింపజేసి దానిని ముందుముందు వినియోగింతురేమో!

1919 సంవత్సరమున, కేంబ్రిడ్జిలో, రూథర్ ఫర్డు ప్రభువు పరమాణువు (atom) భేదించగలిగినాడు. అణువులను భేదించి తదంతర్భాగముల బంధించు విద్యుత్తును విడుదలచేసిన మానవుల

ఉపయోగమునకు క్రొత్త శక్తియొకటి చిక్కుచున్నది. నేడు మనము భూగర్భమునుండి తీసి ఉపయోగించుచున్న బొగ్గును, పెట్రోలును కొంతకాలమునకు దొరకకపోవును కాబట్టి ఇట్టి శక్తి అవసరమగుచున్నది.

భీతావహమగు నీ క్రొత్తశక్తిని వినాశన కార్యముల కెట్లుప యోగింపవచ్చునో ఈ మధ్యనే కనిపెట్టిరి. ఆగష్టు 1945 లో జపానునగరములమీద రెండు ఆటంబాంబులను వేయుటవల్ల జపానుతోడి యుద్ధము త్వరలో ముగియవలసి వచ్చినది. ప్రబల మగు నీ నూతనశక్తిని మంచికిని ఉపయోగించవచ్చును, చెడ్డకును ఉపయోగించవచ్చును. దాని ఉపయోగమును హద్దులో బెట్టుట అవసరమని అన్నిజాతులవారును గ్రహించిరి. అందుకై అమెరికా అధ్యక్షుడగు ట్రూమన్, గ్రేటుబ్రిటన్ ప్రధానియగు అట్లీ, రష్యానియంతయగు మార్షల్ స్టాలిన్ 1945 సంవత్సరాంతమున సమావేశమై మానవలోక శ్రేయస్సున కనుగుణమగుటకు మాత్రమే యీ నూతనశక్తి నుపయోగించుటకు మార్గముల నన్వే షించుటకు చర్చలుజరిపిరి. ఇట్లు చేయకున్నచో నేటినాగరీకతయే త్రుటిలో నాశమగును.

## అభ్యాసములు

1. లియొనార్డో డావించీ విమానమునుచేయ ప్రయత్నించెను కాని విఫల మనోరథు డయ్యెను. అతని కాలమునకు తరువాత ఏయే సృష్టములు చేయుట వల్ల నేటి విమానమును నిర్మించుటకును, అందు సురక్షితముగా పోవుటకును సాధ్యమయ్యెను? వానిని జాబితాగా వ్రాయుము.

2. రేడియం అన నేమి? దాని నెందు కుపయోగింతురు?

3. లోకమునకు పనికివచ్చునట్టియు, ఇంకను సృష్టము కానట్టియు నూతన

విషయములను కొన్నింటిని వ్రాయుము. ఈ గ్రంథమునం దుదహరించినవిగాక క్రొత్తవానిని ఊహించి వ్రాయుము.

4. వాయు యానమును కనిపెట్టుటకు తోడ్పడిన 'వారినిగురించి మఱికొన్ని పుస్తకములు చదివి, గాలిలో ఎగురుటకు మానవుడు చేసిన ప్రయత్నములగూర్చి సంగ్రహముగా వ్రాయుము.

# 16. నానాజాతి సమితి (League of Nations)

## దాని పని, దాని విఫలత

### 34 పాఠము: విల్సను అధ్యక్షుడు, ముస్సలీనీ—ఫాసిజం (Fascism)

[మూలప్రశ్న 67: నానాజాతిసమితి యన నేమి? అది చేసినపని యేమి?]

§67. మొదటి ప్రపంచయుద్ధమునందు సుమారు 70 లక్షలమంది రణభూమిలో ప్రాణములు వదలిరి. లక్షలకొద్ది జనులు గాయముల తోను రోగములతోను బాధపడిరి.

భయంకరమగు నిట్టి ప్రాణనష్టమును, ఆరోగ్యవినాశనమును చూచి భావికాలమున యుద్ధములు లేకుండజేయుట సాధ్యము కాదా యని పలువురు తర్కింపజొచ్చిరి. యుద్ధములు రాకుండ నివారించవలెనని ప్రయత్నించిన వారిలో ప్రముఖుడు అమెరికా అధ్యక్షుడగు వుడ్రో విల్‌సన్. యుద్ధానంతరము, సంధిషరతులను నిర్ణయించుటకు పారిస్‌లో ఒకసభ కూడెను. అప్పుడు విల్‌సన్ అధ్యక్షుడు నానాజాతిసమితి అవసరమనిచూపు తన ప్రణాళికను సమావేశమున కందిచ్చెను.

నానాజాతిసమితిని చూచి, అది పనికిమాలినసంస్థ యని, నవ్వుట

ఆచారమైనది. రెండవ ప్రపంచయుద్ధము నది యాపలేకపోయిన దన్నమాట నిజమే కాని అదిమాత్రము పనికిమాలినసంస్థ కాదు.



విల్సన్ అధ్యక్షుడు

యుద్ధముల నాపుటకు యుద్ధ కారణముల తొలగించవలెను. అది సులభము కాదు.

అయితే నానా జాతి సమితి చేసిన మంచి కార్యము లేమి? అది చేసిన మొదటిపని వివిధజాతుల ప్రతినిధులను, తమతమ సమస్యలను, ఇబ్బందులను చర్చించుకొనుటకు ఒక చోట సమావేశపరచినది. సమితియొక్క అంతర్జాతీయ లేబరుఆఫీసుద్వారా (international labour office) కార్మికుల పరిస్థితులు చక్కజేయుటకును ఒక దేశమునుండి వేరొక దేశమునకు వ్యాధులు వ్యాపింపకుండ చేయుటకును ఒడంబడికలు జరిగినవి. నానాజాతిసమితిలో చేరిన జాతులు, శాంతముగా తమ వివాదములు పరిష్కరించుకొనుటకు వీలున్నదేమో ముందుగా ఆలోచించనిదే, యుద్ధములోనికి దిగమని మాటయిచ్చిరి.

సమితి దుర్బలత్వ మెందున్నదనగా—తమ వివాదములు శాంతముగా పరిష్కరించుకొనునట్లు జాతులను నిర్బంధించుటకు దానికి

అధికారములేదు. సమితిలో సభ్యత్వమున్న ప్రతిజాతియు తన సమస్యలు తానే పరిష్కరించుకొన నిశ్చయించుకొన్నది. కాని ఇతరులు పరిష్కరించుట కొప్పుకొనలేదు.

దుర్బలత్వమునకు వేరొక కారణము అన్ని జాతులను అందు చేర్చకుండుట. అమెరికా అధ్యక్షుడగు విల్సన్ దాని స్థాపనకు కారకుడైనప్పటికిని అమెరికా దేశము సమితిలో చేరలేదు. చాల కాలమువరకు రష్యాను దానిలో చేర్చలేదు. యుద్ధము ముగిసిన ఎంతకాలమునకోగాని జర్మనీని సమితిలో చేరనీయలేదు. సమితి తీర్మానములు వచ్చినచో జాతులు రాజీనామాయిచ్చి సభ్యత్వ మును చాలించుకోవచ్చును. ఇట్లు జరుగుటకు వీలున్నదని జాతులు కనిపెట్టినప్పుడు దాని తీర్మానములను వారు లెక్కచేయనేలేదు. ఇట్లుచేసిన మొదటిజాతి జపాను, తరువాత ముస్సలీని, కడపట హిట్లరు.

[మూలప్రశ్న 68 : ముస్సలీనీ ఎట్లు అధికారమునకు వచ్చెను ? అతడు చేసిన పనులేమి ?]

§68. లిఅనార్డో డావించి కాలమున ఇటలీ ఎన్నో చిన్నచిన్న స్వతంత్రరాష్ట్రములుగా విభజింపబడియుండెను. నెపోలియన్ కాల మునకు తరువాతనే ఇటలీయంతయు ఒక్కరాజు పరిపాలనక్రిందికి వచ్చెను. ఇద్దరు మహనీయులగు ఇటాలియనుల కృషివలన యిది సిద్ధించెను. వారు మాట్సినీ, (Mazzini) గరిబాల్డీ (Garibaldi) అను పేళ్లుగలవారు. సుమారు 50 సంవత్సరముల కాలము పరి స్థితులు చక్కగా నుండెను. అప్పుడు మొదటి ప్రపంచయుద్ధము తటస్థించెను. ఫ్రాంసు, బ్రిటిషుసామ్రాజ్యముల పక్షమున, జర్మనీ ఆస్ట్రియాలకు వ్యతిరేకముగా ఇటలీ యుద్ధములో చేరెను. జర్మను

ఆస్ట్రియన్ సైన్యములు ఉత్తరఇటలీ దండెత్తి అచ్చట ఎక్కువ నష్టము కలిగించెను. యుద్ధము ముగిసినపిమ్మట ఇటలీ పూర్వము కన్న బీదదేశ మాయెను. ఇటలీని భాగ్యవంతమగు దేశముగాను శక్తివంతమగు దేశముగాను చేయుగల నాయకుడుండిన బాగుండు నని ప్రజలు ఉవ్విళ్లూరిరి. అట్లు చేసెదనని ప్రజలకు చెప్పినవాడు బెనిటో ముస్సలీని. అతడు 1922 నుండి 1943 వరకు ఇటలీని పాలించెను.

ముస్సలీని కొన్ని విషయములలో ఇటలీని వృద్ధిలోనికి దెచ్చెను. చక్కని రోడ్లు వేయించెను. చక్కని భవనముల కట్టించెను. నీరు నిలువయుండు తేమప్రదేశములనుండి నీరు తీసివేయించి అచ్చట ఎక్కువ పంటలను పండించెను. ఇటాలియన్ యువకులను యుద్ధమునకు తయారుచేసెను. తనసైన్యమును, విమానబలమును సిద్ధముకాగానే సామ్రాజ్యమును కూడ జయించుటకు బయలు దేరెను. నానాజాతిసమితి వద్దన్నను అతడు లెక్కపెట్టలేదు. అతడు అబిసీనియా పై దాడివెడలి జయించెను. పిమ్మట ఇంకొక బలహీన మగు దేశము బాల్కను ద్వీపకల్పమునందున్న ఆల్బేనియాపై దాడి వెడలి దానినికూడ జయించెను.

ముస్సలీని రాజ్యాంగతంత్రమునకు ఫాసిజం అని పేరు. హిట్లరు నాజిజం (Nazism) వంటిదే. హిట్లరు జర్మనీకొరకు ప్రపంచమును జయించదలచినప్పుడు ముస్సలీనీ అతని స్నేహితుడును సహాయ కారియు నయ్యెను. ఫాసిజం, నాజీజంలలో ముఖ్యాభిప్రాయము— జాతి సర్వశక్తివంతమని, ప్రజలసౌఖ్యముకన్న కూడ జాతి ఎక్కువ ముఖ్యమైనది. అవసరమైనప్పుడు, జాతి శక్తివంతమగుటకు ప్రజలకు స్వాతంత్ర్యములేకుండ చేయవచ్చును. ప్రభుత్వ

మును, తన్నాయకులను ఎవ్వరును విమర్శించరాదు; ఎదిరించ రాదు. ప్రభుత్వచట్టములకు లోబడి ఎవ్వరైనను వ్యాపారమును సొంతముగా చేసికొనవచ్చును. కాని ప్రభుత్వము చేయుమన్న వస్తువులను చేయుచు అమ్ముమన్న వస్తువుల నమ్ముచుండవలెను. చివరకు 1945 సంవత్సరమున జర్మని పరాజయ మందుటకు కొంచెము ముందు ముస్సలీనీ ఉత్తర ఇటలీలో బంధితుడై ఇటాలియనుల వల్లనే చంపబడెను.

## 35 పాఠము : జపాను

[మూలప్రశ్న 69: ఏయే విధములుగా జపాను మార్పునందెను ? ఏ విషయములలో మార్పు నందలేదు ?]

§69. జపానువారొక సనాతనజాతి. నూరు సంవత్సరముల క్రితము వరకు చీనా జపాను దేశములు, పాశ్చాత్య ప్రపంచముతో సంబంధము లేకుండ నుండెను. తమ రాజులపరిపాలనక్రింద తమ కిష్టము వచ్చిన విధముగా తమ జీవితముల తాము గడపుకొనుచుండిరి. యూరోపియనులు తేయాకు, పట్టు మున్నగు వస్తువుల వ్యాపారము జపానువారితో కొంచెముగా చేయుచుండిరి. 1840 సంవత్సరమున యూరోపియన్ జాతులుకొన్ని, చీనాదేశస్థులను బలవంతముచేసి వారి రేవుపట్టణములు కొన్నింటిలో పాశ్చాత్యుల యోడలు ప్రవేశించుటకు వీలు కల్పించుకొనిరి. మరియు వర్తక స్థానములు స్థాపించుకొనుటకు తమకొరకై కొంతభూమిని వదలు కొమ్మని కూడ వారిని నిర్బంధముచేసిరి. దీనికి ఫలితముగానే బ్రిటిషువారికి హాంకాంగు, జర్మనులకు కియోచౌ, రష్యనులకు పోర్టుఆర్థరు చిక్కినవి.

ఈలోగా జపానులో గొప్పమార్పులు కలిగెను. నూరుసంవత్సరముల క్రితమువరకు జపాను ఒకప్రధానమంత్రి పరిపాలనములో నుండెను. గొప్పపలుకుబడిగల యొకే కుటుంబమునుండి వంశపారంపర్యముగ ప్రధానమంత్రులు వత్తురు. రాజు నామమాత్రుడే. అతనికి అధికారములేదు. 1868 సంవత్సరమున సర్వాధికారములును జపానురాజు (మికాడో అందురు) వశమయ్యెను. మికాడో మట్సుహిటో, రాజుగా నున్నకాలమున జపాను నేటికాలమందలి ఒక జాతివంటి జాతియగుటకు పూనుకొనెను.

ఇంత కొద్దికాలములో ఇంతపూర్తిగా ఏదేశమును మార్పు చెందలేదు. రైల్వేలు, టెలిగ్రాఫులు నిర్మించుటకు ఆంగ్లేయులు నియమింపబడిరి. పోస్టల్ శాఖ, వ్యవసాయశాఖ ఉన్నతవిద్య ఎట్లుండవలెనో నిర్ణయించి కొనసాగించినది అమెరికనులు. సైన్యమునకు శిక్షణ ఫ్రెంచివారిచ్చిరి. నూతనశాసనపద్ధతినికూడ ఫ్రెంచివారు ప్రవేశపెట్టిరి. వైద్యశాఖను జర్మనులు క్రమపద్ధతిని ఏర్పాటుచేసిరి. ఉద్యోగస్తులందరు యూరోపియను దుస్తులు ధరించవలెననికూడ ఉత్తరువులు జారీచేయబడినవి. ప్రాతకాలపు ఆచారములలో దగుల్కొన్న జపాను 25 సంవత్సగములలో సరిక్రొత్తదేశమై వెలిసినది.

కాని జపాను, ప్రజాస్వామికపరిపాలనమును నెలకొల్పలేదు. దానికొక పార్లమెంటు ఉండెనుగాని, నేటి ప్రజాస్వామికరాజ్యములలో నున్నట్లు అది దేశమును పరిపాలించలేదు. దాని నిబంధనలకు రాజు బద్ధుడుకాడు. మికాడోను ప్రజలు భగవంతునివలె చూచుచుండిరి. సామాన్యవ్యవహారములలో నాతడు పాల్గొనడు. ఉత్తరువులన్నియు మికాడో పేరుతోనే మంత్రులు జారీచేయుచుండిరి.

కాని సైన్యనాయకులును నౌకాబలనాయకులును మాత్రమే నిజమగు దేశనాయకులుగా నుండిరి.

[మూలప్రశ్న 70 : తూర్పుసామ్రాజ్యము సంపాదించుటకు జపా నెట్లు ప్రయత్నించెను?]

§70. 1898 సంవత్సరమునుండియు జపానీయులు పాశ్చాత్యజాతులనుండి సమస్తమును నేర్చుకొనిరి. బ్రిటిషువారినుండి నౌకానిర్మాణమును నేర్చుకొనిరి. అమెరికనులనుండి మోటారుకార్లు చేయుట నేర్చుకొనిరి. రసాయనద్రవ్యములను (chemicals) ఔషధములను తయారుచేయుట ఫ్రెంచివారినుండియు, జర్మనులనుండియు నేర్చుకొనిరి. ఏయే దేశములనుండి క్రొత్తవిషయములు నేర్చుకొనుటకు వీలున్నదో ఆయాదేశములకు తమ విద్యార్థులను పంపించిరి. వారి నగరములందు నేడు అమెరికాలోవలెనే ఉన్నతసౌధములు కలవు. రేడియోలో వినిపించు వారిసంగీతము ప్రాక్పశ్చిమసంగీతసరణుల వింతమిశ్రమము.

జపానునాయకులు ప్రజలహృదయములలో దిగ్విజయాభిలాషలు మొలకలెత్తించిరి. కాన జపాను శూరజాతియై దిగ్విజయముచేయ నుత్సహించెను.

చీనాదేశీయులనుండి 1910 సంవత్సరములో ఫార్మోజాద్వీపమును, కొరియాదేశమును గ్రహించుట మొదలుగా జపానుల విజయయాత్ర ప్రారంభమయ్యెను. ఇరువైసంవత్సరములైనపిమ్మట చీనాదేశమున కుత్తరభాగమైన మంచూరియాపై జపానీయులు దండయాత్ర నడిపించి దానిని జయించిరి. నానాజాతిసమితి అట్లు చేయుట కూడదన్నప్పుడు జపాను రాజీనామాపెట్టి సభ్యత్వమును వదులుకొనెను. 1936 సంవత్సరమున చీనాదేశము నంతయు

జయించుటకు ప్లానుకొనెను.

రెండవ ప్రపంచయుద్ధము ప్రారంభమైనపుడు జపానుకు తగిన అవకాశము చిక్కెను. జర్మనుసైన్యము మిక్కిలి బలముగా నుండెను. అమెరికా దేశము సహాయము చేసినప్పటికిని బ్రిటిషువారు ఓడిపోవుట నిశ్చయమని తోచుచుండెను. కాబట్టి హఠాత్తుగా



విమాన వాహిని

యుద్ధము ప్రకటించకుండనే హొనొలులు వద్దనున్న అమెరికన్ నౌకాబలముపై జపానీయులు తీవ్రమగుదాడి జరిపిరి. పసిఫిక్ మహాసముద్రములోని హవాయిద్వీపమువద్దనున్న గొప్పఅమెరికన్ నౌకాశ్రయము హొనొలులు. జపానుదాడివల్ల అమెరికన్ యుద్ధ నావలు పెక్కులు మునిగిపోయెను. కొన్ని దెబ్బతినెను. పిమ్మట

జపానుసేనలు ఫిలిప్పైనుదీవులమీదకును, దక్షిణతూర్పుఇండియా దీవులమీదకును, మలయాద్వీపకల్పముమీదకును దండెత్తెను. హాంకాంగు, సింగపూరులవద్దనున్న బ్రిటిషువారి గొప్ప నౌకాశ్రయములను పిమ్మట వారు స్వాధీనము చేసికొనిరి. బర్మాపై దండెత్తి రంగూన్, మాండలేపట్టణముల వశపరచుకొనిరి. ఇండియా ఆస్ట్రేలియా దేశములమీదకు వారు త్వరలో దండయాత్ర సాగింతురనుట నిశ్చయ మనిపించినది. కాని అమెరికన్ నౌకాబలములో విమానములను మోసికొనిపోవు యుద్ధనావలు పెక్కులుండెను. అమెరికనుల విమానములును, జలాంతర్గాములును జపాను యుద్ధనావలకును, సైనికులను యుద్ధసామగ్రిని తీసికొనిపోవు నావలకును పెద్దనష్టము కలుగజేయుచుండెను. పెక్కుదూరప్రదేశములలో నున్న తమ సేనలకు ఆహారమును యుద్ధసామగ్రిని పంపుట జపానీయులకు కష్టమైనది. జపానువారు స్వాధీనముచేసికొన్న ద్వీపములన్నియు అమెరికనులును ఆస్ట్రేలియనులును తిరిగి వారినుండి స్వాధీనము చేసికొనిరి.

1944 సంవత్సరమున అస్సాంమీద దండయాత్రచేయుటకు జపానీయులు పెద్ద ప్రయత్నము చేసిరి. బ్రిటిషుసేనలు, ఇండియన్ సేనలు, బ్రిటిషు, అమెరికన్, ఇండియనుల వాయుబలములు, రాయల్ ఇండియన్ నౌకాబలము ఆ ప్రయత్నమును జరుగనీయలేదు. పిమ్మట బ్రిటిషువారును ఇండియనులును కలిసి బర్మాను తిరిగి జయించుటకు పూనుకొనిరి.

1945 ఏప్రియల్ మాసమున మాండలే తిరిగి జయింపబడెను. మరుసటినెల రంగూన్ వశమయ్యెను. అమెరికనులుకూడ ఫిలిప్పైను దీవులను తిరిగి వశపరచుకొనిరి.

నేటి యుద్ధములు ముఖ్యముగా యంత్రసహాయముతో పోరాడబడుచున్నవి. తుపాకులు, టాంకులు, మోటారులారీలు, విమానములు, యుద్ధనావలు—ఇవి కొన్నియంత్రములు. ఈ యంత్రములను తయారుచేయు ఫ్యాక్టరీలను ధ్వంసముచేసినచో యుద్ధము సాగనేరదు. విమానములకును, మోటార్లకును పెట్రోలుచమురు అమితముగా కావలసియున్నది. జపానుకు పెట్రోలు నూతులు లేవు. కావలసిన పెట్రోలంతయును నావలలో తెచ్చుకోవలెను. కాబట్టి జపానులోని ఫ్యాక్టరీలను జపానువారి నావలను బాంబు చేయుటవల్ల యుద్ధమును సాగించుట జపానుకు దుర్ఘటమాయెను.

1945 ఆగష్టునెలలో రెండు ఆటంబాంబులు జపానునగరములపై అమెరికనులు పడవేసిరి. రష్యా జపానుపై యుద్ధము ప్రకటించెను. జపానుచక్రవర్తి లోబడుట కొప్పుకొనెను. యుద్ధమప్పుడు ముగిసినది. ప్రపంచమందలి ప్రాచ్యభాగమునకు పరిపాలకులు కాగోరిన జపానీయులు విఫలమనోరథులైరి.

## అభ్యాసములు

1. నానాజాతిసమితి యన నేమి? పనికివచ్చు కార్యము లదియేమి చేసినది? ఎందు విఫలత్వ మందినది? ఏల?

2. ముస్సోలీని అధికారమున కెట్లు వచ్చెను? అతని ఆశయము లేమి? అతని కేమి సంభవించినది?

3. ఇతరజాతులకంటె జపాను ఏయే విషయములలో భిన్నముగ నుండెను? జపాను అభివృద్ధిపతనములనుబట్టి మన మేమి నేర్చుకొనవచ్చును?

4. ప్రాచ్యదేశమునకు పరిపాలకులు కావలెనన్న జపానువారి ప్రయత్నము భగ్నమగుటకు కారణమేమి?

# 17. రష్యను విప్లవము

## 36 పాఠము: లెనిన్; కారల్‌మార్క్సు అభిప్రాయములు

[మూలప్రశ్న 71: మొదటి ప్రపంచయుద్ధమైన తర్వాత రష్యాలో నేమి సంభవించెను?]

§71. 1917 సంవత్సరమున రష్యాలో ఫ్రెంచివిప్లవముకన్న తీవ్రతరమైన విప్లవ మొకటి సంభవించెను.

ఘనుడగు పీటరుతరువాత రష్యా 1917 సంవత్సరమువరకు జార్‌లచే పరిపాలింపబడెను. అందు కొందరు జార్లు మంచి వారు. కొందరు చెడ్డవారు. మరికొందరు రష్యా యభివృద్ధికి తోడ్పడిరి. 1900 సంవత్సరమునాటికి రష్యనుసామ్రాజ్యము ఇండియా చీనాల పొలిమేరలవరకును పసిఫిక్ మహాసముద్రమువర కును వ్యాపించెను. ప్రపంచమందెల్ల గొప్పదియగు అవిచ్ఛిన్న భూసామ్రాజ్య మది. పశ్చిమరష్యా పారిశ్రామికము కాజొచ్చెను. కాని ఫ్యాక్టరీలనుండి వచ్చు లాభములన్నియు భాగ్యవంతులకే పోవుచుండెను. ప్రజాసామాన్యము దారిద్ర్యమున మ్రగ్గుచుండిరి. ఆస్ట్రియా జర్మనీలదాడినుండి సెర్బియాను రక్షించుటకు మొదటి ప్రపంచయుద్ధములోనికి రష్యా దిగినప్పుడు రష్యనుసైనికులసంఖ్య మిక్కిలి ఎక్కువగా నున్నను వారికి చాలినన్ని ఆయుధములు లేకుండెను. యుద్ధసామగ్రివిషయమున ఎట్టిలోటునులేని జర్మను సైన్యము తూర్పుగా పోవు రష్యనుల నాపివైచెను. 1917 సంవత్సరమున రష్యనుసైన్యము తిరుగుబాటు చూపెను. సైనికులు యుద్ధము చేయుమనిరి. తమ్ము ఇండ్లకు పంపివేయుమనిరి. కాదన్న ఉద్యోగస్థులను చంపివేసిరి.

ఈ తిరుగుబాటు త్వరలో తీవ్రమయ్యెను. రష్యనుసైనికులలో పలువురు బలవంతముమీద యుద్ధములో చేరిన కృషికులును పాలికాపులును (farm labourers) యుద్ధానంతర మింటికి పోయిన వారికి కుడువ కూడు లేదు. భాగ్యవంతులగు భూస్వాములనుండి భూమిని ధనమును తీసికొని తమ కిచ్చెదమని వాగ్దానముచేయు వారిమాటలు వా రాత్రముగా వినుచుండిరి. ఇట్టి వాగ్దానములు చేసినవారిని బోల్షివిక్కు (Bolsheviks) లందురు. ఫ్యాక్టరీలలో పనిచేయు కార్మికులయొక్కయు, తిరుగుబాటుచేసిన సైనికుల యొక్కయు, నావికులయొక్కయు సహాయముతో బోల్షివిక్కులు జార్ ప్రభుత్వమును కూలద్రోసి రష్యాకు తామే పరిపాలకులైరి. సకుటుంబముగా జార్ హత్య చేయబడెను.

నూతన రష్యనుప్రభుత్వమునకు నాయకుడు లెనిన్ అను పేరు గల అసాధారణపురుషుడు. ఎన్నడును ఏమానవుడును అంతటి బ్రహ్మాండమగు బాధ్యత వహించలేదు. 1918 సంవత్సరమున సోవియట్ రష్యాలో జనసంఖ్య 142, 579, 900 జనులు. దేశమంతయు అల్లకల్లోలముగా నుండెను. 1918 సంవత్సరము మార్చి నెలలో సంధి జరిగెను. పంటలు పండింపుటకు, వ్యవసాయదా



లెనిన్

ఖింటికి పోవ్మన్నచో వారు పోవునట్లు లేదు. కాబట్టి ఎవరు వ్యవసాయముచేసిన భూమి వారిదే నని వ్యవసాయదారులకు చెప్ప వలసివచ్చెను. వారు వెళ్లి వ్యవసాయము చేసిరి. చాలాచోట్ల వెనుకటి భూస్వాములు హత్యచేయబడిరి. కొందరు పారిపోయిరి.

పిమ్మట ఫ్యాక్టరీలు ఒకదాని వెనుక నొకటి పని ప్రారంభించెను. రష్యనుప్రభుత్వమే వాటి యాజమాన్యమును వహించెను. సమస్త విషయములును గవర్నమెంటు స్వాధీనములో నుండవలయు ననియు, ఉత్పత్తిపరిశ్రమలు అన్నియు గవర్నమెంటు ఆస్తిగా నుండవలయుననియు లెనిన్ ఉద్దేశము. దీనినే సామ్యపద్ధతి (Socialism) యందురు. ఒక పెద్ద దేశమును సామ్యపద్ధతి సూత్ర ముల ననుసరించి పాలించ ప్రయత్నించిన మొదటివాడు లెనిన్. ప్రపంచభావికి ఈ ప్రయత్నము ప్రయోజనకారిగా నుండును.

కారల్‌మార్క్స అను జర్మనుతత్వజ్ఞుని గ్రంథములనుండి లెనిన్ తన యభిప్రాయములను గ్రహించెను.

[మూలప్రశ్న 72 : పారిశ్రామిక విప్లవమువల్ల ధనవంతులకును బీదవారికిని మధ్యనుండు భేదము పెరుగుటకు కారణమేమి?]

§72. 1818 నుండి 1883 సంవత్సరము వరకు మార్క్స జీవించెను. ఆ కాలముననే పాశ్చాత్యదేశములందెల్ల క్రొత్తగా ఫ్యాక్టరీలు నిర్మింపదొడగిరి. పారిశ్రామిక విప్లవము ఉచ్ఛస్థితిలో నుండెను. పారిశ్రామిక విప్లవమువల్లను, ఫ్యాక్టరీపద్ధతివల్లను జనుల జీవితములలో రానున్న మార్పుల నాతడు 'కాపిటల్' అను గ్రంథమున విశదముగా సూచించెను. ఆ మార్పులు కొన్ని అప్పుడే పొడచూపుచుండెను. అందొక్కటి పెద్దఫ్యాక్టరీలు నిర్మించుటవలన ఉద్యోపరిశ్రమలు నశించుట.

నీకొక చిన్న ప్రత్తిమిల్లు ఉన్నదనుకొందము. దానికి యజమాని నీవే. పెద్దఫ్యాక్టరీలలోవలె నీవు చౌకగా వస్త్రములు తయారు చేయజాలకుందువు. అందుకు కారణము నీవు అంత పెద్ద మొత్తముగా గుడ్డలు తయారుచేయలేకుండుటే. కాబట్టి దానిని నీవొక కంపెనీగాచేసి ఒకపెద్ద ఫ్యాక్టరీ పెట్టుకొన నిశ్చయింతువు. నీయు ఫ్యాక్టరీకి ధనముకావలెను. కాబట్టి ఇతరులను నీతో చేరవలెను కంపెనీలో వాటాలు తీసికొనమనియు నీవు చెప్పవలసివచ్చును. రీలలో కింత చెప్పిన వారు ధనమునిచ్చి కొన్నివాటాలు కొందురు. ఆ ధనికుల డబ్బుతో నీవు పెద్దఫ్యాక్టరీ కట్టగలుగుదువు; మంచి యంత్రములు తెప్పించ గలుగుదువు; ఎక్కువ లాభమును సంపాదించ గలుగుదువు. కాని వాటాలు కొన్నవారికి కొంత లాభము పంచిపెట్టవలెను. వారేమియు పనిచేయలేకపోయినను, వారిడబ్బు నీవుపయోగించుకొంటివి కాబట్టి వారు వడ్డీనాసింతురు. వ్యాపారము పెరిగినకొలదు, అంతపనియు నీవు చేసికొనుటకు బదులు జీతములిచ్చి మానేజర్లను ప్రవీణులను (experts) పెట్టుకొనుట నీకు సులభముగా నుండును పెద్ద వ్యాపారసంస్థలో, పెట్టుబడిదార్లయిన వాటాదారులు ఎట్టి పనియు చేయవలసిన అవసరముండదు. ఒకనికి అనేక కంపెనీలలో చాలా వాటాలుండుట తటస్థించినచో ప్రతి కంపెనీయును అతనికి సాలీనా లాభములు (డివిడెండ్లు) పంచిపెట్టును. ఎట్టిపనియు చేయ నవసరములేకుండ నతడు జీవితయాత్ర గడపును. ఈ విధముగానే ఒక పెద్దభూస్వామి తన భూములను చిన్న వ్యవసాయదారులకు కౌలుకు ఇచ్చియో, నివేశన స్థలములను ఇండ్లు కట్టుకొనువారి కిచ్చియో, ఫ్యాక్టరీగాని రైల్వేగాని నిర్మించదలచుకొన్న ఒక కంపెనీకి ఇచ్చియో ధనము సంపాదించవచ్చును. నిలువచేసికొన్న ధన

ముతో జను లెక్కువధనము సంపాదించవచ్చును. ఇట్టి నిలువ ధనమునకు మనమిచ్చు పేరు—పెట్టుబడి (capital). పెట్టుబడి యనగా ఏరూపముగానైనను నిలువజేసికొన్న ద్రవ్యము. అది ధనము వనెనచ్చును—కంపెనీలలో వాటాలు తీసికొని లాభములు పొందుట పియోగించు ధనము. అది నీకున్న ఫ్యాక్టరీ కావచ్చును. అది రష్యన్ను ఇండ్లు కావచ్చును. అది నీకున్న భూమి కావచ్చును. ఈ విషయమని నీవే దున్నుకొనిగాని ఇతరులకు కౌలుకిచ్చిగాని ధనము నరియు, ంచుకొందువు.

నుండవల.

## 37 పాఠము : నేటి సోవియట్ రష్యా

(Socialism) [ప్రశ్న 73 : పారిశ్రామిక విప్లవమునకు ఫలముగా ఎట్టిమార్పులు
ములనన కలుగునని మార్క్స తలచెను?]

ప్రపంచ ఫ్యాక్టరీపద్ధతి వ్యాపించుటవల్లను, వస్తువుల నుత్పత్తిచేయు కార్ఖానా పోటీలు పెరుగుటవల్లను ప్రజలు రెండు తెగలుగా విడి తెనిన్ దురని కారల్ మార్క్స తనగ్రంథమున సూచించెను. మొదటి గ—ద్రవ్యముండి పనిచేయకుండ బ్రదుకువారు. రెండవ తెగ—స్వసామర్థ్యమువల్ల కష్టపడి పనిచేసి బ్రతుకువారు. మొదటి తెగను పెట్టుబడిదార్లనియును, రెండవ తెగను కార్మికులనియు మనము పిలువవచ్చును. ఇది నిజమేకాని మార్క్స దీనిని మించిచెప్పెను. బీదవారికిని భాగ్యవంతులకును మధ్యనున్న భేదము పెరిగిపోయి విమఖించును. భాగ్యవంతులు నానాటికి ఎక్కువ భాగ్యవంతులగు దురు. బీదవారు నానాటికి మిక్కిలి బీదవారగుదురు. వారికి సౌఖ్య ముండదు. చివరకు—మార్క్స చెప్పినమాట—బీదవారగు కార్మి కులకు మార్గాంతరముండదు. పెట్టుబడిదార్ల పెట్టుబడిని తీసి కొనుట ఒక్కటే వారికున్నమార్గము. పెట్టుబడిదార్ల పోరాటము

లేకుండ తమ ధనమును వదిలిపెట్టరు. కాబట్టి తీవ్రమగు విప్లవము సంభవించును.

విప్లవానంతరము కార్మికులు భాగ్యవంతులనుండి తీసికొన్న ధనము నేమిచేయుదురు? తమలో దాము ఆ ధనమును పంచుకొని వారుకూడ చిన్న పెట్టుబడిదార్లగుదురా? అయినచో వెనుక జరిగి నట్లే మరల జరుగును. మార్క్సు అట్లు జరుగదన్నాడు. ప్రభుత్వమే ఆ ద్రవ్యమున కంతకును, (భూమి, గనులు, ఫ్యాక్టరీలు, ఇండ్లు, మొదలైనవి) యజమానులై యుండవలెను. ఇప్పుడు ప్రభుత్వము కలెక్టర్లకు, జడ్జీలకు, పోలీసువారికి, సైనికులకు, పోస్టాఫీసు ఉద్యోగస్థులకు ఏవిధముగా జీతములు, కూలి ఇచ్చుచున్నదో ఆ విధముగానే కార్మికులచే నవసరమగు పనులుచేయించి కూలి నీయవలెను. ప్రతివాడును జీవనాధారమునకై పనిచేయవలసియుండును గాన, వాడు సుఖముగా జీవించుటకు కావలసినంత సంపాదించుకోగలిగి యుండును. దీనినే సామ్యపద్ధతి యందురు. దీనిని గురించియే కారల్ మార్క్సు గ్రంథములు వ్రాసెను. దీనిని సామ్యపద్ధతి యనుటకు కారణ మేమనగా ఈపద్ధతి ప్రకారము ఒకదేశమందున్న ప్రజా సంఘమంతయును ఉన్న ద్రవ్యమున కంతకును హక్కుదార్లగుదురు. కాని ప్రత్యేకము పెట్టుబడిదార్లు కారు. దీనినే కమ్యూనిజం (Communism) అనియు నందురు — అనగా ద్రవ్యమంతయు సమముగా అందరిదని. సామ్యపద్ధతివారికిని కమ్యూనిస్టులకును ప్రధాన భేద మేమనగా—సామ్యపద్ధతివారు తమపద్ధతి మెల్లగా ప్రవేశ పెట్టవచ్చునని నమ్ముదురు. ప్రజలు పార్లమెంటుకు సామ్యపద్ధతి వారినే సభ్యులుగా ఎన్నుకొనుటవల్ల, పార్లమెంటులో సామ్యపద్ధతి వారు తగినంతమంది యుండుట తటస్థించినచో వారే ప్రభుత్వ

మును కరగతము చేసికొనవచ్చునినియు వారి నమ్మకము. కమ్యూనిస్టులన్ననో—సామ్యపద్ధతివారు చెప్పిన ప్రకారము మార్పు రాదనియును, రష్యాలోవలె తీవ్రవిప్లవమువల్లనే వచ్చుననియు చెప్పుదురు. కమ్యూనిజమునే బోల్షివిజం అనియు నందురు. లెనిన్ నాయకత్వములోనుండిన కమ్యూనిస్టులను బోల్షివిక్కులని పేర్కొనుట యిందువల్లనే.

[మూలప్రశ్న 74: విప్లవానంతరము రష్యాలో నేమి జరిగెను?]

§74. తీవ్రమగు మార్పు రావలెనని కోరినవారు కార్మికులలో మిక్కిలి బీదవారు. సామ్యపద్ధతికి వ్యతిరేకులు అధికారములో నున్నవారును, భాగ్యవంతులును. లెనిన్, రష్యాలో సోషలిస్టు ప్రభుత్వమును స్థాపించి, ఫ్యాక్టరీలను గనులను ఇతర వ్యాపారములను వాటి యజమానులగు భాగ్యవంతుల కీయ నిరాకరించెను. ఇట్లు చేయుట ఇతరజాతుల ప్రభుత్వముల కన్నింటికి కోపకారణమయ్యెను. ఫ్రెంచివారు, బ్రిటిషువారు, అమెరికనులు, జపానువారు, జెక్కులు, పోలండువారు తమతమ సైన్యములను పంపి రష్యాలోని వివిధభాగముల నాక్రమింపబూనిరి. ఈ విధముగా లెనిన్ ప్రభుత్వమును భగ్నముచేయవచ్చు ననుకొనిరి. కాని అట్లు కాలేదు. తమ వ్యవహారములలో ఇతరజాతులు కలుగజేసికొనుట రష్యను ప్రజలు చూచిరి. వారందరును ఏకమై శత్రువులను తరిమి వేయ నిశ్చయించుకొనిరి. దండయాత్ర చేసిన శత్రువులనేగాక విప్లవమునకు వ్యతిరేకులైన వారినికూడ తరిమి వేయ నిశ్చయించిరి. విప్లవమునకు వ్యతిరేకులు 'హ్వైట్సు' (Whites) అనువారు. అనుకూలురు 'రెడ్సు' (Reds) అనువారు. 1920 సంవత్సరాంతమునకు దండయాత్ర సాగించినవారు వెనుకకు మరలిపోయిరి. 'హ్వైట్సు',

ఓడింపబడిరి.

చాలా సంవత్సరములవరకు రష్యా ఎన్నో దారుణకష్టముల నెదుర్కోవలసివచ్చెను. కాని లెనిన్ గొప్పనాయకుడు; ప్రజల కష్టములను తానును పంచుకొనెను. క్రమక్రమముగా పరిస్థితులు బాగుపడెను. ఎడతెరిపిలేకుండ పనిచేయుటవల్లను అతనిపై హంతకుడొకడు పేల్చిన గుండుదెబ్బవల్లను అతడు 1924 సంవత్సరమున మరణించెను.

లెనిన్ తరువాత సోవియట్ రష్యాకు మహానాయకుడైనవాడు స్టాలిన్. విప్లవమునకు పూర్వము లెనిన్‌తో పనిచేసిన వారిలో స్టాలిన్ ఒక్కడు. లెనిన్‌కు ఈతనిపై నమ్మకముకలదు. స్టాలిన్ చేసిన మహాత్కార్యము—'అయిదు సంవత్సరముల ప్లాను'ల మూడింటిద్వారా రష్యానంతను పారిశ్రామికముచేయుట. 1928 సంవత్సరమునుండి ఈ ప్లానుల ననుసరించి రష్యా అంతటిలోను ఎలెక్ట్రిక్ పవర్ స్టేషనులు (electric power-stations) స్థాపింపబడినవి. ఫ్యాక్టరీలు నిర్మింపబడినవి. ఇందుకై మొదట, అమెరికా, బ్రిటన్, జర్మనీదేశములనుండి కొనిన యంత్రము లుపయోగింపబడినవి. రానురాను రష్యా సొంతముగా తన యంత్రములను చేసికొన మొదలుపెట్టినది. రష్యాలో తయారుచేసిన మోటారునాగళ్లతో (motor-tractors) ను, వ్యవసాయ యంత్రములతోను మైళ్లకు మైళ్లదూరము విస్తరించిన బ్రహ్మాండమగు పొలములను వారిప్పుడు దున్ని సాగుచేయుచున్నారు. 12-వ యేడు వచ్చువరకును రష్యాలోని బాలబాలికల కందరికిని ఉచిత నిర్బంధవిద్య. తల్లిదండ్రులు బీదవారైనప్పటికిని బాలబాలిక లెవ్వరైన తెలివితేటలుగలవారున్న వారి కున్నతవిద్య చెప్పించుచుండిది. సోవియట్

ష్యా ప్రపంచజాతులలో ఒక్క ప్రబలమైన గొప్పజాతిగా పరిణ
మించెను.

అ భ్యా స ము లు

1. లెనిన్ రష్యా కేమిచేసెను?
2. కొట్టుబడిపద్ధతి సామ్యపద్ధతి కమ్యూనిజం—వీనికున్న భేదములేమి?
3. నేడు, ఏవిధములుగా రష్యా యితరదేశములకంటె భిన్నముగా నున్నది?

# 18. ప్రాచ్యదేశములు మరల మేలుకొనుట

## 38 పాఠము: డాక్టరు సున్‌యాట్‌సెన్: చీనాదేశస్థుల ప్రజాప్రభుత్వము

[మూలప్రశ్న 75: నేటి చీనా నాలుగు రాజకీయపక్షములుగా నెట్లు చీలిపోయినది?]

§75. 1911 సంవత్సరమున చీనాలో ఒక విప్లవము సంభవించెను. తమ్ము పరిపాలించుటకు రాజు లక్కరలేదని చీనావారు నిశ్చయించుకొనిరి. 1912 సంవత్సరము జనవరి మొదటి తేదీని ప్రజాప్రభుత్వమును వారు స్థాపించుకొనిరి. మొదటి అధ్యక్షుడు డాక్టరు సున్ యాట్ సెన్ అను పేరుగల గొప్పనాయకుడు. కాని విప్లవమును పోషించినవారు చైనాకు దక్షిణార్ధభాగములో యాంగ్‌టిసికియాంగ్ నదియొక్క సారవంతమైన మైదానములందు బహుళముగా నుండిరి. హోయాంగ్‌హోనదియొక్క ఉత్తర మైదానములలోను, ఉత్తరపశ్చిమములందున్న గడ్డిమైదానములందును అంత బహుళముగా లేరు. ఉత్తరరాష్ట్రములలో

ముఖ్యముగా విప్లవానంతరము చిన్ననియంతలు తలయెత్తిరి. ప్రతి నియంతయు ఇతరులతో పోరాడుటకు సైన్యముల సమకూర్చెను. ఇట్లు జరుగుట చైనాకు హానికరముగా నుండెను.

1912 సంవత్సరము మొదలు 1925 సంవత్సరమున అతడు చని పోవువరకు డాక్టరు సన్ యాట్ సెన్ కష్టపడి పనిచేసెను. కాంటన్ ముఖ్యపట్టణముగా అతడు దక్షిణమున ప్రజాప్రభుత్వ మును స్థాపించెను. అత డొక పార్టీని తయారు చేసెను. దానికి 'కూవో మిన్‌టాంగ్' (kuo-min-tang) అనిపేరు. అనగా జాతీయప్రజా పక్ష మన్నమాట. బీదలగు వ్యవ సాయదారులకును ఫ్యాక్టరీ లలో పనిచేయువారికిని అతడు ఎక్కువ ఉపకారము చేసెను. 1917 సంవత్సరమున బోల్షి విక్కుల విప్లవము సంభ వించెను. 1924 సంవత్సరమున రష్యనునాయకులనుండి డాక్టరు సన్‌కు సహాయము వచ్చెను. రష్యను రాజ్యాంగపద్ధతిమాదిరిగా దక్షిణచీనాలో సోషలిస్టిక్ ప్రభుత్వమును స్థాపించుటకు ప్రారం భించిరి. చైనాలోని భూస్వాములకును, ఫ్యాక్టరీ యజమానుల కును, భాగ్యవంతులగు వ్యవసాయదారులకును, సాహుకార్లకును ఇది ఎంతమాత్రము ఇష్టములేదు. రష్యాలోని భూస్వాములను,



సన్ యాట్ సెన్.

సాహుకార్లను వారు వదుల్చుకొన్నట్లే తమ్మునుకూడ చీనాప్రభుత్వము వదల్చుకొనునని వారు భయపడిరి. అయినప్పటికిని కూమో మిన్‌టాంగు అధికారము వ్యాపించెను. 1927 సంవత్సర మగుసరికి దక్షిణచీనా మధ్యచీనాలు దాని పాలనలోనికి వచ్చెను. ఉత్తర చీనాను జయించుటకుకూడ అది సిద్ధమగుచుండెను.

కూమోమిన్‌టాంగులోనే పలుకుబడిగల సభ్యులు, తమకు సహాయము చేసిన రష్యనులు వ్యాపింపచేసిన కమ్యూనిస్టు సిద్ధాంతములను ఎంతమాత్రము ఇష్టపడకుండిరి. తాము త్వరలో చర్యతీసికొనకున్న చీనాదేశమంతయు కమ్యూనిస్టులవశము కావచ్చునని వారనుకొనిరి. కాబట్టి కూమోమిన్‌టాంగ్‌నుండి తాము వేరుపడి వేరొక ప్రభుత్వమును స్థాపింప నిశ్చయించుకొనిరి. వారి నాయకుడు చీయాంగ్‌కైషెక్. అతని భార్య డాక్టరు సన్‌యాట్‌సెన్ మరదలు.



చీయాంగ్‌కైషెక్

చీయాంగ్‌కైషెక్, యాంగ్‌టిసియాంగ్ నగరములలోని భాగ్యవంతుల సహాయముతో నాన్‌కింగ్‌లో తన ప్రభుత్వమును స్థాపించి, కమ్యూనిస్టువాదమునకు వ్యతిరేకులైన వారందరిని తనకు సహాయము చేయుమని కోరెను. కూమో మిన్‌టాంగులో ఇందువల్ల విభేదములు పుట్టెను. అంతః కలహము (civil war) మరల తటస్థించెను. నాడు మొదలు

1935 సంవత్సరము వరకు నున్నకాలములో చీనాలో నాలుగు రాజకీయపక్షము లేర్పడినవి. వా రొకరితో నొకరు పోరాడుకొనచుండిరి. మొదటిపక్షము దక్షిణభాగమున నున్నది. దాని కేంద్రము కాంటన్. అది తొలి కూమో మిన్‌టాంగ్ పక్షము. రెండవది ఉత్తరభాగమున నున్నది అది వేర్వేరు నియంతలగు యుద్ధ నాయకులపాలనలో నున్నది. వీటికి మధ్యను నాన్‌కింగ్ ముఖ్య పట్టణముగా చీయాంగ్‌కై షెక్ యొక్క ప్రభుత్వము, యాంగ్‌టిసి లోయ చాలాభాగము పాలించుచుండెను. నాల్గవపక్షము కమ్యూనిస్టులు. ముఖ్యముగా యాంగ్‌టిసిలోయకును దక్షిణభాగమునకును మధ్యనున్న కొండప్రాంతములలోని అనేక ప్రదేశములు కమ్యూనిస్టుల పాలనలో నుండెను.

[మూలప్రశ్న 76: చీనాదేశస్థులు మరల ఏకీభవించుటకు కారణమేమి?]

§76. 1935 సంవత్సరమున చీనాదేశస్థులందరును ఏకీభవించుటకొకసంఘటనసంభవించెను. ఉత్తరచీనాపై జపాను దాడివెడలెను.

జపానువా రిట్టిదాడి 1910 సంవత్సరమున ప్రారంభించి కొరియాను వశముచేసికొనిరి. మరల 1931 సంవత్సరమున మంచూరియాను వారు స్వాధీనము చేసికొనిరి. కాని 1935 సంవత్సరమున జపాను పీకింగ్‌పట్టణమునకు కొద్దిగా ఉత్తరముననుండి చీనాపై దాడివెడలెను. అప్పుడు చీయాంగ్‌కై షెక్ కమ్యూనిస్టులతో పోరాడుచుండెను. జపానువారి నెదుర్కొని పోరాడుటకు చీనా ఏకము కావలెనని అతని ఆశయము. తొలుత కమ్యూనిస్టులను ఓడించినపిమ్మట చీనాను ఏకముచేయుట సాధ్యమగునని అతడు తలంచెను.

1936 సంవత్సరమున కమ్యూనిస్టులు చీయాంగ్‌కై షెక్‌ను

అపహరించిరి (kidnapped). చీనాదేశస్థులందరును తమ విభేదము లను మరచిపోయి ఏకీభవించునట్లును, చియాంగ్ కై షెక్ సర్వసేనానిగానుండి జపానుపై యుద్ధమునకు వారిని నడిపించునట్లును, వారందరును అతని ఆజ్ఞలను శిరసావహించునట్లును వారు చెప్పిరి. చియాంగ్ సమ్మతించెను. గౌరవముతో నతనిని ఒక విమానము మీఁద అతని ముఖ్యపట్టణమునకు కమ్యూనిస్టులు పంపివేసిరి. చివరకు ఐక్యతసాధించిన చీనాదేశము జపానును ఎదుర్కొనజొచ్చెను.

కాని ఐక్యత సకాలమునకు రాలేదు. అప్పటికే చీనాలో చాలాభాగము జపాను వశమయ్యెను. జపానీయులు అప్పటికే పెద్ద సైన్యములను, సాయుధులగు సైనికులతోను, వందలకొద్ది విమానములతోను చీనాలో దింపిరి. చీనాదేశస్థులు బీదవారు. వారికాయుధములు తక్కువ. జపానువారు చీనానగరముల నొకదాని వెనుక నొకటి స్వాధీనము చేసికొనిరి పీకింగ్, షాంగ్‌హాయ్, నాన్‌కింగ్, హాంకో చివరకు కాంటన్‌కూడ వారివశమయ్యెను. కాని చీనావారు లోబడరైరి. చియాంగ్ కై షెక్ తన రాజధానిని మార్చుకొనుచు పశ్చిమముగా పోయెను. నాన్‌కింగ్ నుండి హాంకోకు; హాంకోనుండి చుంగ్‌కింగ్‌కు మార్చెను. ప్రభుత్వస్థానమును మార్చుటయే కాదు; అతడు సంపూర్ణముగా ఫ్యాక్టరీలనుకూడా తీసికొనిపోయెను. ఆయుధములను, యుద్ధసామగ్రిని చీనాదేశస్థులు అందువల్లనే నిరంతరాయముగ చేసికొనగల్గిరి. చదువుకు విఘ్నము కలుగకుండ అతడు విశ్వవిద్యాలయములనుకూడ తనతో మార్చెను. జపానువారు స్వాధీనము చేసికొన్న స్థలములలో, ముఖ్యముగా కమ్యూనిస్టుల పాలనమందున్న స్థలములలో చీనాప్రజలు జపానువారితో రహస్యముగా యుద్ధము సాగించిరి. ఇందువల్ల తాము

జయించిన స్థలములను జపానువారు పాలించుట దుర్భరమయ్యెను. రైల్వేబస్లుపోవు పట్టణములను, జపాను నౌకాబలము అధికారము చెలాయించగల సముద్రతీరములను, నదీతీరములందలి పట్టణములను మాత్రము వారు పాలించగలిగిరి.

చీనాప్రజలు ఇంత ధైర్యముగా పోరాడగలుగుట చరిత్రలో ఇంతవరకు జరుగలేదు. ఈ పోరాటము 10 సంవత్సరములు పైగా జరిగినది. చివరకు జపానువారు మిత్రమండలికి లొంగిపోవలసి వచ్చెను.

చీనాకు జపానువారినుండి విముక్తి కలిగినది. కాని ఈపంక్తులు వ్రాయునాటికి (జూలై 1947) చీయాంగ్ కై షెక్ నకును చీనా కమ్యూనిస్టులకును అంతఃకలహము మరల తటస్థించెను. వారిమధ్య సంధికుదుర్చుటకు అనేకప్రయత్నములు జరిగెను కాని అవి విఫలమాయెను. దేశమును పరిపాలించువిధమునుగూర్చి వారికి భిన్నాభిప్రాయము లుండెను. అందుచే వారు కలిసి పనిచేయుట అసంభవముగా నుండెను. తమపాలనములోనున్న దేశభాగములను వదలుకొనకూడదని కమ్యూనిస్టులు పట్టుబట్టిరి. కమ్యూనిజం వ్యాపించకుండ అరికట్టవలెననియు, చేతనైన దానిని అంత మొందించవలెననియు చీయాంగ్ పట్టుబట్టెను. అమెరికాసంయుక్త రాష్ట్రములనుండి చీయాంగ్ కు ఆయుధములు, ధనము సహాయముగా వచ్చెను. జపానునుండి స్వాధీనముచేసికొన్న ఆయుధములను రష్యావారు కమ్యూనిస్టులకిచ్చిరి. ఉభయపక్షులవారికి తీవ్రయుద్ధము జరుగుచుండెను.

సుమారు 20 సంవత్సరములపాటు చీనా యుద్ధములలో తగుల్కొనియుండెను. ప్రజలు వరదలవల్లను, కాటకమువల్లను, రోగ

ములవల్లను కూడ బాధపడుచుండిరి. ఇట్టి ఉపద్రవములు తడవ తడవకు వచ్చుచున్నప్పటికిని వేలకొలది సంవత్సరములపాటు చీనా సహించినది. చీనాలోని మహాజనులు ప్రస్తుతకష్టములను కూడ గడచి కృతార్థులు కాగలరని మన మాసించవచ్చును. ఇట్లు వారు వారి నాగరికతాబలమును లోకమునకు చాటుదురుగాక.

## 39 పాఠము : నేటిటర్కీ : నేటిఇండియా

[మూలప్రశ్న 77 : టర్కీకి ముస్తాఫాకమాల్ ఆటాటర్కు చేసినదేమి ?]

§77. పూర్వాచారబద్ధమగు టర్కీని కొద్ది సంవత్సరములలో నవ నాగరికజాతిగా మార్చగలిగిన అసాధారణ పురుషుడు ముస్తాఫా కమాల్ ఆటాటర్కు. జర్మనీపక్షమున మొదటి ప్రపంచయుద్ధములో టర్కీ పోరాడెను. యుద్ధము ముగియుటతోడనే ముస్తాఫా కమాల్ తురుష్క జాతీయపక్షమును లేవనెత్తెను. 1923 సంవత్సరమున సుల్తాను పంపివేయబడెను. టర్కీ ప్రజాప్రభుత్వ రాజ్యమయ్యెను. ముస్తాఫాకమాల్ దాని ప్రథమ అధ్యక్షుడు. 1924 సంవత్సరమున కమాల్ కిలాఫత్తును రద్దుచేసెను. 1925 సంవత్సరమున ఫెజ్ టోపీలు ప్రజలు పెట్టుకొనరాదని నిషేధించెను. స్త్రీలకు ఘోషాపద్ధతి నిషేధించెను. అందరికిని నిర్బంధవిద్య ప్రవేశ పెట్టెను. అరబ్ లిపికి బదులు రోమన్ లిపి వాడవలసినదని ఉత్తరువులు చేసెను. ఇట్లు చేయుటచే అందరును తురుష్కభాష సులభముగా నభ్యసింప వీలయ్యెను. 1927 సంవత్సరమున ముస్తాఫా మరల అధ్యక్షుడయ్యెను. టర్కీ నతడు పూర్తిగా మార్చివేసెను. ఆసియామైనరులో టర్కీని శక్తివంతమైన, ఐకమత్యముగల నేటి జాతినిగా చేయవలెనని అతనిలక్ష్యము. ఇతర దేశముల జయించు

టకు ప్రయత్నించుచు, ఉన్నశక్తిని వ్యర్థముచేసికొనుటగాని,

işte olduğu gibi bu savaşta da Başkumandan olarak önümüze geçti, iki yıl

önce başlıyan bu iş iki yılda hayırlı bir aldı Bütün Türk okurları, yazganları bulun

Bu resim Büyük —eskiden padi... ...in eğlence ... olan bizim ...

KAHRAMANLAR YUVASI

HARBİYE

100 YAŞINDA!

... 100 yıldan ... yetiştı ... Paşa- ... Ethem kumandan- ... ışık aldı. ... Büyük ...daşları bu ... Türk

dünyasına saçtılar ve padişahların zulmü içinde kapkaranlık kalan Yurdumuza Cümhuriyet ışığı saçtılar Bugün eli silâh tutan her Türk muhakkak bu mektebin bilgisinden istifade etmiştir. Öyle olmasaydı ordumuz harpte nasıl doguşurdu. Yaşasın Kahramanlar Yuvası Yaşasın ondan ışık alan ve bize saçan öz Türk evlâtları.

*lkının evidir. Bu evde senin için şanların bir de şubesi vardır. Halkevi Köycüler Komitesi) ne yardım edecek arkadaş bulursun.*

Çocuğu

Bizde hâlâ ... den bir 'âdet Çocuk üşüyüp ... masın, hasta ... diye böyle ustu... dırılır çocuk ... gündenberi ... konur, onun hava görelilmez Anal... lerimizi açın' Çoc... üste giydirmek ... manlıktır çünkü ... zibinalar muntaz... beri giyen çocuk... du hava alamaz ... alamıyan vücutla... gun olarak başı...

రోమన్ లిపితో ముద్రింపబడిన టర్కీదేశ వార్తాపత్రిక
(ఎడమ తట్టున ముస్తాఫా కమాల్‌ను చూడనగును)

తురుష్క సామ్రాజ్యమును సంపాదించుట కాని అతని అభిమతము కాదు. 1938 సంవత్సరమున ముస్తాఫాకమాల్ మరణించెను.

[మూలప్రశ్న 78: ఇండియాకు బ్రిటిషువా రేమిచేసిరి? ఇంకను చేయవలసినదేమి?]

§78. ఇండియాలోని నాగరికత చీనా నాగరికతవలెనే మిక్కిలి ప్రాచీనమైనది. 17-వ శతాబ్దిలో మహారాష్ట్రులేకమై, శివాజీ

నాయకత్వమున మొగలుల ప్రభుత్వము నెదిరించిరి. కాని బ్రిటిషు వారి నెదిరించుటకు వా రట్లు ఏకము కాలేదు. ఇండియాలోని రాజులు అంతఃకలహములు పెట్టుకొని బ్రిటిషువారితో చేరి ఒక రితో నొకరు పోరాడుచుండిరి. ఇతర రాజులనుండి రక్షించుకొను



సింధునది కడ్డముగా కట్టిన సుక్కూరు ఆనకట్ట

టకు బ్రిటిషువారి సహాయము కోరుచుండిరి. ఈవిధముగా ఇండియా దేశమందలి రాజుల సహాయముతో, కొంచెము కొంచెముగా హిందూదేశమునంతయు బ్రిటిషువారు తమపాలన క్రిందికి తెచ్చు కొనిరి.

బ్రిటిషు పరిపాలనక్రింద హిందూదేశము కొన్నివిధములుగా వృద్ధిజెందినది. దేశములో అంతఃకలహములు అంతరించినవి.

ఇండియా అంతయు ఒక్క పాలనక్రిందకు వచ్చినది. ఒకరాష్ట్రమందలి సైన్యము ప్రక్కరాష్ట్రముపై బడు నను భయములేదు. దేశము ఒక చివరనుండి ఒకచివరకు సురక్షితముగా ప్రయాణము చేయవచ్చును. ఎవరి కిష్టమువచ్చిన మతము వా రవలంబించవచ్చును. ప్రతి సంవత్సరము నీటిపారుదల (irrigation) వృద్ధిచేయుటకై గొప్ప ప్రయత్నములు జరిగినవి పెద్దనదుల కడ్డముగా గొప్ప ఆనకట్టలు కట్టబడినవి. ఎడారి భూములగుండ కూడా మైళ్లపొడుగున కాలువలు త్రవ్వబడినవి. జలపాతముల సహాయముతో విద్యుత్తు పుట్టింపబడుచున్నది. ప్రపంచమందలి దేశములం దెక్కడనులేని గొప్ప నీటి పారుదలపద్ధతి ఇండియాలో నున్నది.

కాని ఇట్టి అభివృద్ధి చాలదని ఇండియాలో పెక్కుమంది అభిప్రాయము. నగరములలోను పట్టణములలోను నివసించు జనులకే నివసించుటకు మంచియిండ్లు, కట్టుకొనుటకు మంచిబట్టలు, తినుటకు కావలసినంత తిండియున్నది. పట్టణములలోనైనను తగినంతలేనివారు వేలకొద్ది ప్రజలు కలరు. పల్లెటూళ్లలో ప్రజలు మిక్కిలి బీదవారు. ఒకపూట అన్నమునకైనను వారికి గతిలేదు. ఈస్థితి మారుట ఎట్లు? సుఖముగా, ఆరోగ్యముగా, శాంతముగా జీవించగలిగిన ఒకజాతిగా ఇండియాను చేయుట ఎట్లు?

హిందూదేశమందలి నాయకులందరు, ఇండియా ఇండియనులచేతనే పాలింపబడవలెనని ఏకాభిప్రాయులై యున్నారు. అమెరికనులవలెనే తిరుగుబాటుచేసి స్వాతంత్ర్యమునకై పోరాడుట ఒక్కటే మార్గమని కొందరు హిందూదేశస్థులు తలచిరి. అట్లు చేయకుండుటకు రెండు ప్రబలకారణము లున్నవి. మొదటిది, విమానములు, టాంకులు, విషవాయువు (poison gas), బాంబులు ఉప

యోగించు ఈరోజులలో కొద్దిమంది సైనికు లట్టి ఆయుధములతో వేలకొద్ది ప్రజల నాపగలరు. రెండవ దింతకన్న ప్రబలమైన కారణము. ఒక మంచిపనిని చెడ్డవిధముగా (అనగా పలువురకు హాని కలుగు విధముగా) చేసినయెడల కోరిన మంచిఫలితము రాదు. ఫలితము కూడ కొంతవరకు చెడ్డదగును. నేటికాలమున ఇండియా కంతకును మహానాయకు డని లోకప్రఖ్యాతిగన్న ఒకపురుషుని అభిప్రాయ మిది. అతనిపేరు మోహనదాస కరమచందగాంధీ. మహాత్మాగాంధీ పేరందరికిని తెలిసినదే. అతనిని గురించి నీవు తెలిసికొనదగినదంతయు తెలిసికొనవలెను. అప్పుడే నీవు నిజముగా విద్యావంతుడ వనిపించుకొందువు.

## 40 పాఠము : మహాత్మాగాంధీ; అతని అభిప్రాయములు

[మూలప్రశ్న 79 : సత్యాగ్రహ మన నేమి? దాని నెట్లు గాంధీ ప్రయోగించెను?]

§79. కతియవాడులోని పోర్బందరు పట్టణమున 1869 సంవత్సరమున గాంధీజీ జన్మించెను. మోహనదాసు న్యాయవాదవృత్తి నవలంబించవలెనని 19-వ యేట ధర్మశాస్త్రమును (law) చదువుటకు ఇంగ్లాండు వెళ్లెను. లండనులో అతడు దివ్యజ్ఞాన సమాజము (Theosophical Society) నకు నాయకురాలగు అనీబెసంటును కలిసికొనెను. ఆమెకు ఇండియామీద అభిమానము. తన మతమగు హిందూమతమును గురించియు, ఇతరమతములను గురించియు బాగుగా చదివి తెలిసికొమ్మని ఆమె అతనికి సలహానిచ్చెను. కౌంటు టాల్స్టాయి అభిప్రాయములతో తన అభిప్రాయములు సరిపోవుచున్నవని గాంధీ తెలిసికొనెను. టాల్స్టాయి రష్యాదేశస్థుడు. 'రెండవ చెంపను చూపుమని' చెప్పినట్టియు, అపకారమున కుపకారము చేయుమని చెప్పినట్టియు, క్రీస్తు బోధనలపై అతనికి నమ్మకముండెను.

1891 సంవత్సరమున గాంధీ ఇండియాకు తిరిగివచ్చి బారిస్ట్రరుగా బల్లకట్టెను. దక్షిణఆఫ్రికాలోని నేటాలులో దాదాఅబ్దుల్లా అండుకో అనుపేరుగల పెద్దఇండియను వర్తకకంపెనీ కలదు. అది ఇంకొక కంపెనీమీాద వ్యాజ్యము వేసెను. 1893 సంవత్సరమున అబ్దుల్లా కంపెనీవారు గాంధీని దక్షిణఆఫ్రికాకువచ్చి, తన వ్యాజ్యములో సహాయము చేయుమని కోరిరి. అత డంగీకరించెను. దక్షిణ ఆఫ్రికాలోనున్న కొద్ది దినములలోనే, అచ్చటి డచ్చివారును బ్రిటిషువారును, యూరోపియనులు కాని వారి విషయములో ఎంతటి దౌర్జన్యముతో ప్రవర్తించుచున్నదియు అతడు అనుభవించెను. దక్షిణఆఫ్రికాలో జీవనోపాధి గడించుకొనుటకై ఇండియానుండివెళ్లి అక్కడ కాపురములు పెట్టుకొన్న తన దేశస్థులకు, బ్రిటిషు ప్రజలైనప్పటికిని, పౌరసత్వపు హక్కులేమియు లేనట్లు అతడు కనుగొనెను. దక్షిణఆఫ్రికాలో వారిని అనేకవిధములుగా తెల్లజాతివారు హింసపెట్టుచుండిరి. వారి అవస్థచూచి గాంధీజీ చాలా విచారించెను. వ్యాజ్యము ముగిసినపిమ్మట దక్షిణఆఫ్రికాలోనే గాంధీజీ నుండిపొమ్మని అక్కడి ఇండియనులు కోరిరి. హిందూదేశస్థులకు న్యాయము జరుగుటకై కృషిచేయుటకు అతనిని నాయకత్వము వహించమని కోరిరి. అతడు సమ్మతించెను. 1864 సంవ



మహాత్మా గాంధీ

వత్సరము మే నెలలో నేటాల్ ఇండియన్ కాంగ్రెసు నాతడు స్థాపించెను.

దక్షిణ ఆఫ్రికాలోనున్న ప్రబలమగు బ్రిటిషు ప్రభుత్వముపై ఆయుధములతోగాక వేరొకవిధముగా తిరుగుబాటు నడిపించవలె నని యాతడు నిశ్చయించెను. సత్యాగ్రహముతో, అనగా అహింసాత్మక నిరోధముతో గాంధీజీ దక్షిణఆఫ్రికా ప్రభుత్వముతో నెట్లు పోరాడినదియు అందరికిని తెలిసిన విషయమే. 20 సంవత్సరముల పాటీ పోరాటము జరిగెను. గాంధీజీయును అతని అనుచరులును ఎన్నోమారులు కారాగారవాస మనుభవింపవలసి వచ్చెను. చివరకు గాంధీజీకి విజయము వచ్చినది. 1914 సంవత్సరమున ఇండియన్ రిలీఫ్ ఆక్టు ప్రవేశపెట్టబడినది.

[మూలప్రశ్న 80 : గాంధీజీ లక్ష్యమేమి ? దానిని పొందుట కత డెట్లు ప్రయత్నించుచున్నాడు ?]

§80. గాంధీజీ ఇండియాకు తిరిగివచ్చెను. 30 సంవత్సరములనుండి అతడు తన దేశస్థులకొరకు పాటుపడుచుండెను. సత్పదార్థమును అసన్మార్గము నవలంబించి నీవు పొందజాలవని అతని నమ్మకము. అట్లు చేయుటకు నీవు ప్రయత్నించినచో నీవు పొందినఫలము నీవనుకొన్నదై యుండదు. అది సరియైన ఫలముకాదు. గాంధీజీ అభిప్రాయము ప్రకారము న్యాయముగా ప్రయోగింపదగిన శక్తి ఒకటే—అది ఆత్మశక్తి. రాగద్వేషములులేకుండ, కష్టము కలిగినను బాధవచ్చినను లెక్కచేయక కర్మచేయుటవల్ల వచ్చుశక్తి ఆత్మశక్తి. నీవు బాధపడ సిద్ధపడవలెను కాని స్వలాభము నాశించి యితరులకు బాధ కలిగించరాదు. అపకారమున కపకారము చేయక, సన్మార్గముల ననుసరించుచు, తమకు సత్కార్యములని

తోచినవానిని చేయు పురుషులు చివరకు ఇష్టసిద్ధిని పొందుదురు. కత్తిని దూసినవాడు కత్తివల్లనే నశించునని అతని అభిప్రాయము. బుద్ధునియొక్కయు క్రీస్తుయొక్కయు బోధలుకూడ నింతే. ఆమాట సత్యమేయైన యుద్ధములుచేసి మనము శాంతిని సంపాదించలేము.

### అభ్యాసములు

1. చీయాంగ్ కై షెక్ నుగూర్చి నేటి గ్రంథమొకటి చదివి అతని చరిత్రను సంక్షేపముగ వ్రాయుము.

2. ఆయుధములు పూర్తిగాలేని చీనావారు ఇన్ని సంవత్సరములకాలము జపానుదాడికి ఎట్లు తాళగలిగిరి?

3. ఈక్రింది విషయముపై చర్చపెట్టుకొనుడు: 'మహాత్మాగాంధీయొక్క నిరోధపద్ధతిని జపానుపై చీనావా రవలంబించిన బాగుండెడిది.'

4. ఔరంగజేబును మహారాష్ట్రు లెదిరించగలిగిరి? బ్రిటిషువారి నేల ఎదిరింపలేకుండిరి?

5. ఈక్రింది విషయముపై చర్చపెట్టుకొనుడు: 'బలమైన సైన్యమును నౌకాబలమును విమానబలమును పెట్టుకొనుటకు బదులు, ఇండియాను దండయాత్రల నుండి రక్షించుటకు, భారతదేశమందలి స్త్రీపురుషులకు సత్యాగ్రహమున శిక్షణనిచ్చుట భారతదేశమునకు శ్రేయస్కరము.'

# 19. రెండవ ప్రపంచయుద్ధము

## 41 పాఠము: అడాల్ఫుహిట్లరు; అతడు అధికారమునకు వచ్చిన విధము

[మూలప్రశ్న 81: జర్మను ప్రజాప్రభుత్వ మేల విఫలమయ్యెను?]

§81. మొదటి ప్రపంచయుద్ధానంతరము జర్మనుప్రజలు రణప్రియు లగుట తమ రాజును వదలించుకొని ప్రజాప్రభుత్వమును నెలకొల్పు

కొనిరి. కాని జర్మనుప్రజలు రాజాజ్ఞల శిరసావహించుట కలవడ్డ వారే కాని స్వయముగా శాసనములు చేసికొనుట కలవడ్డవారు కారు. కాన జర్మనుల నూతన ప్రజాప్రభుత్వము జయప్రదము కాలేదు.

మొదటి ప్రపంచయుద్ధము తరువాత ముడివస్తువులతో సరుకులను తయారుచేసికొనుటకు జర్మనీకి డబ్బులేదు. దానికి ఓడలు లేవు. జర్మనుల అధినివేశములు మిత్రమండలి వశమయ్యెను. జర్మను బొగ్గుగనులను కొన్నింటిని మిత్రమండలి పుచ్చుకొనెను. దీనికి ఫలితము జర్మనుసైనికులు యుద్ధరంగమునుండి ఇంటికి రాగానే వారిలో అనేకులకు చేసికొనుట కెట్టిపనియు లేకుండెను. అమెరికా అప్పలిచ్చి కొంతకాలముపాటు జర్మను ప్రజాప్రభుత్వమునకు సహాయము చేసెను. 1930 లో అమెరికాయే నిరుద్యోగ సమస్యవల్లను, ఆర్థికముగాను బాధపడవలసి వచ్చెను. నానాటికి జర్మనీలో పరిస్థితులు పాడగుచుండెను. 1932 సంవత్సరమునాటికి జర్మనీలో పనిపాటలు లేనివారి సంఖ్య 60 లక్షలు దాటినది. ఈ పరిస్థితులలో అడాల్ఫుహిట్లరుకు అవకాశము చిక్కినది.



హిట్లర్

ఆస్ట్రియా జర్మనీదేశముల పొలిమేరలు కలియుచోటనున్న ఆస్ట్రియన్ పట్టణమగు బ్రౌనాలో 1889 సంవత్సరమున హిట్లరు జన్మించెను. మొదటి ప్రపంచయుద్ధము ప్రారంభమైనప్పు డతడొక సైనికు డయ్యెను.

అతడు ధైర్యశాలి. ఐరన్ క్రాస్ అను బహుమతి నతడు పొందెను. యుద్ధము ముగియుసరికి హిట్లరు కార్పొరల్ మాత్రమే. యుద్ధానంతర మాతడు సైనికోద్యోగమందే యుండిపోయెను.

సంధిషరతులప్రకారము జర్మనీకి లక్షమందిగల సైన్యము మాత్రమే ఉండెను. ఈ సైన్యమందలి ఉద్యోగస్థులు పలువురు జర్మనీలో ప్రజాప్రభుత్వ పరిపాలన ముండుట కిష్టపడలేదు. కాబట్టి జర్మను ప్రజాప్రభుత్వమును కూలద్రోయ వా రాలోచించుచుండిరి. తమకు అందుకై సహాయము చేయదగ్గవాడు అడాల్ఫ్ హిట్లరని వారు తలచిరి.

[మూలప్రశ్న 82 : హిట్లరు అధికారమున కెట్లు వచ్చెను ? ఎట్లు ఆ అధికారమ నుపయోగించెను ?]

§82. హిట్లరు అసామాన్యవక్త. తన వక్తృత్వశక్తిచే ప్రజల నాతడు సులభముగా తనవైపునకు త్రిప్పుకొనగలిగియుండెను. జర్మనీపరిస్థితి నానాటికి దుర్భరమగుచుండెను. హిట్లరును, అతని స్నేహితులును ఒక క్రొత్తపార్టీ లేవదీసిరి. దానిపేరు నేషనల్ సోషలిస్టుపార్టీ (జాతీయసమతావాదసంఘము). దానినుండియే నాజీ యనుపదము వచ్చినది. దానికి నల్లని 'స్వస్తిక' పతాక ముండవలె నని హిట్లరు స్వయముగా దానిని కల్పించెను. 1932 సంవత్సరమున జర్మనీలో అధికసంఖ్య సభ్యులుగల రాజకీయపక్ష మిదియే. 1933 లో హిట్లరు ఛాంసెల్లరు (chanccellor) ఆయెను.

ఈ ఉద్యోగమైన నెలలోపుగా అత డొక ఉత్తరువు జారీచేసెను. తనతోగాని, తన నాజీలతోగాని ఏకీభవించని వారిని విచారణ లేకుండ చెరబెట్టవచ్చును. తరువాత కొన్నాళ్లకు నాజీపార్టీతప్ప వేరొకపార్టీ జర్మనీలో ఉండరాదని శాసించెను. వార్తాపత్రికలు, రేడియోలు, విద్యాశాఖ నాజీలవశమందుంచబడెను. జర్మనీ నిరుద్యోగసమస్యను హిట్లరు పరిష్కరించెనా? నాజీపద్ధతిగా పరిష్కరించెను.

మొట్టమొదట అతడు జర్మనులతో చెప్పినమాట యేమనగా— యూదులను జర్మనీలో లేకుండ చేసినట్లయిన చాలా కష్టములు తీరుననియు, యుద్ధమందు జర్మనుల పరాజయమునకును తరువాత తటస్థించిన నిరుద్యోగసమస్యకును యూదులే బాధ్యులనియు జర్మనులకు చెప్పి హిట్లరు నమ్మించెను. యూదులపై జర్మనీలో తీవ్రద్వేషము జనించెను. పెక్కుయూదులు హత్యగావింపబడిరి. కొందరుమాత్రము ఫ్రాంసుకు, ఇంగ్లాండుకు, అమెరికాకు పారిపోగలిగిరి. వారిలో గొప్పగణితశాస్త్రజ్ఞు డగు ఐన్‌స్టీన్ (Einstein) ఒకడు.

ఒక పెద్దసైన్యమును, విమానబలమును తయారుచేయవలయుననియు, తాము గోల్పోయిన జర్మనీలోని భాగములన్నియు తిరిగి పుచ్చుకోవలయుననియు తరువాత హిట్లరు జర్మనులతో చెప్పెను.

ఇట్లు హిట్లరు నిరుద్యోగులకందరికిని పని కల్పించెను. పడుచు వారిని క్రొత్తసైన్యములో చేర్పించెను. క్రొత్తఆయుధములను, యుద్ధయంత్రములను తయారుచేయుటకొరకు ఫ్యాక్టరీలను స్థాపించెను.

# 42 పాఠము : హిట్లరు: రెండవ ప్రపంచయుద్ధము

[మూలప్రశ్న 83 : హిట్లరు ప్రణాళిక యేమి ? అది యేల విఫలమయ్యెను ?]

§83. ఇంకొక యుద్ధమునకు తయారుకాకుండ ఇతరజాతు లేల హిట్లరును ఆపలేదు ? ఎందుకనగా వారందరు యుద్ధములో అలసి యుండిరి. హిట్లరు నిజముగా యుద్ధమునకు దిగునని వారికి నమ్మకము లేదు. ఇంతేకాదు. యుద్ధానంతర మన్ని దేశములును బీదస్థితికి వచ్చెను. నిరుద్యోగు లెందరో ప్రతిదేశమునందును కలరు. పరిష్కరించుకొనుట కిట్టి కష్టసమస్య లెన్నో వారికి కలవు.

నానాజాతిసమితికి తన్నాపుటకు శక్తిచాలదనికూడ హిట్లరు గ్రహించెను. కాబట్టి హిట్లరు యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను. 1936 సంవత్సరమున నతడు యుద్ధము ప్రారంభించెను. హిట్లరు తన సేనలను రైనునదీప్రాంతభూములకు నడిపించుకొని వెళ్లెను. వైర్సై సంధిప్రకారము ఆప్రాంతమునందు జర్మనీ తనసైనికుల నుంచరాదు.

పుట్టుకనుబట్టి జర్మనులైన జను లధికసంఖ్యాకులుగా యూరోపులో ఏయే భాగములందు నివసించుచున్నారో ఆ భాగముల నొకటొకటిగా నతడు జర్మనీలో కలుపుకొనెను.

ఇట్లు కలుపుకొనబడిన మొదటిదేశము ఆస్ట్రియా. 1938 సంవత్సరమున జర్మనుసైన్యము వియన్నా ప్రవేశించెను. జర్మనీకి సమీపమందున్నట్టియు, జర్మను లధికసంఖ్యాకులుగా నివసించు చున్నట్టియు జెకొస్లొవాకియాలోని భాగముల నాతడు 1939 సంవత్సరమున బలాత్కారముగా గ్రహించెను. జర్మనీలో కలుపుకొనుటకు యూరోపులోని భూములను యికముందు కోరనని అత డప్పుడు చెప్పెను. తమ్ము మోసముచేయుటకును తరువాత చేయ

బోవు దండయాత్రకు సైన్యములను విమానములను సిద్ధముచేసి కొనుటకును హిట్లరిట్టివాగ్దానములు చేయుచున్నాడని ఈసరికి యితరజాతులవారు గ్రహించిరి.




1939 లో యూరోపు

అనుకొనిన దండయాత్ర సెప్టెంబరు 1939 సంవత్సరమున వచ్చినది. హిట్లరు పోలెండుపై దాడివెడలెను. ఇతరజాతు లతని నాపుటకు భయపడుదురని యూత డనుకొనెను.

ఈమారు హిట్లరు పొరపాటుపడెను. బ్రిటిషు ఫ్రెంచి దేశస్థులు సిద్ధముగా లేరుకాని హిట్లరు నీమారు నిరోధించకున్నచో ఇక

ముందు నిరోధించుటకు సాధ్యముకాదని వారు గ్రహించిరి. పోలెండునుండి తనసేనలను వెనుకకు మరల్చుకొని పోయినగాని యుద్ధము ప్రకటించెద మని వారు హిట్లరుతో చెప్పిరి. అతడు నిరాకరించెను. 1939 సంవత్సరము సెప్టెంబరు 3 వ తేదీని రెండవ ప్రపంచయుద్ధము ప్రారంభమయ్యెను.

రష్యా జర్మనీపై దాడివెడలని పద్ధతిని రష్యాపై జర్మనీ దాడి వెడలదని రష్యాతో అత డొక ఒడంబడిక 1939 ఆగస్టునెలలో చేసికొనెను. స్టాలిన్ చాల తెలివైనవాడు. హిట్లరు మాటపై అతనికి నమ్మకము తక్కువ. కాన హిట్లరుసేనలు పోలెండుపై దాడి వెడలినప్పుడు స్టాలిన్ రష్యనుసేనలను కూడ పోలెండుకు పంపెను. రష్యాతట్టుననున్న పోలెండు తూర్పుభాగమును జర్మనులకు స్వాధీనముకాకుండ నట్లుచేసెను. పోలెండు మిగతభాగమంతయు జర్మనులు వేగముగా తీసికొనిరి.

[మూలప్రశ్న 84: బెల్జియం, ఫ్రాంసు యుద్ధములోను బ్రిటన్ యుద్ధములోను ఏమి జరిగినది?]

§ 84. హిట్లరు ముందుఎత్తు తెలిసికొనుటకు జాతులన్నియు కొన్ని మాసములు కాచి యుండెను. ఫ్రాంసుపై దాడివెడలునని ఫ్రెంచి వారు తలచిరి. కాన ఫ్రాంసు జర్మనీల మధ్యనున్న పొలిమేర ప్రదేశమున వారు దుర్భేద్యమగు దుర్గముల పరంపరను నిర్మించుకొనిరి. బెల్జియం సేనలును, గ్రేటుబ్రిటన్ సేనలును సిద్ధముకా వచ్చెను. 1940 ఏప్రిలులో డెన్మార్కు నార్వేలపై జర్మనులు దాడివెడలిరి. మే మాసమున హాలండు బెల్జియం దేశములలో వారు ప్రవేశించిరి. క్రొత్త జర్మనుసేనలకు అనేక విమానములు, టాంకులు, ఫిరంగులు మద్దతుగానుండెను. బెల్జియంసేనలు

లోబడెను. బ్రిటిషుసేనలు ఛానల్ తీరముననున్న డన్కిర్కు వరకు తరుమగొట్టబడిరి. బ్రిటిషునౌకాబల సహాయమున కాందిశీకు లందరు ఇంగ్లాండు చేరుకొనిరిగాని వారి ఫిరంగులును, మోటారు బస్సులును శత్రువుల వశమయ్యెను. ఫ్రెంచిసేనలు ఒకదాని వెనుక నొకటి చితుకగొట్టబడినవి. గ్రేటుబ్రిటను మీదను, ఫ్రాంసు మీదను యుద్ధమును ప్రకటించి ముస్సొలీని రణరంగమునకు దిగెను. జూను నెలలో హిట్లరు విజయసూచకముగా పారిస్ నగరమును సేనలతో ప్రవేశించెను. ఫ్రాంసు సంధికోరెను.

యుద్ధము అంతమైనదేమో యనిపించెను. బ్రిటను జయింప బడలేదు. కాని సాయుధులగు సైనికులు తగినంతమంది బ్రిటనులో లేరు. బ్రిటన్ తయ్యారుచేయుచున్న క్రొత్తవిమానము లప్పుడే ఫ్యాక్టరీలనుండి దిగుచుండెను.ఆ సమయమున హిట్లరు ఇంగ్లాండుపై దాడి వెడలిన అది ఓడిపోవలసినదే. అతని దండయాత్రకొరకు కేర్ప డిన నావ లింకను సిద్ధముగాలేవు. కాబట్టి వేరొకవిధముగా బ్రిటను నోడించవలెనని యతడు నిశ్చయించెను. ఆగస్టునెలలో బ్రిటను యుద్ధము ప్రారంభమాయెను. జర్మను విమానములు ఎడతెరపి లేకుండ సుమారు రెండునెలలపాటు ఇంగ్లాండుపై బాంబులను పడవేసెను. ఇట్లు చేసినచో బ్రిటను సంధికివచ్చునని యతడు తలంచెను.

క్రొత్తవిమానములు సమయమునకు ఫ్యాక్టరీలనుండి రాదొడ గెను. హారికేన్, స్పిట్ఫైరు అను ప్రసిద్ధ బ్రిటిషు విమానములు జర్మనుల బాంబులువేయు విమానములకన్న నతిత్వరితముగా పోగలవు. జర్మను విమానముల సంఖ్య యధికముగానున్నను చివర కవి యోడిపోయినవి. ఒక్కదినమున 185 జర్మను విమానములు

నాశనముచేయబడ్డవి. మొత్తముమీద జర్మనులు 2000 విమానములు గోల్పోయిరి. బ్రిటిషువారు పోగొట్టుకొన్న విమానములందులో ఆరవవంతు మాత్రమే. యుద్ధగతిలో తొలిమార్పు దీనివల్లనే కలిగినది. అప్పటికి రష్యా అమెరికాలు ఇంకను యుద్ధములో ప్రవేశించలేదు.

## 43 పాఠము : మిత్రమండలి

[మూలప్రశ్న 85 : బ్రిటిషువారి నోడించలేక విఫలుడైన హిట్లరు వేసికొన్న నూతన ప్రణాళిక ఏమి ?]

§85. ఈసమయమున బ్రిటిషువారొక సాహసకార్యమును చేసిరి. 1940 సంవత్సరాంతమున, ఇంగ్లాండురక్షణకు కనీసము కావలసిన విమానములను సాయుధసైనికులను ఉంచుకొని, మిగత విమానములను సైనికులను ఆఫ్రికాకు పంపిరి. అక్కడ ముస్సోలీనీ ఈజిప్టుపై దండెత్తుటకు సిద్ధపడుచుండెను. ముస్సోలీనీచేయు దాడికొరకు వేచియుండుటకు బదులు, ముందుగానే బ్రిటిషు సేనానాయకుడు (పిమ్మట ఇండియా వైస్రాయి అయిన సర్ ఆర్చిబాల్డు వేవల్) ఇటాలియనులపై బడెను. ఇటాలియన్ నౌకాబలముపై బడి పెక్కునావలను ముంచివేసెను. పిమ్మట 30,000 మంది బ్రిటిషు సామ్రాజ్య సేనలతోను, ఇండియను సేనలతోను, ఉత్తర ఆఫ్రికాలోనున్న ఇటాలియన్ సైన్యమునంతయు ఓడించెను. 1941 సంవత్సరమున వేవెల్ ఇటాలియన్ అధినివేశ రాజ్యములగు ఎరిట్రియా సొమాలిలాండులపై దాడివెడలెను. పిదప అబిసీనియాపై దాడివెడలెను. 1941 సంవత్సరము మే నెలలో ఈ ప్రదేశములన్నియు ఇటలీ పరిపాలననుండి విముక్తిజెందెను. (పటము చూడుము).

ఈలోపుగా హిట్లరు యూరోపులో ఇంకొక దెబ్బకొట్టుటకు

సిద్ధపడుచుండెను. టర్కీ నితప్ప మిగత తూర్పుయూరోపియన్ దేశముల నన్నింటిని అక్షరాజ్యముల (axis)లో చేరమని బలాత్కరించెను. జర్మనీతో మిత్రత్వము నెరపిన రాజ్యము లన్నింటికి అక్షరాజ్యము లని పేరు. అందు పలువురు మధ్యయూరోపులో నున్నారు. జపానుమాత్రము యూరోపులో లేదు. మార్చి 1941లో అతని సైన్యములు తూర్పుయూరోపుపై దాడివెడలి గ్రీసును ఆక్రమించెను. తూర్పున ఇంతకన్న పెద్దదెబ్బకొట్టుటకే ప్రయత్నము లన్నియు నతడు చేసెను. 1941 సంవత్సరము జూను 22-వ తేదీని హిట్లరు రష్యాపై దండెత్తెను.

ఇట్టిపని చేయనని హిట్లరు వాగ్దానముచేసిన ట్లిదివరలో చదివి యున్నాము. చిట్టచివరవరకు రష్యాకు పరమమిత్రుడ నని యతడు చెప్పుకొనుచుండెను. బ్రిటిషువారిని ఓడించలేకపోయెను. కాబట్టి రష్యాను జయించవలెనని యతని ఉద్దేశము.

హిట్లరు కొట్టినదెబ్బ రష్యాపై హఠాత్తుగా పడెను. జర్మను సేనలు రష్యా తూర్పుభాగమునంతను త్వరితముగా నాక్రమించుకొనెను. తరువాత లెనిన్‌గ్రాడును చుట్టుముట్టెను. మాస్కోనగరమునకు 30 మైళ్ల దూరములోనికి వచ్చెను. డానెట్జ్, డాన్‌నదుల ప్రాంతమందలి బొగ్గు, ఇనుము దొరకు ప్రదేశముల స్వాధీనము చేసికొనెను. రష్యాదేశమున కంతకును ఆహారము పండుప్రదేశమగు యూక్రెయిన్ దక్షిణమైదానములను స్వాధీనముచేసికొనెను. (189 పేజీ-పటము చూడుము.)

హిట్లరే యుద్ధము గెలుచునేమో యని మరల తోచెను. రష్యాలో చాలభాగమును, మిగత యూరోపుఖండమును అతని స్వాధీనమం దుండుటచే యుద్ధమునకు కావలసిన వస్తువులన్నియు

అపరిమితముగా అతని వశములో నుండెను. బ్రిటిషువారికిని రష్యనులకును సహాయముచేయుటకు అమెరికామాత్రము మిగిలి యున్నది. యుద్ధములో చేరలేదన్నమాటయేగాని అమెరికా చాల సహాయము చేయుచునేయుండెను.

ఇప్పుడు యుద్ధము నిజముగా ప్రపంచయుద్ధమాయెను. అక్షరాజ్యములకు యుద్ధములో విజయము తథ్యమని తోచుటచే కాబోలు జపాను రణరంగమున కురికెను. అక్షరాజ్యములలో చేరిన తూర్పుదేశము జపాను. హఠాత్తుగా యుద్ధము ప్రకటించకుండ, 1941 సంవత్సరము డిశంబరు 7-వ తేదీని జపానీయులు, హవాయి ద్వీపమందలి గొప్ప నౌకాపట్టణమగు పెరల్‌హార్బరులో నున్న అమెరికన్ నావలపై వాయువిమానముల సహాయముతో బ్రహ్మాండమగు దెబ్బతీసిరి.

[మూలప్రశ్న 86: యూరోపులో యుద్ధ మెట్లు జరిగెను?]

§86. 1942 సంవత్సరమున అక్షరాజ్యములు తమ బలమునంతయు నుపయోగించి యుద్ధమును ముగించవలెనని చూచిరిగాని లాభము లేకపోయెను. మిత్రమండలి కది కష్టకాలము. అక్షరాజ్యముల నెదుర్కొని పోరాడు రాజ్యముల కన్నింటికిని మిత్రమండలి యను పేరు వచ్చెను. బ్రిటిషుసామ్రాజ్యము, రష్యా, అమెరికా, స్వతంత్రముగానున్న చీనాభాగము, స్వతంత్రముగానున్న ఫ్రాంసు, బ్రెజిల్—ఈ దేశములు, జర్మనీచే ఆక్రమించబడిన పలుదేశముల నుండి వచ్చిచేరిన సైన్యములతో కలిసి మిత్రమండలి యనుపేర నొప్పెను. ఆక్రమిత దేశములు పోలెండు, నార్వే, హాలెండు, బెల్జియం, డెన్మార్కు, జెకోస్లొవాకియా, యుగోస్లావియా, గ్రీసు, జ్యూయిష్ బ్రిగేడ్.

మొదట జలాంతర్గాముల బంపి బ్రిటిషు అమెరికన్ నావలను జర్మనీ ముంచదొడగెను. చాలా నావలు మునిగిపోయెను. కాని చివరకు జలాంతర్గాములను నాశనముచేయ బ్రిటిషువారును అమెరి




ఉత్తర ఆఫ్రికా

కనులును మొదలిడిరి. క్రొత్తవి కట్టుకొనుటకు వీలులేనంత వేగముగా నవి నాశము చేయబడినవి.

తరువాత ఉత్తరఆఫ్రికాలో తమ మిత్రులైన ఇటాలియనులు

పోగొట్టుకొన్నదంతయు జర్మనులు మరల జయించిరి. ఎల్ఆల మైనువద్ద మాత్రము వారాటంకపెట్టబడిరి. ఎల్ఆలమైను అలెగ్జాండ్రియాకు పడమట నున్నది. అది ఈజిప్టువారి గొప్ప రేవుపట్టణము. నావలుండు స్థలము.

పిమ్మట జర్మనులు రష్యాలో ఇంకను ముందుకు చొచ్చుకొని పోయిరి. ఈమారు వారు ఉత్తరకాకసస్‌లోని పెద్దభాగమును స్వాధీనము చేసికొనిరి. అచ్చటనున్న అమూల్యమగు పెట్రోలు బావులు జర్మనులచేతులలో పడెను. స్టాలిన్‌గ్రాడ్ వద్దనున్న వల్గానదిని వారు చేరిరి. యుద్ధగతిలో మార్పు తెచ్చిన రెండవ సందర్భ మిది.

1942 సంవత్సరాంతమున పరిస్థితులు మారజొచ్చెను.

1942 శీతకాలమున మిత్రమండలివారు అక్షరాజ్యసైన్యములను ఉత్తరఆఫ్రికానుండి పూర్తిగా తరిమివేసిరి. 1943 వసంతకాలమున ట్రిపొలి, ట్యూనీసియాలు స్వాధీనము చేసికొనబడినవి. జూలైలో సిసిలీ దండయాత్ర ప్రారంభమయ్యెను. రష్యాలో రష్యనులు పెద్ద పెద్ద విజయములు పొందుచుండిరి. కాకసస్ ప్రాంతమంతయు శత్రువులనుండి విడుదలచేయబడినది. స్టాలిన్‌గ్రాడు తిరిగి రష్యా వశమయ్యెను.

అక్కడనుండి రష్యనులు ముందుకు చొచ్చుకొని వెళ్లి వెనుకటి సంవత్సరము జర్మనుల హస్తగతమైన దేశమునంతయు స్వాధీనము చేసికొనిరి.

1943 సెప్టెంబరులో మిత్రమండలిసేనలు ఇటలీపై దాడివెడలెను. మరుసటినెల ఇటలీ లొంగిపోయెను. ఉత్తరఇటలీలోనున్న జర్మను మిత్రులను చేరుటకు ముస్సోలినీ తప్పించుకొని పారిపోయెను.

అక్కడాతడు 1½ సంవత్సరములపాటు శత్రునిరోధము చేయుచుండెను.

1944 మొదటిభాగమున రష్యానుండి జర్మనులను పూర్తిగా రష్యనులు తరిమివేసిరి. తరువాత రుమేనియా, హంగరీలపై దాడివెడలిరి. మిగిలిన మిత్రమండలివారు జూనునెలలో ఫ్రాంసు తీరమున సేనలతో దిగిరి. ఆగస్టులో పారిస్ తిరిగి స్వాధీనము చేసికొనబడెను. మరుసటినెల జర్మనీ పడమటి పొలిమేర మిత్రమండలిసేనలు దాటెను. నవంబరులో రైనునదిని వారు చేరిరి.

ఈలోగా 1943 సంవత్సరము పొడుగునను బ్రిటిషువారియొక్కయు, అమెరికనులయొక్కయు విమానములు రాత్రింబగళ్లు జర్మనుల ఫ్యాక్టరీలమీదను, జలాంతర్గాములుండు నౌకాశ్రయముల మీదను, రైలు మున్నగు రాకపోక మార్గములమీదను బాంబులను వర్షించుచుండెను. యుద్ధసామగ్రిని సైనికుల కందజేయుట జర్మనులకు దుస్సాధ్యమయ్యెను. కాని ఇంగ్లాండును ధ్వంసముచేయుటకు వారు తుదిప్రయత్నము చేసిరి. ప్రేలెడు మందుగుండు సామానుతో నింపినట్టియు, మనుష్యులకు బదులు రేడియో నడుపునట్టియు రెక్కల బాంబులను, రాకట్ విమానములను ఇంగ్లాండు మీదికి పంపిరి. వీటివల్ల చాలనష్టము కలిగెను. కాని ఇవి సమయమునకు రాకపోవుటచే జర్మనీ పరాజయము నిశ్చయమయ్యెను.

1945 ప్రారంభమున రష్యనులు వార్సాను తిరిగి పుచ్చుకొనిరి. తరువాత తూర్పుదిక్కునుండి జర్మనీపై దాడి వెడలిరి. హంగరీ ముఖ్యపట్టణమగు బుడాపెస్టు ఫిబ్రవరిలో జయింపబడెను. మార్చి నెలలో మిత్రమండలి రైనునది దాటిరి. ఏప్రియల్‌లో పరిశ్రమలతోనిండిన రూరుప్రాంతము ముట్టడింపబడెను. ఏప్రియల్ 13-వ

తేదీని రష్యనులు వియన్నా స్వాధీనము చేసికొనిరి. ఏప్రియల్ 24 తేదీని బెర్లిన్ ముట్టడింపబడెను. ఏప్రియల్ 29 తేదీని ఇటాలియన్ దేశభక్తులు ముస్సొలీనీని పట్టుకొని వెంటనే కాల్చిచంపిరి. మే 1-వ తేదీని హిట్లరు మరణించెనన్నవార్త పుట్టెను. 1945 సంవత్సరము మేనెల 7-వ తేదీని మిత్రమండలికి జర్మనీ బేషరతుగా లొంగిపోయెను.

### అభ్యాసములు

1. అడాల్ఫ్ హిట్లరునుగూర్చి సంగ్రహముగా వ్రాయుము. అతని ఉద్దేశములు, వానిని నెరవేర్చుకొనుటకు చేసిన ప్రయత్నములు, అవి విఫలమగుటకు కారణములను ఎరిగింపుము.

2. రెండవ ప్రపంచయుద్ధగతిలో మార్పులు తెచ్చిన సందర్భములేమి?

3. రెండవ ప్రపంచయుద్ధమునకును మొదటి ప్రపంచయుద్ధమునకును భేదసాదృశ్యముల నెరిగింపుము.

# 20. నేటి ప్రపంచ సమస్యలు

## 44 పాఠము : 'నలుగురు పెద్దలు': ప్రపంచము; అన్యోన్యాశ్రయము (interdependence)

[మూలప్రశ్న 87: ప్రజాస్వామిక నాయకులకును, నియంతలకును భేదములేమి?

§87. ముస్సొలీని హిట్లరులు తమ దేశములకు తమంతట తాము నాయకులైనవారు. బలము నుపయోగించి నాయకత్వమును నిలుపుకొన్నవారు. వారి పార్టీలకు అధికారము వచ్చుటకై వారు మొదట ప్రజల ఓట్లను సంపాదించినమాట వాస్తవమే కాని అధికారము వచ్చినపిమ్మట ఎదుటిపక్షమును లేకుండ జేసికొనిరి.

అట్టి నాయకత్వముగాని, అధికారమున నిల్చుటకు అట్టిచర్యల నాచరించుటగాని ప్రజాస్వామిక మున్న స్వతంత్ర దేశములో సంభవించదు. ప్రజాస్వామికనాయకుడు ప్రజల కాతనిపై విశ్వాస మున్నంత కాల మాయుద్యోగమున నుండగలడు. అతడు నియంత కాజాలడు. అతడు జాతిని నడిపించునుగాని బలాత్కారము చేయడు.

ఇది యిట్లుండుటవలననే గ్రేటుబ్రిటనుకు ప్రధానియగు నెవిలి చేంబర్లైయిను యుద్ధప్రారంభమున, 1940 సంవత్సరమున హిట్లరు బ్రిటిషుసేనలను డన్కిర్కుకు పారదోలినప్పుడు తనపదవిని వదులుకోవలసివచ్చెను. బ్రిటిషుప్రజలు, యుద్ధకాలమున తమకు సమర్థుడగు నాయకు డుండవలెనని కోరిరి. వా రెన్నుకొన్న అట్టినాయకుడు విన్‌స్టన్ చర్చిల్.

సరియైన మనుష్యులను నాయకులుగా నేర్పాటుచేయుప్రజ్ఞ ఇతనికి గలదు. ఓపికతోను, ధైర్యముతోను పనిచేయుచు పోయిన తుదకు కార్యములన్నియు చక్కబడునని ప్రజలకు బోధించు గొప్ప శక్తి ఇతనికి గలదు. చర్చిల్ వంటి గొప్పనాయకుడే అదేసమయమున అమెరికా కధ్యక్షుడై యుండుట ప్రపంచముయొక్క అదృష్టమే. ఫ్రాంక్లిన్ డిలానో రూసవెల్ట్ (Roosevelt) 1932 సంవత్సరమున ప్రథమ పర్యాయము అమెరికాకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడెను. అమెరికాఅధ్యక్షుడు నాలుగుసంవత్సరములకాల మాపదవిలో నుండును. ఏ అధ్యక్షుడును ఇంతకుముందు వరుసగా 8 సంవత్సరములు మించి ఆపదవిలో నుండలేదు. కాని 1940 సంవత్సరమున అమెరికన్ ప్రజలు, మూడవపర్యాయము రూసవెల్టును అధ్యక్షునిగా నెన్నుకొనిరి. ప్రమాదకరమగు యుద్ధకాలమున నిది చాలసహాయకారిగా

నుండెను. హిట్లరప్పుడే బ్రిటనును వశపరచుకొనగోరి దానిపై బాంబులను వేయుచుండెను. అమెరికా జర్మనీతో యుద్ధము ప్రకటించకపోయినను అమెరికానుండి బ్రిటిషువారి సహాయార్థము రూసవెల్టు యుద్ధసామగ్రిని పంపుచుండెను. అంతేకాక విమానములను, నావలను, యంత్రములను బ్రిటిషువారికి అరువిచ్చెను. 1944 సంవత్సరమున నాల్గవ పర్యాయము రూసవెల్టు మరల అధ్యక్షుడుగా నెన్నుకోబడెను. అప్పటికి అమెరికాదేశము జర్మనీ జపానులతో యుద్ధము చేయుచుండెను. దురదృష్టవశమున అతడు విజయవార్త వినకుండనే మరణించెను.

[మూలప్రశ్న 88: తమతమ దేశములకు స్టాలిన్, చీయాంగ్ కైషెక్‌లు ఏమిచేసిరి ?]

§88. సోవియట్ రష్యాయొక్క మహానాయకుడు జోసెఫ్ స్టాలిన్. 1924 సంవత్సరమున లెనిన్ మరణించినదిమొదలు రష్యాలో స్టాలినే ప్రధాననాయకుడుగా నుండెను. 1942 సంవత్సరములో యూరోపియన్ రష్యాలోని భాగ్యవంతమగు ప్రదేశములన్నియు జర్మనుల స్వాధీనములోనికి పోయినప్పుడు స్టాలిన్ రష్యా ప్రజల హృదయములలో తీవ్రప్రయత్నములు చేయుచుండవలెనను భావములను నాటెను. పెక్కు రష్యను ఫ్యాక్టరీలను, సోవియట్ యూనియన్‌యొక్క తూర్పుప్రాంతములకు, జర్మనులదాడికి అందకుండ సురక్షితముగా నుండుటకై, కదలించుటచేతనే స్టాలిన్, 1941 సంవత్సరమున రానున్న పరాజయమునుండి దేశమును రక్షించెను.

1943 డిశంబరులో ఇరాను (పర్షియా) లోని టెహిరన్ పట్టణమున స్టాలిన్, రూసవెల్ట్, చర్చిల్ సమావేశమైరి. 1945 ఫిబ్రవరి

నెలలో దక్షిణరష్యాలోనున్న యాల్టావద్ద వారు మరల సమావేశమైరి. యుద్ధకాలమునందు అన్యోన్యముగా కలిసి పనిచేయుట



యాల్టావద్ద చర్చిల్, రూసవెల్ట్, స్టాలిన్

యెట్లో కార్యక్రమము నిశ్చయించుటకీసమావేశము లేర్పాటైనవి. ప్రాతనానాజాతిసమితి యుద్ధమురాకుండ ఆపలేకపోయినది. కాబట్టి అంతకన్న మంచిపద్ధతులమీద నూతనముగా నొక నానాజాతి సమితి నేర్పాటుచేయ నాలోచించుటకు మిత్రమండలి జాతులన్నియు 1945 ఏప్రియల్ నెలలో సాన్ ఫ్రాంసిస్కోవద్ద సమావేశము కావలెననికూడ యాల్టా సమావేశములో నిర్ణయింపబడినది.

# 45 పాఠము: విజ్ఞానయుగము: ఇండియా, బ్రిటిషు జనతారాజ్యము (commonwealth)

[మూలప్రశ్న 89: ఏయే విధములుగా మనమందరమును ఒకే ప్రపంచమున నివసించుచున్నాము?]

§89. వెనుకటికాలమున నెట్లున్నను నేడుమాత్రము మనమందర మును 'ఒకే ప్రపంచము'న నివసించియున్నాము.



ఇండియాలోని నేటిపల్లె రస్తా

కావలెనన్నను చిన్న ప్రపంచములో మనము ప్రత్యేకముగా నుండలేము. అద్భుతమగు రేడియో కనిపెట్టబడినది గాన నేడు ఒక్కత్రుటిలో ప్రపంచమందలి ఒకభాగమునుండి ఇంకొక భాగ మునకుగాని, ప్రపంచమునంతను చుట్టివచ్చునట్లుగాని వార్తలు

పంపవచ్చును. లండనులో బ్రిటిషు ప్రధానిమాటలు ఆస్ట్రేలియా ప్రజ లాలించవచ్చును. కొద్దిసంవత్సరములలో తెరమీద మాటాడుచున్నవాని విగ్రహమునుకూడ మనము చూడగల్గుదుము. టెలిఫోనులో ఒకరితో నొకరు మాటాడుకొనునప్పుడు, వందల



బొంబాయి తాతా మెమోరియల్ ఆసుపత్రిలోని శస్త్రచికిత్స చేయు గది

కొద్దిమైళ్లదూరములో రెండవవా డున్నప్పటికిని ఒకరినొకరు చూచుకొనవచ్చును. ప్రయాణవేగముకూడ ఈమధ్య అధికముగా పెరిగినది. ఇండియానుండి అమెరికాకు మూడుదినములలో విమానములపై పోవచ్చును. ఇండియాలో విమానప్రయాణములు చేయవచ్చును. మనగ్రామము లన్నివిధముల బాగుపడగలవు.

భావికాలమందు గ్రామస్థులలో విద్య మార్పు గలిగించును.

20,30 సంవత్సరములపిమ్మట ప్రతిబాలుడును ప్రతిబాలికయు బడికిపోవుచుందురనియు, పెక్కురు కనీసము వ్రాయను చదువను నేర్చియుందురనియు మనము నిర్ధారణగా చెప్పవచ్చును. ప్రతి బడికిని భాండాగారముండును; రేడియో సెట్టుండును. మనభాష యేదియైనను 'ఒకేప్రపంచము'న నివసించునట్లుచేయుట కివి తోడ్పడును.

ప్రపంచములో వేరువేరుప్రాంతములం దేమున్నదో, యేమి జరుగుచున్నదో ప్రజలు తెలిసికొన్నప్పుడును, ఒకచోటునుండి ఒకచోటికి సులభముగా పోగలిగినప్పుడును, వారు ఇప్పుడు మన గ్రామస్థులు నివసించుచున్నట్లు నివసించరనుటకు సందేహములేదు.

[మూలప్రశ్న 90 : ఇండియా పారిశ్రామిక దేశమగునా?
ఇండియా బ్రిటిషుసామ్రాజ్యమున నిలుచునా?]

§90. ఇండియా పారిశ్రామిక దేశమగునా? ఎడ్లు, దున్నపోతులు పొలములను దున్నుటకు బదులు ట్రాక్టర్లచేత (మోటారు నాగళ్లచేత) భూమిని దున్నింతురా? ఫ్యాక్టరీలలో ఉక్కు మున్నగు పదార్థములతో కావలసిన వస్తువులన్నియు తయారుచేయుదురా? పైని చెప్పినమార్పులు ఇండియాలో రావలెనన్న ఇండియా పారిశ్రామిక దేశము కావలెను. రోడ్లు, మోటారు బస్సులు, స్కూళ్లు, ఆస్పత్రులు



ఇండియాలో నేటి ప్రాత వ్యవసాయపద్ధతి

ఇండియా దేశ మన్ని భాగములకును కావలసియున్నచో ఎంతో ధన వ్యయమగును. ఇప్పుడు సాగుచేయుచున్న విధముగానే ముందు కూడ జరిగిన, పై వాటికై కావలసిన ధనము ఇండియా సంపాదించ లేదు. అమెరికాలోని కృషికులును, రష్యాలోని వ్యయసాయదారు లును తమ వ్యవసాయ కార్యములు ఏవిధముగా చేసికొనుచున్నారో ఇండియాలోని వ్యవసాయదారులు తెలిసికొన్నచో ఇప్పటివలె ఒక పొలములో ఒకమణుగు ధాన్యమో ప్రత్తియో పండించి యూరు కొనరు. శాస్త్రసహాయముతో ఆ పొలములోనే మూడో, నాల్గో, పదో మణుగులు పండించగలుగుదురు.

రాజకీయముగా—అనగా ప్రభుత్వవిషయమున ఇండియా తన ప్రపంచములోనే తానుండుటకు నిశ్చయించునా? ఇతర దేశము లతో కూడునా? లేదా ఒంటరిగా తాను నిలుచునా?

సుమారు 200 సంవత్సరముల కాలముపాటు ఇండియా దేశము లోని అత్యధికభాగము బ్రిటిషువారి యధీనములో నుండెను. బ్రిటిషువారిచేతనో, బ్రిటిషువారేర్పరచినట్టిగాని, వారి యామోద మును గన్నట్టిగాని ఇండియనులచేతనో అది పరిపాలింపబడు చుండెను. 1885 సంవత్సరమున భారతజాతీయ మహాసభ (Indian National Congress) స్థాపించబడెను. ఇండియా, బ్రిటిషు జనతారాజ్యములో నుండి స్వపరిపాలన నెరవుకొనుచు నుండవలె నని మొట్టమొదట ఉద్దేశించెను. చాలా సంవత్సరములపాటు ఇండియాలోని దేశభక్తులును నాయకులు అయిన దాదాభాయి నౌరోజీ, సురేంద్రనాథబెనర్జీ, జి. కె. గోఖలే, బి. జి. తిలక్, ఆనీబెసంటు, మోతీలాల్ నెహ్రూలును సజీవులైయున్న ఇతరు లును, బ్రిటిషు పరిపాలనమండి ఇండియాను విడుదల చేయుటకై

అహింసాపద్ధతి నవలంబించి పోరాడిరి.

ఈ దీర్ఘయుద్ధము 1947 సంవత్సరము ఆగస్టు 15 తేదీని ముగిసెను. ఇండియాకు దివ్యవిజయము చేకూరెను. ప్రపంచచరిత్రలో తొలిపర్యాయము ఒక గొప్పజాతి శాంతపద్ధతుల నుపయోగించి విదేశపరిపాలననుండి విముక్తిపొంది స్వాతంత్ర్యము సాధించగలిగెను. ఇండియాప్రభుత్వమును సంపూర్ణముగా ఇండియనుల కప్పగించుటకు బ్రిటిషువారు సమ్మతించిరి. బ్రిటిషు పార్లమెంటు 1947 జూలైలో, ఇండియన్ స్వాతంత్ర్యశాసనమును ఆమోదించెను.

భారతజాతీయ మహాసభ, ప్రజాస్వామికముయొక్క ప్రధాన సిద్ధాంతమునకై పోరాడెను. అదేమనగా—పాలితుల స్వేచ్ఛామోదమును బడసి పరిపాలించుట. కాబట్టియే ఇండియన్ ముస్లిములలో అధికసంఖ్యాకులు పాకీస్థానములో సొంతముగా ప్రత్యేక ప్రభుత్వమును పెట్టుకొనుటకు హక్కునుకోరగా కాంగ్రెసు సమ్మతించెను. ముస్లిములీగు అధ్యక్షుడగు యం. ఎ. జిన్నాగారు ముస్లిముల నాయకత్వము వహించెను. (పాకీస్థాన మనగా ముస్లిములు అధికసంఖ్యాకులుగా నుండు ప్రదేశములు). అంతఃకలహములు చెలరేగనిచ్చుటకన్న దేశవిభజనమునకు సమ్మతించుటయే మంచిదని కాంగ్రెసు తలచెను. ఈ విషయమున అబ్రహాంలింకను చేసినట్లు చేయ వారియ్యకొనలేదు. అబ్రహాంలింకను నాయకత్వమున అమెరికన్ అంతఃకలహము జరిగెను. అమెరికా సంయుక్తరాష్ట్రములందలి దక్షిణరాష్ట్రములను అమెరికన్ యూనియన్‌లో నిలుచునట్లు నిర్బంధించుటకై పోరాటము జరిగెను (22 పాఠము చూడుము.)

మానవజాతి శ్రేయస్సునకేపద్ధతి మంచిదైనదియు, వివేకయుక్త

మైనదియు చరిత్రయే నిర్ణయించగలదు. ఈ నిర్ణయమునకు ఫలితముగా, ముస్లిము లధికసంఖ్యాకులుగానున్న ప్రదేశములైన, పశ్చిమ పంజాబు, సింధుదేశము, బెలూచిస్థానము, తూర్పుబెంగాలును మరి కొన్ని ప్రదేశములును, ఇండియాలో చేరవు. ఈ ప్రదేశము లన్నియు స్వపరిపాలన చేసికొను అధినివేశ (dominion) రాజ్యములుగా పాకీస్థాన మనుపేర ఏర్పడినవి. దీనిరాజధాని కరాచీ.

ఈరెండు అధినివేశరాజ్యములును (ఇది వ్రాయుచున్న కాలమున) తమతమ రాజ్యాంగవ్యవస్థ (constitution) లను నిర్ణయము చేసికొనుచున్నవి. ఇండియాసంయోగ ప్రజాప్రభుత్వము (federal republic) అగుటకు ఇదివరలోనే నిర్ణయమైనది.

బ్రిటిషు జనతారాజ్యమందలి అధినివేశరాజ్యము లన్నింటికిని, దానిలో నిలుచుటకుగాని, పూర్తిగా స్వతంత్రముగా నుండుటకుగాని నిర్ణయించుకొను అధికారము కలదు. నూతన అధినివేశ రాజ్యములగు ఇండియా పాకీస్థానములు ఈ విషయమై నిర్ణయము ముందుముందు చేసికొనవలసియున్నది. దేశరక్షణము, వర్తక నిర్ణయములు, అంతర్జాతీయశాంతి అను విషయములపై నిది ఆధారపడియున్నది. పర్వతములు, సముద్రములు పొలిమేరలుగా ఉండుటవల్లగాని, సాయుధసైనికులున్నంత మాత్రమునగాని నేటికాలమున నేదేశమును సురక్షితముగా నుండజాలదు. అన్ని జాతులును అన్యోన్య సహాయము చేసికొనుచు ప్రపంచమున శాంతిని స్థాపించ ప్రయత్నించిననేగాని, అందరికిని ఉపద్రవము కలిగించు కాటకములు రోగములురాకుండ నివారించిననే కాని ప్రపంచ మభివృద్ధినందనేరదు. ఈ యుద్దేశముతోనే 1945 సంవత్సరమున సంయుక్తజాతుల సంఘము (U. N. O.—United Nations

Organization) స్థాపింపబడినది. ఒడంబడిక పత్రములో చేవ్రాలు పెట్టినవారిలో ఇండియా ప్రతినిధికూడ ఉండెను. భారత ప్రజా పరిషత్తుచేసిన మొదటితీర్మాన మీక్రింది ఉదారమగు ఆశయముతో ముగియుచున్నది—ఈ ప్రాచీనభూమి ప్రపంచములో న్యాయమగు గౌరవస్థానము పొందుటయును, ప్రపంచశాంతికిని మానవజాతి కల్యాణమునకును ఇష్టముతో సంపూర్తిగా ఇతరులతోపాటు పనిచేయుటయును ఈ పరిషత్తు లక్ష్యము.

## 46 పాఠము: నాగరికతయొక్క భావి

[మూలప్రశ్న 91: మనము వెనుకటికన్న ఎక్కువగా నాగరీకుల మగుచున్నామా ?]

§91. మొదటి పాఠములో మనము వేసికొన్న ప్రశ్నకు సమాధానము నెంతవరకు చెప్పగలిగితిమో ఇప్పుడు చూతము. ఆ ప్రశ్న ఇది: నేటి మానవులు ప్రపంచనాగరికతకు తోడ్పడు పనులు చేయుచున్నారా ?

మొదటి పాఠములో మన ముదహరించిన నాలుగు విషయములున్నవి. అందమగు వస్తువులు తయారుచేయుట; స్వేచ్ఛగా ఆలోచించుట; క్రొత్తవిషయములగూర్చి ఆలోచించుట; కలిసిమెలిసీ యుండుటకై ఏర్పరచిన నిబంధనలను పాలించుట.

అందమగు వస్తువులను తయారుచేయువిషయమున ప్రపంచము ముందడుగు వేయుచున్నదని మన మంగీకరించవచ్చును. అందవికారములగు వస్తువులనుకూడ మన మెన్నో తయారుచేసియున్నాము. ఉదాహరణము—క్రిక్కిరిసియున్న ఫ్యాక్టరీలు, అపరిశుభ్రమగు నగరములు. కాని అట్టి అందవికారములగు వస్తువులను పరిత్యజించుటో, వానిని పరిశుభ్రముగా చేసికొనుటో

ఏదో యొకటి చేయవలెనని ప్రయత్నించుచున్నాము. విద్యుత్తును వాడుటవలన చాలవరకు పైకార్యములు నెరవేరుచున్నవి.

క్రొత్తవిషయములనుగూర్చి ఆలోచించువిషయముననుు, క్రొత్త వస్తువులు సృష్టించువిషయముననుకూడ ప్రపంచము అభివృద్ధిని చూపినది. యుద్ధకాలమునందుకూడ ఒక్కొక్కప్పుడు యుద్ధము కారణముగా క్రొత్తసృష్టములు జరిగినవి. పెద్దపెద్దబరువులను, ఎంతోదూరము ప్రచండవేగముతో యుద్ధకాలమున తీసికొనిపోవలసివచ్చుటచేత విమానములు లోపరహితముగా చేయబడినవి. వైద్యమును, శస్త్రచికిత్సయుగూడ అద్భుతముగా వృద్ధినందినవి. వ్యాధులు జనులకు రాకుండ నివారించు విషయమునకూడ అభివృద్ధి ఎక్కువగా జరిగినది.

మిగత రెండు నాగరికతాలక్షణముల విషయముననుు అంతగా అభివృద్ధిలేదు. స్వేచ్ఛగా ఆలోచించువిషయమున యూరోపులోని చాలదేశములలో కడచిన 10,15 సంవత్సరములలో అభివృద్ధిలేదు. సరికదా దానికి నిరోధముకూడ కలిగినది. తమ యభిప్రాయములతో నేకీభవింపనివారిని ఏవిధముగా హిట్లరు ముస్సోలీనీలు వదల్చుకొనిరో, ఆవిధముగా తమపార్టీల నెట్లు అధికారమునందుంచగలిగిరో 16,19 పాఠములలో మనము తెలిసికొనియున్నాము. నిజమైన ప్రజాస్వామిక మున్నదేశములలో మాత్రము ప్రజలు స్వేచ్ఛగా మీాటింగులు పెట్టుకొనవచ్చును; పుస్తకములు వార్తాపత్రికలు వేసికొనవచ్చును; భయములేకుండ ప్రభుత్వాచర్యలు విమర్శించవచ్చును. జర్మనులతో 1941 మొదలు 1945 వరకు ధైర్యముతో పోరాడిన సావియట్ ప్రజలు గలిగినట్టియు, ప్రతివానికిని సంఘలాభములలో సమానభాగము పంచియిచ్చుటకు

ఉచితవిద్య, వైద్య సహాయము, క్రీడలు మున్నగు ఎన్నియో అభివృద్ధి మార్గముల పన్నినట్టియు రష్యాదేశములో సైతము అభిప్రాయములు పెట్టుకొనుటకును ప్రకటించుటకును స్వేచ్ఛ లేదు. రష్యాలో ప్రభుత్వము కమ్యూనిస్టు నిరంకుశప్రభుత్వము. సోషలిస్టు ప్రజాస్వామికము కాదు. నిరంకుశప్రభుత్వ మామోదించువారు, ప్రజాస్వామికము సమర్థప్రభుత్వము కాదని వాదింతురు (26 పాఠము చూడు). జాతి కేది శ్రేయస్కరమో తెలిసిన సమర్థులగు నాయకులచే పాలింపబడుటయే ప్రజలకు మంచిదని వా రందురు. రెండవపక్షము చూచిన, నాయకునిచేతిలోనికి సర్వాధికారమును వచ్చిన అతడు నిరంకుశు డగునని చరిత్ర విస్పష్టముగా చాటించు చున్నది. (ఉదా. లూయీ XIV; నెపోలియను; ముస్సోలినీ; హిట్లరు). కొద్దిమందిచేతులలో గొప్పఅధికారమును పెట్టకుండ, స్వేచ్ఛగా ఆలోచించుకొనుటకుగాని, అభిప్రాయములను ప్రకటించుటకుగాని ప్రతిమానవునకును ఉన్న హక్కును తొలగించకుండ, వివేకు లగు పౌరులసహాకారముతో ప్రపంచమును పరిపాలించదగిన ఉత్తమమార్గమును మానవు లింకను కనుగొనవలసియున్నది. ఆలోచనచేయుటకును, అభిప్రాయముల వెల్లడించుటకును స్వేచ్ఛ లేకున్న మానవుని మనస్సు సక్రమముగా పెరిగి, సంపూర్ణముగా వికసించజాలదు.

కలిసిమెలిసి యుండుటకై ఏర్పరచిన నిబంధనలను పాలించు విషయమున నేటిజాతులు ఎంతమాత్రము కృతార్థులు కాలేదు. శాంతముగా జీవితయాత్ర సాగించుట కవసరమైన నిబంధనలను వారేల పాలించలేకపోయిరో మనము తెలిసికొందము.

ఇందుకు మొదటికారణము ప్రతిజాతియు తన వ్యవహారవిషయ

మున తానే న్యాయాధికారిగా పనిచేయగోరెను. నానాజాతిసమితి పరిష్కారమున కేజాతియు సమ్మతించలేదు. ఒకవేళ సమ్మతించినను దాని తీర్మానము తమ కనుకూలముగా లేకున్నచో దానిని శిరసావహించుట కిష్టపడలేదు. తనతీర్పును శిరసావహింపజేయుటకు నానాజాతిసమితి కధికారములేదు. సాన్‌ఫ్రాంసిస్కోలో క్రొత్త లీగును పెట్టుటకు తీర్మానించిరి. ఆలీగున కీయధికారమున్నగాని యుద్ధములురాకుండ నది యాపలేదు.

ఈ విషయమును కొంత లోతుగా పరిశీలించి చూతము. జాతులొకరొకరితో నేల కలహింతురు? ఎవరిమట్టుకు వారు శాంతముగా నేల బ్రదుక సమ్మతింపరు? ఇందుకు మొదటికారణము—ఎక్కువ యధికారము కావలెననిగాని ఇతర దేశములనుండి భూములను కలుపుకొని తమ దేశమును వృద్ధిచేసికొవలెననిగాని అత్యాశ బెట్టుకొన్న నాయకు లుండుట.

రెండవకారణము 'ఆర్థికావశ్యకత.' దీనిని వదల్చుకొనుట మిక్కిలి కష్టము. ఒక దేశములో ఈక్రింది పరిస్థితులు తటస్థించినప్పుడు ఆర్థికావశ్యకత తలచూపి వృద్ధియగును.

1. ఒక దేశములోని జనసంఖ్య నానాటికిని వృద్ధియగుచుపోయి, ఆ దేశమున పండించగలిగిన పంటలు వారికి సరిపోనప్పుడును,

2. ఒకగొప్ప పారిశ్రామిక దేశము తన సొంత వ్యాపారరంగములలో అమ్మలేనన్ని వస్తువులను తయారుచేసి, ఇతర దేశముల వ్యాపారరంగములలో వాని నమ్మదలచినప్పుడును,

3. తనపరిశ్రమలకు కావలసిన కొన్నిరకముల ముడివస్తువులను ఒక దేశము పండించుకొలేక ఆవస్తువుల నితర దేశములనుండి సంపాదింప యత్నించినప్పుడును,

ఆర్థికావశ్యకత పెరుగును.

[మూలప్రశ్న 92: శాంతముగా కలిసి మెలిసి జీవించుట యను సమస్య నెట్లు పరిష్కరించవచ్చును?]

§92. పైని ఉదహరించిన ప్రతియొక్క విషయమును పట్టిచూచి, ఈ సమస్యా పరిష్కారము శాంతముగా జేయుటకు మార్గమున్న దేమో చూతము.

1. ఇంకొక దేశముయొక్క భూములను ఒక దేశము కలుపుకో కుండ ఉండవలసినచో, ఒక దేశమందలి అదనపు ప్రజలను ఇంకొక దేశమునకు జీవనార్థము పంపకుండ ఉండవలసినచో చేయదగ్గపని యొక్కటి యున్నది. ఆ దేశమందలి భూమి మరింత సారవంతము చేయవలసియున్నది. సాగుచేయుట కనుకూలించు భూమినంత యును సాగుకు తెచ్చి ఎక్కువ పంటలు పండించవలసియున్నది. మంచి నీటిపారుదల, మంచి పద్ధతులమీద వ్యవసాయము, మంచి విత్తనములు, మంచి ఎరువులు, వరదలవల్ల ముంపులురాకుండ భూమిని కాపాడుట—ఈవిధములుగా దేశమును వృద్ధిచేసికొన వచ్చును. విజ్ఞానశాస్త్రపరిశోధన లిందుకు తోడ్పడును.

2. అవసరమునుమించి దేశము లేల వస్తువులను తయారుచేసి కొనవలెను? కారణమేమనగా అదనముగా తయారుచేసిన వస్తువుల నమ్మి లాభములు చేసికొనవచ్చును అని. ఇట్లు వచ్చిన అదనపు సొమ్ముతో ఇతరపనులు చేసికొనవచ్చును. ఇది తగ్గించుటకు మార్గము—లాభముకొరకు ఏవస్తువులను ప్రజలు తయారుచేయరా దను నియమ ముండవలెను. ప్రజలకు బదులు ప్రభుత్వమే అన్ని వస్తువులు తయారుచేయవలెను. దేశముయొక్క ఉపయోగము నకు సరిగా కావలసినన్ని వస్తువులనే తయారుచేయవలెను. సో

యట్ రష్యాలో ఈవిధముగానే జరిగినది. కాని ఇతర దేశముల లోని ప్రజలు లాభముకొరకు వస్తువులను తయారుచేయుట మానమన్న మానుట కిష్టపడరు. వస్తువులన్నియు గవర్నమెంటే తయారుచేయ మొదలుపెట్టినచో ప్రజలు సోమరు లగుదురనియు, వస్తువులు చక్కగా ఉండవనియు వారి యుద్దేశము.

3. శాస్త్రజ్ఞు లిప్పు డెన్నో అద్భుతకార్యముల చేయగలుగు చున్నారు. ముడివస్తువుల సమస్యను వారు పరిష్కరించుటకు వీలు కావచ్చును. ఉదాహరణము—శీతల దేశములలో రబ్బరు మొక్కలు పెరుగవు. కాని రసాయనద్రవ్యములసహాయముతో నెచ్చోటనైన నేడు రబ్బరు తయారుచేయవచ్చును. కొంతకాలమైనపిమ్మట ఏ వస్తువునైనను రసాయనపద్ధతులప్రకారము తయారుచేయవచ్చు నని తోచుచున్నది. ఇదివరలో పెంచుటకు సాధ్యపడని మొక్కలను క్రొత్తస్థలములలో నేడు పెంచుటకు సాధ్యపడవచ్చును. ఉదా హరణము —మిక్కిలి శీతలప్రదేశములలో పెరుగుచున్న రబ్బరు చెట్లనుండి నేడు రబ్బరు తయారుచేయుచున్నారు. బీట్ దుంపనుండి చక్కెర తయారుచేయుచున్నారు. ఆర్క్టికువలయము (arctic circle)— నందలి భూములలో సైతము నేడు గోధుమలు పండించుచున్నారు.

సమస్యలను పరిష్కరించుటకు పై మార్గములు సూచింపబడినవి. మూడుప్రశ్నలకును పైని ఉదహరించినవే ఉత్తరములని అనుకొన రాదు. ఈ మూడుసమస్యలను పరిష్కరించినతోడనే ప్రపంచము లోనికి శాంతి యవతరించుననియు అనుకొనరాదు. ఇంకొక విషయము. వెంటనే మానవజాతి ఈ సమస్యలను పరిష్కరించు కొనలేకపోయినదని నిరాశచెందరాదు. మానవుడు భూమిపైకి [illegible] సుమారు 10 లక్షల సంవత్సరములుమాత్రమే అయినది.

అతడు నాగరీకు డగుటకు ప్రారంభించి 10 వేల సంవత్సరములు కావచ్చినది. 10 లక్షల సంవత్సరములలో 10 వేల సంవత్సరములు నూరు సంవత్సరములలో ఒకసంవత్సరము వంటివి. కాబట్టి మానవుడు ఇప్పుడు సంవత్సరములోపు వయస్సుగల శిశువువంటివాడు. ఇప్పుడే నడువ నేర్చుకొనుచున్నాడు.

ఈ గ్రంథములో మొదటి కొలదినిమిషముల ప్రయత్నమే నేను చెప్పితిని. 1450 సంవత్సరమునుండి 500 సంవత్సరములలో మానవుడు చూపిన యభివృద్ధి అసామాన్యముగా నున్నది.

కాని అతడు తప్పులుచేయుచున్నాడు, అనుభవము సంపాదించుకొనుచున్నాడు. మనము తొందరపడరాదు. మానవుని కృషి ఫలించితీరును. అతడు సంపూర్ణమానవుడు కాగలడు.

## అభ్యాసములు

1. నలుగురు పెద్దనాయకులలోను ఒక్కొక్కరినిగురించి సంగ్రహముగా వ్రాయుము.

2. కొద్దిసంవత్సరములలో హిందూదేశమందలి గ్రామస్థుని జీవితమున ఏయే విధములగు మార్పులు గలుగవచ్చును ? ఏల ?

3. 'ఆర్థికావశ్యకత'కు సంబంధించిన సమస్యల నెట్లు పరిష్కరించవచ్చును?

4. ప్రపంచశాంతి ఎట్లు సమకూరగలదు ?

# పరిభాష పట్టీ (ఇంగ్లీషు అర్థముతో)

అఖాతము = bay
అఖండైకాధిపత్యము = absolute monarchy
అవిజ్ఞాత భూఖండము = dark continent
అధినివేశరాజ్యములు = dominions
అధినివేశములు = colonies
అన్వేషకుడు = explorer
అభ్యర్థి = candidate
అంతర్జాతీయ = international
అంతఃకలహము = civil war
ఆటలమ్మ = chicken-pox
ఆర్క్టిక వలయము = arctic circle
ఆర్థికావశ్యకత = economic necessity
ఆవిరిశక్తి = steam power
ఆవిరి ఇంజను = steam engine
ఇన్ఫ్లుయంజా = influenza
కమ్యూనిజము = communism
కాన్వెంటు = convent
కామన్సు సభ = House of Commons
కార్బాలిక ఆమ్లము = carbolic acid
కాంసులు = consuls
క్రిమిహారులు = antiseptics
కుటీరపరిశ్రమ = cottage industry
క్రూసేడులు = crusades
క్లోరోఫారము = chloroform
గుండీ = button

గురుత్వాకర్షణ సిద్ధాంతములు = law of gravitati
గోళార్ధము = hemisphere
జలచక్రము = waterwheel
జలపాతము = waterfall
జనతారాజ్యము = commonwealth
జాతి = nation
జాతీయత = nationalism
టీకాలు = vaccination
డివిడెండు = dividend
డ్యూకు = duke
దేశాన్వేషణము = exploration
దైవదత్తాధికారము = divine right
ధమనులు = arteries
ధనికాధిపత్యము = plutocracy
నాజిజమ్ = nazism
నానాజాతిసమితి = League of Nations
నావికదిక్సూచి = mariner's compass
నియమ బద్ధైకాధిపత్యము = limited monarchy
నియంత = dictator
నిసర్గవరణ = natural selection
న్యూమోనియా = pneumonia
నౌకాధిపతి = admiral
పరమాణువు = atom
పవనస్థితి = weather
పరిణామ సిద్ధాంతము = theory of evolution
పిల్గ్రీం ఫాదరీలు = Pilgrim Fathers
పురోహితుడు = priest

పెట్టుబడి = capital
పోపు = Pope
పౌరసత్వము = citizenship
పంపు = pump
ప్రకృతి సిద్ధాంతము = law of nature
ప్రజాప్రభుత్వము = democracy
ప్రభువులు = nobles
ప్రయోగములు = experiments
ప్రయోగశాల = laboratory
ప్రొటెస్టెంటు = Protestant
ఫాక్టరీ = factory
ఫాసిజమ్ = facism
ఫ్యూడల్ యుగము = feudal age
ఫెడరల్ ప్రభుత్వము = federal government
ఫోనోగ్రాఫు = phonograph
భారతజాతీయ మహాసభ = Indian National Congress
బిషప్పు = bishop
బోల్షివిక్కులు = bolsheviks
బ్రాడ్కాస్టు = broadcast
మఠము = monastery
మఠస్థుడు = monk
యుద్ధనౌకాదళము = armada
యూదుడు = Jew
రక్తప్రసరణము = circulation of blood
రసాయనద్రవ్యము = chemicals
రాజ్యాంగవ్యవస్థ = constitution
రిపబ్లిక్ = republic

రేడియో = radio
లార్డ్సుసభ = House of Lords
లిబరల్ = liberal
లోయ = valley
వంశము = race
వ్యాపారరంగము = market
విజ్ఞానశాస్త్రము = science
విద్యుత్తు = electricity
విప్లవము = revolution
విమానము = aeroplane
విశ్వవిద్యాలయము = university
శాస్త్రవిధానము = scientific method
సముద్రాంతరిత సామ్రాజ్యము = overseas empire
సామ్రాజ్యవాదము = imperialism
సిరలు = veins
సూక్ష్మదర్శిని = microscope
సృష్టము = invention
సృష్టించు = invent
సెప్టిక్ = septic
సంయుక్త అధినివేశరాజ్యము = federal dominion
స్వల్పజనాధిపత్యము = oligarchy
స్విచ్చి = switch
X-కిరణములు X-rays


ఫ్రెంచ్ కెనడా
న్యూ ఇంగ్లండ్
కేబట్ (1494)
పిల్గ్రిమ్ ఫా
వర్జీనియా
రాలీ
టెక్సాస్
ఫ్లోరిడా
మెక్సికో
వాట్లింగ్
కార్టెజ్ (1519)
హిస్పానియోలా
డ్రేక్ (1579)
పెరు
పిజారో (1530)
బ్రెజిల్
మగెల్లన్ (1520)
మార్కో పోలో (1271–95)
కొలంబస్ (1492)
వాస్కో డగామా (1498)
మగెల్లన్ (1519)
డ్రేక్ (1577)
ఫాదర్స్ (1620)